# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుగురామాయణము | 2 | 8 |
| అడవిమల్లెలు, ఏనమండ్ర నారాయణమూర్తిగారిది | 1 | 0 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | 1 | 0 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | 2 | 0 |
| అనుభవసారము | 1 | 0 |
| అప్పకవీయము, శ్రీ గిడుగురామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది | 5 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకం | 0 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము. 2 సంపుటములు | 15 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము, అనేక వ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతో పరిష్కరింపబడినది. | | |
| ఆది, సభాపర్వములుగలసంపుటము | 4 | 0 |
| ఆరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటం | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | 11 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 |
| శాంతిసప్తకము | 7 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికో | 2 | 8 |
| ఆంధ్రభారత విమర్శనము వల్లాది సూర్యనారాయణశాస్త్రిది | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము; కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | 5 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము కాలికోబైండు | 2 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము సటీక | 1 | 4 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | 1 | 4 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | 6 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | 3 | 0 |
| కళాపూర్ణోదయము, | 4 | 0 |
| లఘుటీకతో | 6 | 0 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవత) | 0 | 8 |
| డిటో గట్టుప్రభుకృతము | 1 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము | 1 | 0 |

శ్రీరస్తు

# శ్రీవాసుదేవమననము

శ్రీవాసుదేవయతీంద్రవిరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము

1958

# విషయసూచిక

శ్రీ ర స్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ వాసుదేవమననము

## ప్రథమవర్ణకము

శ్లో. బోధానందఘనం నిరస్తసకలం కారుణ్యపూర్ణేక్షణం
మూఢానా ముపదేశకం చ సతతం పాపాత్మనాం పాపహామ్,
వైరాగ్యం చ విరాగిణాం సుఖకరం సంపాదకం సర్వదా
శ్రీమద్దేశికవాసుదేవయతినం మూఢాత్మకోఽహం భజే..

యస్యాత్మభూతస్య గురోః ప్రసాదా
దహం విముక్తోఽస్మి శరీరబంధాత్,
సర్వోపదేష్టుః పురుషోత్తమస్య
తస్యాంఘ్రియుగ్మం ప్రణతోఽస్మి నిత్యమ్.

మూఢా న్వివేకినః కృత్వా లోకే సర్వోపదేశికః,
య స్తిష్ఠతి చ తం శ్రీమద్వాసుదేవగురుం భజే.
అనుగ్రహార్థం మర్త్యానాం సంస్కృతానధికారిణామ్,
వివేకసారః శ్రోతౄణాం రచ్యతే భాషయా మయా.
అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే.

### మోక్షోపాయము

ధర్మార్థకామమోక్షము లనెడి పురుషార్థచతుష్టయములో "న స పునరావర్తతే, న స పునరావర్తతే" యనుశ్రుతి ప్రమాణముగ నిత్యమైనదగుటవలన మోక్షమే పరమపురుషార్థము. ధర్మార్థకామము లనిత్యములు. ఏలయన; "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే" "ఏవమేవా ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" ఇత్యాది శ్రుతులవలన నీలోకమున్న

కర్మములు క్షీణించిన లోకమును క్షీణించునట్లు, పుణ్యము క్షీణింపఁగాఁ బరలోకమును క్షీణించునని తెలియుచున్నది. మోక్షము బ్రహ్మజ్ఞానము చేతనే సిద్ధించును. ఇందుకు—"తమేవం విదిత్వాఽతిమృత్యు మేతి" "నాన్యః పంథా విద్యతేఽయనాయ" "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది శ్రుతులు ప్రమాణములు. మఱియు—"న కర్మణా న ప్రజయా ధనేక త్యాగేనైకేఽమృతత్వమానశుః" అనెడి శ్రుతిప్రకారము, అమృతత్వము (జననమరణప్రవాహవర్జిత మగు ముక్తి) యజ్ఞయాగాదిపుణ్య కర్మములు చేయుటవలనఁగాని, గుణవదాయుష్మత్పుత్రప్రాప్తివలనఁగాని, దానభోగసహిత ధనప్రాప్తివలనఁగాని లభింపదు. కావున ధర్మార్థకామ ముల నుపేక్షించి, మోక్షముకొఱకు ప్రయత్నించుటయే పరమపురు షార్థము; నరజన్మమునకు ఫలమును. ఆమోక్షము బ్రహ్మానుభవము వలననే లభించును. ఆపరబ్రహ్మతత్త్వము అధ్యారోపాపవాదములవల్లఁ దెలిసికొనవలెను.

## అధ్యారోపము

అధ్యారోపమనఁగా, ఒకవస్తువును మఱియొకవస్తువుగ భ్రమించుట. అది యెటువలెననిన; శుక్తియందు రజతత్వాధ్యారోపము, రజ్జువునందు సర్పత్వాధ్యారోపము స్థాణువునందు పురుషత్వాధ్యారోపము, *మరుమరీచికలయందు జలత్వాధ్యారోపము, ఆకాశంబునందు నీలత్వాధ్యారోపము.

ఇవి యెటులనో అటులనే నిష్ప్రపంచస్వరూపుఁడైన ఆత్మ యందు ప్రపంచముయొక్క ఆరోపము అధ్యారోపము. ఈ యధ్యారోపము అధిష్ఠానాజ్ఞానముచేత వచ్చినది. ఆ యజ్ఞానముయొక్క స్వరూపమును వెనుక స్పష్టంబుగ నిరూపించుచు నిచ్చట సామాన్యంబుగ నిరూపించుచున్నారము. ఒక అజ్ఞానమే ప్రకృతి యనియు, తమస్సనియు, మాయ యనియు ననేకవిధంబులుగాఁ జెప్పఁబడును. ఆప్రకృతిస్వరూపమును నిరూపించుచున్నారము అది యెట్లులనిన; గుణంబులయొక్క సామ్యావస్థకు ప్రకృతి యని పేరు. ఇదియే ప్రళయావస్థ యనియు, మహాసుషుప్తి యనియుఁ జెప్పఁబడును.

* మరుమరీచికలు = ఎండమావులు.

ఈ గుణసామ్యావస్థకు దృష్టాంతము—

తెల్లనూలు, ఎఱ్ఱనూలు, నల్లనూలు ఈమూఁడును సమంబుగాఁ జేర్చి పేనిన త్రాఁడువలె మూలప్రకృతి సత్త్వరజస్తమోగుణసముదాయ రూపమయి యుండును.

ఈప్రకృతిలో ననేకకోటిజీవరాసులు తమయొక్క కర్మములు వాసనలు అదృష్టములతో కూడ లయించియుండును. అది యేలాగనఁగా; మైనపుటుండలో స్వర్ణరేణువులు ఎటుల లీనమైయున్నవో అటుల లీనమయి యుండును. ఇందుకు ఏకదేశము సర్వానుభవమయిన సుషుప్తియే దృష్టాంతము. బహుకాలము లీనమయియుండఁగా నొకసమయమందు లీనమయిన జీవుల యదృష్టములు పరిపక్వమౌను. ఆసమయమందు త్రిగుణాత్మకమైన ప్రకృతి సత్త్వగుణము విజృంభించుటచేత మాయ యని చెప్పఁబడును. ఈమాయయందు ప్రతిఫలించిన చైతన్యమును ఆమాయయును మాయాధిష్ఠానమయిన చైతన్యమును ఈమూఁడునుం గూడి యీశ్వరుఁడని చెప్పఁబడును. ఆ యీశ్వరునికే అంతర్యామి యనియు, అవ్యాకృతుఁ డనియును రెండుపేళ్లు గలవు. ఇతఁడే జగత్స్రష్ట యనియుం జెప్పఁబడును. ఇంతియకాక సృష్టిఁజేయుటకు నుపాదానకారణ మనియును, నిమిత్తకారణ మనియును, రెండుకారణములు గావలయు నని లోకమందు కన్నారము. అది యెటు లనిన; ఘటశరావాదులపుట్టుకకు మృత్తు ఉపాదానకారణము. కులాలుండును, దద్వ్యాపారాదులును నిమిత్తకారణంబులు. పటనిర్మాణమందలి తంతువు లుపాదానకారణంబు. తంతువాయుఁడు, తురిమెవాద లు నిమిత్తకారణము. ఈ ప్రకారము లోకమునందు రెండుకారణములచేతను, ఘటపటాద్యుత్పత్తి యెటులనో దార్ష్టాంతికమందును రెండు కారణములచేత జగత్తున కుత్పత్తి యని తోఁచుచున్నది. అది యెటులనఁగా; మాయ యుపాదానకారణంబును, ఈశ్వరుఁడు నిమిత్తకారణంబు నని చెప్పుదమన; శ్రుతికి విరుద్ధముగా నున్నది. ఇంతియకాక, ఉపాదానకారణము సత్పదార్థమయియుండవలెను. అటుల నుండెనేని మాయయును, ఆత్మయును రెండు పదార్థము లాయెను. కనుక నద్వైతహాని వచ్చును.

కాబట్టి యీపక్షము కూడదు. మాయ నిమిత్తకారణ మనియును, ఈశ్వరుఁడు ఉపాదానకారణ మనియు చెప్పెద మన్న పూర్వమువలె నద్వైతశ్రుతికి విరోధముగా నున్నది.

లోకమునందు చేతనునే నిమిత్తకారణముగా కన్నారము. అచేతనమయిన మాయ నిమిత్తకారణము కానేరదు. కనుక అద్వైతహాని వచ్చును. ఈదోషము లుండుటవలన కేవలమయినమాయ యుపాదాన కారణమును గానేరదు. నిమిత్తకారణమును కానేరదు. కనుక నిమిత్త కారణత్వంబును, ఉపాదానకారణత్వంబును ఈశ్వరునికే చెప్ప వలెను.

రెండుకారణంబు లొకని కెట్లు చెప్పవచ్చుననిన ; లోకమునం దూర్ణనాభి (సాలెపురుగు) శరీరప్రధానమయి యుపాదానకారణం బాయెను. బుద్ధిప్రధానమయి నిమిత్తకారణ మాయెను. అటులనే యీశ్వరుండును సత్త్వగుణప్రధానమయిన మాయతోఁగూడి ఉపాదానకారణంబు నయ్యెను. ఈయుభయకారణమైన యీశ్వరుఁ డొకని వలననే జగదుత్పత్తి యైనవిధంబుఁ జెప్పెదము.

ఈశ్వరుండు సత్త్వగుణప్రధాన మైన మాయతోడం గూడి తమోగుణప్రధాన మయినమాయను వీక్షించె. తమోగుణప్రధానమైన మాయతోడం గూడిన చైతన్యమువలన త్రిగుణాత్మకమయిన యాకాశంబు పుట్టెను. ఆకాశవిశిష్టచైతన్యంబువలన త్రిగుణాత్మకంబైన వాయువు పుట్టెను. వాయువుయొక్క విశిష్టచైతన్యంబువలన త్రిగుణాత్మకంబైన తేజస్సు పుట్టెను. తేజోవిశిష్టచైతన్యంబువలన త్రిగుణాత్మకంబైన జలంబు పుట్టెను. జలవిశిష్టచైతన్యంబువలన త్రిగుణాత్మకంబైన పృథ్వి పుట్టెను. ఇవి అపంచీకృతభూతము లనియు, సూక్ష్మభూతము లనియు, తన్మాత్రలనియు చెప్పఁబడును. ఈ భూతములవలన వ్యష్టి సమష్ట్యాత్మకమయిన లింగశరీరంబు పుట్టెను. వ్యష్టిసమష్టిలక్షణమును ముందఱ నిరూపించుచున్నారము.

లింగశరీరముయొక్క పదియేడవయవముల యుత్పత్తిఁ జెప్పుచున్నారము. ఆకాశముయొక్క సాత్త్వికాంశంబువలన శ్రోత్రేంద్రి

యంబును, వాయువుయొక్క సాత్త్వికాంశంబువలన త్వగింద్రియం బును, తేజస్సుయొక్క సాత్త్వికాంశంబువలన చక్షురింద్రియంబును, జలముయొక్క సాత్త్వికాంశంబువలన జిహ్వేంద్రియంబును, పృథ్వి యొక్క సాత్త్వికాంశంబువలన ఘ్రాణేంద్రియంబునుం బుట్టెను. ఈ భూతములయొక్క సాత్త్వికాంశసమష్టివలన అంతఃకరణంబు పుట్టి, అది వృత్తిభేదములచే మనోబుద్ధిచిత్తాహంకారంబు లాయెను. వీనిలో బుద్ధియందు అహంకారమునకును, మనస్సునందు చిత్తమునకును అంత ర్భావములు.

ఆకాశముయొక్కరజోంశంబువలన వాగింద్రియంబును, వాయువు యొక్క రజోంశంబువలన పాణీంద్రియంబును, తేజస్సుయొక్క రజోంశంబువలన పాదేంద్రియంబును, జలముయొక్క రజోంశంబువలన పాయ్వింద్రియంబును, పృథ్వియొక్క రజోంశంబువలన నుపస్థేంద్రియం బునుం గా నేతత్ప్రకారంబున కర్మేంద్రియంబు లుత్పత్తియాయెను.

ఈభూతములయొక్క రజోంశసమష్టివలన ప్రాణము పుట్టి అది వృత్తిభేదములచేతను, ప్రాణాపానవ్యానోదానసమానంబు లన నైదు విధంబులైనవి. వీనిలో నుపవాయువులు అంతర్భూతములై యున్నవి. కర్మేంద్రియము లైదు, జ్ఞానేంద్రియములైదు, పంచప్రాణములు, అహం కారము, మనస్సును జేరి యాపదియేడుతత్త్వములును సమష్టివ్యష్ట్యా త్మకం బైన లింగశరీరం బని చెప్పఁబడును. ఆ యీశ్వరుడే లింగశరీ రంబునం దభిమానము చేసి హిరణ్యగర్భుం డాయెను. ఇతనికే సూత్రా త్మ యనియు, ప్రాణుం డనియు రెండునామంబులు గలిగె. ఇదియే సూక్ష్మసృష్టి.

## స్థూలసృష్టిప్రకారము

ఈశ్వరునియొక్క వీక్షణముచేతను తమోగుణప్రధానంబు లైన యపంచీకృతభూతము లొక్కొక్కటి రెండేసిభాగంబులై యందులో సగమువిడిచి కడమసగములో నొక్కొక్కభాగంబు నాలుగేసి విధంబులై ఆయాభాగంబులు స్వాంశంబును విడిచి యితరభాగంబులతోఁ గూడి పంచీకృతభూతంబు లాయెను. వీనికి స్థూలభూతంబు లని పేరు.

ఈభూతములనుండి యీశ్వరునియొక్క వీక్షణంబు చేత బ్రహ్మాండం బును, ఈబ్రహ్మాండంబులో నతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళంబు లనెడి యేడైన యధోలోకంబులును; భూలోక, భువర్లోక, సువర్లోక, జనలోక, మహాలోక, తపోలోక, సత్యలోకంబు లనెడి యేడు ఊర్ధ్వలోకంబులును; ఆయాలోకంబుల కుచితమైన ఉద్భిజ్జ, స్వేదజ, అండజ, జరాయుజంబు లనెడి చతుర్విధభూతగ్రామాదులును బుట్టెను. ఇంతయునుగూడి స్థూలప్రపంచ మని చెప్పఁబడెను. దీనియం దభిమాని యగు నీశ్వరునకు విరాట్టని పేరు. ఇతనికే వైరాజసుం డనియు, వైశ్వానరుం డనియు రెండుపేళ్లు గలవు.

వ్యష్టి సమష్టిలోనే యంతర్భూత మైనప్పటికిని విశేషంబు నెఱుంగవలసి మఱల నిరూపించుచున్నారము. అది యెటులనఁగా; జాగ్రదవస్థయందును, స్థూలశరీరంబునందును, అభిమానించిన ఆత్మకు విశ్వుఁ డని పేరు. ఇతనికే వ్యావహారికుఁ డనియును, చిదాభాసుఁ డని యును రెండుపేళ్లు గలవు.

స్వప్నావస్థయందును, లింగశరీరమందును, అభిమానించిన ఆత్మకు తైజసుం డని పేరు. ఇతనికే ప్రాతిభాసికుఁ డనియును, స్వప్న కల్పితుఁ డనియును రెండుపేళ్లు. సుషుప్త్యవస్థయందును, కారణశరీర మందును అభిమానించిన ఆత్మకు ప్రాజ్ఞుం డని పేరు. ఇతనికే పారమా ర్థికుఁ డనియును, అవిచ్ఛిన్నుఁ డనియును రెండుపేళ్లు. ఇది స్థూలప్రపం చముయొక్క యుత్పత్తి.

ఈ ప్రపంచముయొక్క అవాంతరసృష్టి ప్రళయములకొఱకై ఆయీశ్వరుఁడే మాయావరణసహితుఁడై మూఁడుమూర్తులై సత్త్వ గుణంబుతోఁ గూడుకొని రక్షకుం డైన విష్ణువును, రజోగుణంబుతోఁ గూడుకొని సృష్టికర్తయగు బ్రహ్మయును, తమోగుణంబుతోఁ గూడి సంహారకర్తయైన రుద్రుండు నగుదురు. విరాడంతర్భూతుండు బ్రహ్మ యును, హిరణ్యగర్భాంతర్భూతుండు విష్ణువును, అవ్యాకృతాంతర్భూ తుండు రుద్రుండును నీప్రకారంబు ప్రపంచోత్పత్తి. ఇదే యధ్యారోప మని చెప్పఁబడును.

## అపవాదము

అపవాద మనఁగా కారణవ్యతిరిక్తముగా కార్యము లేదని యెఱుంగుట. అది యేలాగనఁగా; మృత్తువలనఁ బుట్టిన ఘటశరావాదులు మృద్వ్యతిరిక్తము లెట్లు గావో, స్వర్ణంబువలనం బుట్టిన కటకమకుటాదులు స్వర్ణవ్యతిరిక్తము లెట్లు గావో, అయస్సువలనఁ బుట్టిన ఖడ్గశరాదులు అయోవ్యతిరిక్తంబు లెట్లు గావో, అటులనే ఆత్మవలనఁ బుట్టిన ప్రపంచ మాత్మవ్యతిరిక్తంబు గాదని యెఱుంగుట. అటులనే పంచీకృతపంచమహాభూతంబులవలనఁ బుట్టిన బ్రహ్మాండంబును, ఆయండంబులో పదునాలుగు లోకంబులును, ఆయాలోకంబుల కుచితమయిన చతుర్విధభూతగ్రామాదులును, వీనికి కారణంబైన పంచీకృత పంచమహాభూతంబులకంటె వేఱుగాదని యెఱుంగుట. పంచీకృత పంచమహాభూతంబులును, సమష్టివ్యష్ట్యాత్మకం బైన లింగశరీరంబును, అపంచీకృత పంచమహాభూతంబులకంటె వ్యతిరిక్తంబు గాదని యెఱుంగుట. జలంబువలనఁ బుట్టిన పృథివి జలవ్యతిరిక్తంబు గాదని యెఱుంగుట. తేజస్సువలనఁ బుట్టినజలంబు తేజోవ్యతిరిక్తంబుగాదని యెఱుంగుట. వాయువువలనఁ బుట్టిన తేజస్సు వాయువ్యతిరిక్తంబు గాదని యెఱుంగుట. ఆకాశంబువలనఁ బుట్టినవాయువు ఆకాశవ్యతిరిక్తంబు గాదని యెఱుంగుట. మాయవలనఁ బుట్టిన యాకాశంబు మాయకు వ్యతిరిక్తంబు గాదని యెఱుంగుట.

మాయ యనఁగా సత్తని చెప్పఁగూడదు. కాలత్రయంబునందును బాధ్యరూపకమై యున్నది. కనుక అసత్తనియును జెప్పగూడదు. 'అహ మజ్ఞః' అని యనుభవం బున్నది. కనుక సదసత్తనియును జెప్పఁగూడదు. విరుద్ధధర్మము గనుక, మఱియేమనవలయు నన; అనిర్వచనీయమని చెప్పవలయును. అనిర్వచనీయమనఁగా; ఇట్టిది అట్టిది యని జెప్పశక్యముగానిది. అనఁగా మిథ్యాస్వరూపము. అది యెట్లనఁగా; అవయవోత్పత్తిచేతఁ దోఁచినను, 'యా మా, సా మాయా, యా న విద్యతే సా అవిద్యా' (ఏది లేనిదో అది మాయ, ఏది తెలియఁబడదో అది అవిద్య) కనుక మాయా ఽవిద్యలు రెండును లేనివైె చిన్మాత్రము శేషించుచున్నది. ఆచిన్మాత్రస్వరూపంబు నేనని యెఱఁ డెఱుంగు

చున్నాఁడో వాఁడే ముక్తుఁడని శ్రుతులు చెప్పుటచే నాచార్యు లగు వారును జెప్పుచున్నారు.

శ్లో. స్థూలసూక్ష్మాదిదేహానా మాత్మన్యారోప ఏవ చ,
అపవాద స్తతోఽప్యేషాం సమ్యగత్ర ప్రదర్శితః.

ఇది ప్రథమవర్ణకము.

---

# ద్వితీయ వర్ణకము

## సాధనచతుష్టయ ప్రకరణము

శ్లో. యశ్చ సాధనసంపన్న ఈశ్వరస్య ప్రసాదతః,
యజ్ఞాదికర్మకరణా త్సోఽధికారీ నిరూప్యతే.

వేదాంతవిచారణయందు సాధనచతుష్టయసంపన్నుఁడే అధికారి. అది యెట్టులనఁగా; బృహస్పతిసవనంబునందు బ్రాహ్మణుం డెట్టుల నధి కారియో, క్షత్రియ వైశ్యు లెట్టుల యధికారులు కారో, రాజసూయ మందు క్షత్రియు లెట్టుల యధికారులో, బ్రాహ్మణులు వైశ్యులు నెట్టుల యధికారులు కారో, సోమమందు వైశ్యుఁడు ఎట్లు అధికారియో, బ్రాహ్మణక్షత్రియులు ఎట్లు అధికారులు కారో, అటులే వేదాంతవిచా రణయందును సాధనచతుష్టయసంపన్నుఁడే అధికారి.

1 నిత్యానిత్యవస్తువివేకము, 2 ఇహాముత్రార్థఫలభోగ విరా గము, 3 శమాదిషట్కసంపత్తియు, 4 ముముక్షుత్వము ననునవియే సాధనచతుష్టయము.

1 నిత్యానిత్యవస్తువివేకము—ఏక బ్రహ్మము సత్యము. ప్రపం చము మిథ్య. అది యున్నట్లు తోఁచుటయే కాని వాస్తవముగ లేదు. బ్రహ్మ భిన్నముకాదు అనెడి నిశ్చయము.

2. ఇహాముత్రార్థఫలభోగవిరాగము— ఈ ప్రపంచమందుఁగల సర్వవిషయములందును వాంఛితమైన అన్నమునందువలెను, మూత్రపురీ

షాదులందువలెను; ఇచ్ఛలేకుండుట, ఇహాలోకఫలభోగవిరాగము. ఇట్లే స్వర్గాదిపరలోకములయందుఁగల రంభాసంభోగాదిభోగములందు సయితము ఐహికభోగములందువలెనే యిచ్ఛలేకుండుట, అముత్రార్థ ఫలభోగవిరాగము. ఈ రెండునుం గూడి ఇహాముత్రార్థఫలభోగ విరాగ మనఁబడును.

3. శమాదిషట్కమనగా—శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ యను నీయాఱును.

శమ మనగాఁ—అంతరింద్రియనిగ్రహము. అనఁగా మనస్సును జయించి దానిని శ్రవణమనననిదిధ్యాసములయందుఁ దప్ప నితరవిషయ ములందుఁ బోనీయకుండుట.

దమ మనగా — బాహ్యేంద్రియనిగ్రహము. మనస్సును బాహ్యవిషయములను చింతింపకుండ సర్వదా శ్రవణమనననిదిధ్యాసన ములయందే నిలుపుట.

ఉపరతి యనఁగా—వేదమునం దుపదేశింపఁబడిన కర్మల సన్న్యా సాశ్రమవిధిచేఁ బరిత్యజించి సర్వదా శ్రవణాదులనే ఆచరించుచుండుట (విధ్యుక్తకర్మలను ఫలాపేక్షగాని, కర్తృత్వాద్యభిమానముగాని లేకుండ నివర్తించుటయు) ఉపరతి యని కొందరిమతము. మనస్సు స్త్రీగాను, ప్రత్యగాత్మ పురుషుఁడుగాను భావించి, ఆమనస్సును సర్వదా ప్రత్యగాత్మయందు లక్ష్యముంచి వివశతనుండుట ఉపరతి యని కొందరి మతము.

తితిక్ష యనఁగా—శీతోష్ణాదిసహనము. (చలికిని, యెండకును నోర్చుట) తనకు నెవఁ డెట్టి యపకార మొనరించినను, తన హస్తపాదా దుల నఱికినను, వానిని నిగ్రహించు శక్తియుండియు, వాని యపరాధ మును సహింపఁగల మనోనిగ్రహము.

సమాధాన మనఁగా—శ్రవణాదులయందు నిలుపఁబడిన మనస్సు పూర్వసంస్కారవశమున నితరవిషయములనుగూర్చి పరుగిడునేని, ఆ విషయదోషములను విమర్శించి, వైరాగ్యమును బుట్టించి, మనస్సును మఱలించి శ్రవణాదులయందు నిలుపుట.

శ్రద్ధ యనఁగా—గురువాక్యములందును, వేదాంతవాక్యము లందును అత్యధికమగు నమ్మకము

4. ముముక్షుత్వ మనఁగా—సమస్తప్రాణులును మోక్షము కావలెనని చెప్పుచున్నారు. అది మోక్షేచ్ఛ కానేరదు. గృహము దగ్ధమగుచుండఁగా నట్టి గృహంబునందుండు పురుషుండు పుత్రమిత్రకళత్రాదు లేమయిపోయిరో యని విచారింపక, అగ్నిచేత తప్తుఁడై ఆపుత్రమిత్రాదులను విడిచిపెట్టి శీతలంబునం బ్రవేశించినట్లు సంసారంబునందు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయాదు లనెడి అగ్నిచేత తప్తుఁడైనపురుషుఁడు ఈ సంసారతాపంబు నెవరు పోఁగొట్టుదురో? సద్గురువు లెక్కడఁ గలరో? దీనికి సాధనంబు లేవేవి కావలెనో యని తపించుకొనుచు నుండువాని చిత్తవృత్తికే మోక్షేచ్ఛ యని పేరు. మఱియును, మన స్సనెడి బెబ్బులియును, ఆశ యనెడి కృష్ణసర్పమును, కామాదు లనుదొంగలును వీనిని నిరాకరించుటకై పైనాలుగు సాధనంబులును గలవాఁడే అధికారి. శ్రవణంబునకు మునుపే సాధనచతుష్టయమును సంపాదించుకొని శ్రవణంబునందుఁ బూనుకొనవలయు. లేనిపక్షమున ఆజన్మంబునందు జ్ఞానము పుట్టదు. గురువులైనవారు అనధికారులకు ఉపదేశము చేయనే చేయరు. అది యెటులనఁగా; శూద్రునిచే యాగము చేయించినను, వానికి స్వర్గఫలంబు లెట్లు సిద్ధింపవో, అట్టి శూద్రునకు ఉపనయనాది సంస్కారంబులు చేయించినను వానికి బ్రాహ్మణత్వ మెటువలె సిద్ధింపదో అటువలె సాధనచతుష్టయము లేనివానికి శ్రవణాదులవలన జ్ఞానఫలంబు సిద్ధింపదు. అయితే యా శ్రవణాదులు వ్యర్థంబులై పోవునా? యనిన; పోఁజాలవు. దానివలన నొక యదృష్టంబు పుట్టును. ఆసాధనచతుష్టయము శ్రవణంబునకుఁ బూర్వంబున లేకున్నను, శ్రవణకాలంబునం దైనను గురుముఖముగా సంపాదించుకొనవలయును.

అధికారికి నాలుగువిశేషణంబు లేల చెప్పవలె? నిత్యానిత్యవస్తువివేకమే చాలు నని చెప్పుదమన; అది చాలదు. లోకంబునందు శాస్త్రజ్ఞులకు నిత్యానిత్యవస్తువివేకము కలదు. వారు విషయంబులయందాసక్తి గలిగి కామ్యకర్మంబులే చేయుచున్నారు. కనుక వారల కధి

కారము లేదు. కాఁబట్టి రెండవసాధనంబునుం గావలయును. అయితే రెండుసాధనములే చాలు నని చెప్పెద మన ; అవి చాలవు. కొందఱు ఋషీశ్వరులకు నిత్యానిత్యవస్తువివేకంబును, ఇహాముత్రార్థభోగవిరాగంబునుం గలదుగాని, వారలకు కోపతాపంబు లధికంబై శమాది షట్కసంపత్తి లేనందున వారల కధికారము కానము. కాఁబట్టి మూఁడవసాధనంబునుం గావలయును. అట్లైన మూఁడుసాధనంబులు చాలునా? అవియునుం జాలవు. లోకంబునం దిచెప్పఁబడిన మూఁడుసాధనంబులును గలవారే కొందఱు గలరు. వా రెవ రనఁగా; కృష్ణాజినంబులం జంకఁ బెట్టుకొని, తలలు పెంచుకొని, యోగుల మని పేరు పెట్టుకొని, సంసారమును విడిచి, విరక్తులై, ఉపశాంతులై, ప్రతిగ్రహాదులు లేకయే సంచరించుచు నుండువారు శ్రవణము గలచోటనే చేరరు గనుక వారికిని అధికారము లేదు. కాఁబట్టి నాలుగవసాధనంబు గావలయును. ఈ నాలుగు సాధనంబులుం గలవాఁడే వేదాంత విచారంబున కధికారి. ఈ సాధనచతుష్టయసంపత్తి కాయికవాచికేంద్రియవ్యాపారంబు మనోవ్యాపారము గనుక విషయంబులయందు దోషదృష్టి గలవారు సులభంబుగ సంపాదించుకొనవచ్చును.

శ్లో. యావదన్యదసత్త్వ్యక్తం తావత్సామాన్యమేవ చ,
వస్తు వా సాధ్యతే లోకే స్వాత్మలాభే తు కా కథా.
స హేతు సఫలం కర్మానర్థమూలమశేషతః,
త్యజత్యైవ హి తే దేయం త్యక్తుః ప్రత్యక్పరం పదమ్.

ఇది ద్వితీయవర్ణకము.

---

# తృ తీ య వ ర్ణ క ము

## చేతనాచేతనవిచారము

శ్లో. చేతనాచేతనే యే వై శ్రుతౌ సమ్యక్ప్రకీర్తితే,
తే ద్వే మయాఽభిరచ్యేతే భావయ శృణు తామిహ.

ప్రపంచము ఆత్మ యనియును, అనాత్మ యనియును రెండు విధంబులు. ఆత్మయనఁగా; ప్రపంచాతీతుఁడుగదా! ప్రపంచాతీతుఁడైన

యాత్మను ప్రపంచాంతర్గతపాతిగా చెప్పవచ్చునా? అనఁగా; చెప్పవచ్చును. ప్రపంచము చేతనాచేతనాత్మకమై కదా తోఁచుచున్నది. కాఁబట్టి ప్రపంచాతీతుఁడైన ఆత్మ ప్రపంచముతో కూడకపోయినచో ప్రపంచము చేతనాచేతనాత్మకముగా తోఁపదు. తోఁచుచున్నది. కాఁబట్టి ప్రపంచాతీతుఁడైనయాత్మను ప్రపంచాంతర్గతపాతిగానే చెప్పవచ్చును. అయితే; ప్రపంచములో చేతనం బెయ్యది? యచేతనమెయ్యది? యనిన; పాదములతో నడుచునదియు, ఱెక్కలతో నెగయునదియు, నేలఁ బ్రాఁకునదియునుం జేతనములు. పృథ్వీ జల పర్వత వృక్షాదులు అచేతనంబులు. అయితే; ప్రపంచం బనేకపదార్థంబులుగాఁ దోఁచుచుండఁగా రెండుపదార్థంబు లని యెటులఁ జెప్పవచ్చు ననిన; చెప్పవచ్చును. అది యేలాగన; ప్రపంచము ఆత్మయనియు, ననాత్మయనియు రెండువిధములు. అనాత్మ యొక్కటియే కార్యరూపంబుగాఁ బరిణమించి అనేకపదార్థంబు లాయెను. వానితోఁ గూడుకొని ఆత్మయు ననేకమువలెనే తోఁచుచున్నాఁడు. ఆయనాత్మతోఁ గూడుకొని తోఁచెడి యాత్మ జీవుఁ డనియును, ఈశ్వరుఁ డనియును రెండువిధంబులుగాఁ దోఁచుచున్నాఁడు. జీవేశ్వరులలో జీవుఁ డనేకవిధంబులుగాను, ఈశ్వరుం డనేకవిధంబులుగానుం దోఁచుచున్నారు. జీవుం డనేకవిధంబులుగాఁ దోఁచినం దోఁచనిమ్ము. ఒక్కండైన ఈశ్వరుం డనేకవిధంబులుగా నెటుల దోఁచునన; తోఁచును. పుణ్యక్షేత్రంబులయందును, పట్టణంబులయందును, గ్రామాదులయందును, ప్రతిగృహంబునందును ఈశ్వరుం డనేకవిధంబులుగాఁ దోఁచుచున్నాఁడు. అక్కడక్కడఁ దోఁచినవన్నియు మృచ్ఛిలాదారుతామ్రాదిప్రతిమలుగదా! ఇట్లుండఁగా; నీశ్వరుఁడు తోఁచుచున్నాఁడని యెందుఁకు చెప్పవలయుననిన; మృచ్ఛిలాదారుతామ్రాదిప్రతిమలయం దందఱికిని నీశ్వరబుద్ధియేగాని, ప్రతిమాదిబుద్ధి సర్వాత్మనా లేదు. వానియందు ప్రతిమాదిబుద్ధిగలిగి యీశ్వరబుద్ధి లేకపోయిన గోపురప్రాకారమంటపాదులకును, పూజాభిషేకములకొఱకును లక్షాదిద్రవ్యవ్యయము నేల చేయుదురు? అటుల నేలవు చేయరుగదా? చేయుచున్నారు; కనుక నా ప్రతిమాదులయం దీశ్వరబుద్ధి రావచ్చునే? అనాత్మస్వరూపమైన ప్రతిమాదులయం దీశ్వరబుద్ధి రావచ్చునా? యన; రావచ్చును. మిక్కిలి నీచమైన దేహేంద్రియాది

సంఘాతమే నేననువానికి ఆ ప్రతిమాదులయం దీశ్వరత్వబుద్ధి రావచ్చును. దేహేంద్రియాదులు నీచపదార్థంబు లగునా? యనిన నగును. అది యెట్లులనఁగా: శుక్లశోణితంబులవలనఁ బుట్టినవి గనుకను, మాంసమూత్రపురీషాదులచేత నిర్మింపఁబడినవిగనుకను, శరీరము మృతమైపోయినప్పటికిని ఉండువారికి అర్ధచండాలాదిక్లేశంబులం జేయుచున్నవి గనుకను, ఈ దోషంబు లాప్రతిమాదులయందు లేవు గనుక, ఆ ప్రతిమాదులయందు సమర్పించిన స్రక్చందనాదులు పరులకు కృతార్థతఁ జేయుచున్నవి గనుకను, ఆ ప్రతిమాదులకు హాని వచ్చినప్పటికిని తిరుగా నుపకారమునకు వచ్చుచున్నవి గనుకను, ఆ ప్రతిమాదులయం దీశ్వరత్వబుద్ధి రావచ్చు ననుట యుచితమే. అయితే ఒక్కఁడయినాత్మపదార్థమే కార్యరూపంబుగాఁ బరిణమించి అనేకములుగాఁ దోఁచును. దానితో మఱియొక పదార్థము గూడుకొని యనేకంబుగాఁ దోఁపవచ్చు ననుటయందు దృష్టాంతంబును గలదు. అది యెట్లునః పృథివి యొకటియే కారణరూపంబుగాఁ బరిణమించి పర్వతవృక్షప్రాకార గోపురమంటపగృహకుడ్యకుసూలఘటశరావాదిరూపములుగాఁ దోఁచుచున్నది. వానితోఁ గూడుకొనిన యాకాశంబు ఘటాకాశం బనియు, మఠాకాశం బనియు, వృక్షవనాకాశ మనియు, గోపురమంటపకుడ్యకుసూలాకాశ మనియు నెట్లుఁ దోఁచుచున్నదో అట్లు కార్యరూపంబుగాఁ బరిణమించిన అనాత్మ పదార్థంబులం గూడుకొని ఆత్మయు దేవదత్తుఁ డనియు, యజ్ఞదత్తుఁ డనియు, రాముఁ డనియు, కృష్ణుఁ డనియు ననేకంబులుగాఁ దోఁచుచున్నాఁడు. ఈ పృథివ్యాకాశదృష్టాంతంబునకు ప్రతిబింబ దృష్టాంతముం జెప్పెదము. అది యెట్లనఁగా; ఒక జలమే ఉపాధుల వలన సముద్రంబు లనియు, తటాకంబు లనియు, సరస్సులనియుం జెప్పఁబడుచున్నది. ఈ జలంబులయందు ఆదిత్యుఁ డొక్కఁడే ప్రతిబింబించి యనేకవిధంబులుగా తోఁచుచున్నట్లు ఆత్మయు ననాత్మకార్యంబగు నంతఃకరణంబులయందు ప్రతిబింబించి యనేకంబులుగాఁ దోఁచుచున్నాఁడు. అట్టుఁ దోఁచినప్పటికిని అనాత్మ కార్యశరీరమైన యంతఃకరణముయొక్క ధర్మంబు లాత్మను కాలత్రయంబునందును స్పృశింపలేవు. అది యెట్లనఁగా; జలగతంబులైన శైత్యచలనాదివికారంబులు జలంబునందు ప్రతిబింబించిన ప్రతిబింబంబు నెట్లు స్పృశింపలేవో అట్లు

లనే అనాత్మ కార్యమైన యంతఃకరణాదులయొక్క ధర్మంబులు ఆత్మను కాలత్రయమందును స్పృశింపలేవు. మఱియును, జలగతంబులైన శైత్య చలనాదివికారంబులు జలంబునందు ప్రతిబింబించిన ప్రతిబింబాబు నెటు వలె స్పృశింపలేవో అటువలె నంతఃకరణముయొక్క ధర్మంబులు వికారంబులును నంతఃకరణంబునందు ప్రతిబింబించిన జీవుని స్పృశింప నోపవు. ఈ యంతఃకరణాదులకు నధిష్ఠానరూపకమైన ప్రత్యగాత్మను స్పృశింపలేవు. అనునది చెప్పవలెనా! అంతమాత్రమే కాదు. ఎటు లైన నేమి? పృథివీవికారంబులును, పృథివీకార్యంబులయొక్క వికారంబులును, పృథివికి నాధారభూతంబైన యాకాశంబును ఎటుల స్పృశింపలేవో అటుల ననాత్మగ్గును అజ్ఞానంబును అజ్ఞానకార్యంబు లైన దేహేంద్రియాదిధర్మంబులును, జ్ఞానంబునకును, అజ్ఞానకార్యం బులకును ఆధారభూతంబైన ప్రత్యగాత్మను స్పృశింపలేవు. ఈప్రకారం బాత్మానాత్మవిచారణం బొనర్చి యయ్యాత్మస్వరూపంబు నేనని యెవం డెఱుంగుచున్నాఁడో వాఁడే ముక్తుఁ డని వేదాంతసిద్ధాంతము.

శ్లో. ఆత్మానాత్మవివేకేన పునస్సంసారనిర్వృతిః,
తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో న సిధ్యతి.

ఇది తృతీయవర్ణకము.

---

# చతుర్థవర్ణకము

## దుఃఖము స్వాభావికము గాదనుట

శ్లో. జనే యద్దుఃఖమస్త్యేతత్కిం స్వరూపముతాస్య తత్,
సమ్యగాగంతుకం వేతి భాషయా చింత్యతే మయా.

ప్రాణులకు దుఃఖము స్వాభావికమా? లేక ఆగంతుకమా? యనిన; నాగంతుకంబే యని చెప్పవలెను. స్వాభావికం బని చెప్పినచో దుఃఖ నివృత్తికొఱకై యెవరును యత్నము సేయక యుండవలయు. అట్లుండక యత్నము చేయుచున్నారు. కనుక దుఃఖము స్వభావికమని చెప్పఁ

గూడదు. ఆగంతుకమే యని చెప్పవలెను. స్వాభావికమే కానీ, దుఃఖనివృత్తికొఱకు యత్నమే చేయనీ అనిన; స్వాభావిక మనఁగా; స్వరూపమాయెను గనుక స్వరూపంబునకే నాశంబు వచ్చును. వచ్చినచో శాస్త్రము. అనిన; దుఃఖమువలన నివర్తింపఁబడిన వాఁడెవఁడును లేక పోవలెను. కాఁబట్టి దుఃఖము స్వాభావికమై పోదా? యనినఁ; బోదు. అది యెటులనిన; వేపాకుకు చేదు స్వాభావికము. చేదులేని వేపాకు నెందుం గానము. అటులనే ఆత్మయందును దుఃఖంబు స్వాభావికంబయ్యెనేని పోఁజాలదు గనుక ఆత్మకు దుఃఖంబు స్వాభావికం బని చెప్పఁగూడదు. ఆగంతుక మనియే చెప్పవలెను. స్వాభావికంబే యగుం గాక. దానికి నివృత్తియు వచ్చుంగాక! అగ్నికి స్వాభావికంబగు నుష్ణత్వంబునకు మణిమంత్రౌషధంబులచేత నివృత్తియు, శైత్యంబుల కావిర్భావంబునుం గన్నారము. జలంబునకు శైత్యంబు స్వాభావికంబు. అట్టి స్వాభావికంబైన శైత్యంబునకు నగ్నిసంపర్కంబుచేత శీతనివృత్తియు, నుష్ణత్వంబునకు నావిర్భావంబునుం గన్నారము. అటులే యాత్మకు దుఃఖంబు స్వాభావికంబు. స్వాభావికంబైన దుఃఖంబునకు నుత్కృష్టకర్మోపాసనల నివృత్తియును, సుఖంబున కావిర్భావంబును వచ్చెనని చెప్పుదమన; దుఃఖమునకు తాత్కాలికపరిభావమే కాని, ఆద్యంతిక నివృత్తి రానేరదు. అది యెట్లన: అగ్నియందు తాత్కాలికమందు పరిభూతంబులగు నుష్ణాదులకు కాలాంతరంబునం దెటుల నావిర్భావము వచ్చుచున్నదో, అటులే యాత్మకు నుత్కృష్టకర్మోపాసనాఫలరూపకమైన సుఖమునకు నాశము వచ్చుచుండఁగా దుఃఖము మరల నావిర్భవించును. దుఃఖంబున కాద్యంతనివృత్తి రానేరదు. ఇట్లు చెప్పినచో మోక్షమునకు జన్యత్వంబును, అనిత్యత్వంబును సిద్ధించును. అటుల వచ్చినను రా నిమ్మనిన: నది యెవనికి సమ్మతంబు గాదు. ఇంతియేగాక ఆత్మ ఆనందస్వరూపుం డని చెప్పెడి సకల శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయందుఁ గలవచనములకు వైయర్థ్యప్రాప్తి యగును. మఱియు సుషుప్త్యవస్థయందును, సమాధ్యవస్థయందును, తూష్ణీంభూతావస్థయందును ఆత్మయున్నాఁడు గనుక స్వాభావికమై దుఃఖము తోఁచవలెను. ఈ యవస్థాత్రయంబునందును ప్రాణులకు నేను దుఃఖినై యుంటిని యనుభవము లేదు గనుకను, నేను సుఖముగా నుంటినని యను

భవ మున్నది గనుకను, ఆత్మకు దుఃఖము స్వాభావిక మని చెప్పఁ గూడదు, అంగీకరించినచో నీసుఖానుభవమునకు వైయర్థ్యమువచ్చును. కనుక ఆత్మకు దుఃఖము స్వాభావిక మని చెప్పఁగూడదు. ఆగంతుక మనియే చెప్పవలెను.

అట్లయిన దుఃఖ మెందుచేత వచ్చిన దన శరీరపరిగ్రహముచేత వచ్చెను. ఎందెందు శరీరపరిగ్రహము గలదో అందందు దుఃఖము గల దని వ్యాప్తి. అటుల నెవ్వరేనియుం జెప్పుదురా? రాజప్రభృతుల యందు సుఖమే యనుభవింపఁబడుచున్నది గనుక, శరీరపరిగ్రహముచే దిక్కుల నెల్ల దుఃఖ మనుభవింపఁబడుచున్న దని యెటుల చెప్పవచ్చు ననిన; చెప్పవచ్చును. అది యెటులనఁగా: రాజప్రభృతులయందును దుఃఖమే యనుభవింపఁబడుచున్నది. రాజప్రభృతులకు దేహమందు రోగమువచ్చెనేని దుఃఖము, కుమారులు లేకపోయిన దుఃఖము, కుమారులు చెప్పినట్లు వినకపోయిన దుఃఖము, ప్రియుండగుపుత్రుండు మృతుండయ్యెనేని దుఃఖము, శత్రువులు బలవంతులై రాజ్య మాక్రమించుకొని పోదు రని దుఃఖము, భార్య లొకరికొకరు కోపించుకొని ఔషధ ప్రయోగములు సేసెద రని దుఃఖము, రాజ్యమునందు అనావృష్టికలిగెనేని దుఃఖము ఇవి మొదలైన దుఃఖంబులు రాజప్రభృతులయందునుం గానఁబడుచున్నవి. కనుక వారలు సుఖస్వరూపు లనుట మోహము. మోహముచేత దుఃఖము సుఖముగాఁ దోఁచునా? యన: దోఁచును. అది యేలాగన: మూటమోయువారికి కూలి అడ్డెడుబియ్యము అధికముగా దొరికిన మూటభారముచేత వచ్చినదుఃఖమును సడ్డసేయక సంతోషపడుచున్నారు. అడ్డెడుబియ్యము కూలి తగ్గినచో దుఃఖపడుచున్నారు. బోయలు తమదొరకు పయనము గలిగిన సంతోషపడుచున్నారు. పయనము లేకపోయిన దుఃఖపడుచున్నారు. పనిచేయువారు పని లేకపోయిన ఖేదము నొందుచున్నారు. వేగులవారు పైనము లేకపోయిన వెతఁ జెందుచున్నారు. మావటివానికి క్రొత్తయేనుంగు నిచ్చిరేని సంతోషించుచున్నాఁడు. ఇవి మొదలైన దుఃఖములు వీరల కెటుల సుఖములుగాఁ దోఁచుచున్నవో అటుల రాజప్రభృతులకును దుఃఖమే సుఖమువలె మోహముచేత తోఁచుచున్నది. కనుక రాజప్రభృతులను ఆశ్రయించుకొని యుండువారలకు దుఃఖము కల

దనుట వేఁతే చెప్పవలెనా? అట్లైతే వివేకులకును దుఃఖము కలదా? యనిన; కలదు. అది యెట్టులనిన; వివేకి యనఁగా; శరీరము గలవాఁడో, లేనివాఁడో యని విచారించుచున్నాము. అశరీరియైనవానికి వివేకి యని వ్యవహారము లేదు గనుక శరీరముగలవాఁడే వివేకి యని చెప్పవలెను. కాన వివేకికిని దుఃఖము గలదు. అది యెట్టులనిన; వివేకికిని ఆఁకలిదప్పులును శీతోష్ణాదిద్వంద్వదుఃఖములును, కడుపునొప్పి, తలనొప్పి, వ్యాఘ్రవృశ్చికసర్పాదులవల్ల వచ్చిన భయకంపాదులును తోఁచుచున్నవి. కనుక వివేకులకును దుఃఖము కలదు. అట్లైనచో వివేకికిని అవివేకికిని భేద మెటులనిన; వివేకియైనవాఁడు సర్వదుఃఖములును అంతఃకరణనిష్ఠము కాని సాక్షియైన తనకు లేవని చూచును. అవివేకియైనచో ఈదుఃఖముల నన్నిటిని తనయం దారోపించుకొని అన్యనిష్ఠమయిన దుఃఖములుగూడ తనయందే యారోపించుకొని పుత్త్రుఁడు సుఖముగ నుండిన తాను సుఖించుచున్నట్లును, పుత్త్రుఁడు నశించిపోయిన తా నశించిపోయినట్లును తపించుచున్నాఁడు. కనుక వివేకికిని అవివేకికిని భేదము లేదని చెప్పఁగూడదు. ఎఱుంగఁబడుచున్నదియ గాక శరీరము కలదని, దుఃఖము కలదని ఆశాస్త్రములే చెప్పుచున్నవి గనుక దేవతలకును దుఃఖంబు గలదు. అది యెటులన; అన్యోన్యయుద్ధములచేతను క్రూరములైన పరస్పరశాపములచేతను, బలిమిచేతను, ఒకనియైశ్వర్యమును మఱియొకం డపహరింపం దలంచుటచేతను, రాక్షసులు తమ రాజ్యములను వశపఱచుకొని తమ్ముం దఱుముటచేతనుం, గారాగృహంబులయం దుంచుటచేతను, రాక్షసులకు తాము భృత్యులై యుండుటచేతను, పుణ్యాకర్మక్షయముచేత నాశము వచ్చుటవలనను, అనేకదుఃఖములు అమరులకును కలవని శ్రుతిస్మృతీతిహాసపురాణములు చెప్పుచున్నవి. కనుక దేవతలకును దుఃఖము గలదు. అయితే మనవలెనే దుఃఖులైన దేవతలు మనకు నుపాస్యులై యభీష్టఫలంబుల నెవ్విధంబున నీఁగలరనిన; నీయంగలరు? అది యేలాగన; రాజప్రభృతులు తాము దుఃఖము గలవారయినను ద్రవ్యసంపన్నులగుటచేత మనకు నుపాస్యులై యిష్టార్థంబు లెటుల నొసంగుచున్నారో అటులనే దేవతలును దుఃఖములచేత పీడింపఁబడువార లయినప్పటికిని యోగైశ్వర్యాదిసంపన్నులౌటచేత మనకు నుపాస్యులును, అభీష్టఫలప్రదాయకులును అగుదురు.

అయితే దేవతలు ఆనందస్వరూపులని చెప్పెడి శాస్త్రములకు తాత్పర్య మేమి యనిన; వివేకియైనవాఁడు శరీరంబుతోఁ గూడుకొని దుఃఖము గలిగినవాఁడై యుండియు నాదుఃఖంబు నంతఃకరణనిష్ఠంబుగా నెటుల చూచుచున్నాఁడో అటులే ఉత్కృష్టులైన దేవతలును దుఃఖంబు నంతఃకరణనిష్ఠంబుగానే చూచుచు సర్వదా బ్రహ్మానందనిమగ్నులై యుందురు. కాఁబట్టి, దేవతలు ఆనందస్వరూపులని శాస్త్రంబులు చెప్పు చున్నవి.

అయితే, దేవతలకు దుఃఖము కలదని చెప్పు శాస్త్రమునకు తాత్పర్య మేమనఁగా; ఎక్కడెక్కడ శరీరపరిగ్రహము కలదో అక్కడక్కడ దుఃఖము కలదు. కనుక హిరణ్యగర్భశరీరపర్యంతంబును దుఃఖాక్రాంతం బయియుండును గాన సశరీరముక్త్యర్థమయి యత్నము సేయరాదు. అశరీరముక్త్యర్థమయి యత్నము సేయవలె నని తాత్పర్యము. శరీర ముక్తి యొకటి కలిగి గదా అశరీరముక్తికి యత్నంబు సేయవలయును. అశరీరముక్తి యని యొకటి కాదమే? ఎవ్విధంబుగా యత్నంబు సేయ నగు? శరీరముక్తి యనియు నొకటి కలదా? యనిన; కలదు. అశరీర ముక్తి లేదనుటకు ప్రమాణం బున్నది. అది యేలాగనిన; శరీరముక్తు లయిన నక్షత్రాదులు ప్రత్యక్షంబుగాఁ దోఁచినట్లు, అశరీరముక్తులు ప్రత్యక్షంబుగాఁ గనుపడ లేదు గనుకను యోగులైనవారు యోగ మహిమచేత లోకాంతరంబులకుం బోయి సశరీరముక్తులంజూచి వచ్చి రని శాస్త్రంబులలోఁ జెప్పియున్నచందంబునం జెప్పలేదు గనుక శరీర ముక్తుం డగువాఁడు నేను బహుకాలము శరీరముక్తుండనై యుండి వచ్చితినని శాస్త్రంబునం జెప్పినతెఱంగున నాశరీరముక్తుం డగునతండు 'నేను బహుకాలము అశరీరముక్తుండనై యుండి వచ్చితి' నని శాస్త్రం బులలోనఁ జెప్పియుండలేదు గనుకను శరీరముక్తి కలదు. అశరీర ముక్తి లేదని చెప్పవల మన; చెప్పఁగూడదు. అది యెవ్విధంబున ననిన; సుషుప్తిసుఖము సకలప్రాణులకు నెవ్విధంబునం బ్రత్యక్షమో అదేప్రకా రము శరీరముక్తియునుం బ్రత్యక్షమే. సుషుప్తిసుఖము ప్రత్యక్ష మయితే ముక్తిసుఖంబునుంగూడ ప్రత్యక్షం బగునా? యనిన; నద్వితీయ సుఖస్వరూపంబుగా నుండెడిది సర్వసుషుప్తులయందును సమంబుగా నున్నది గనుక నీకు సుషుప్తిసుఖంబు ప్రత్యక్షం బగునపుడు ముక్తి

యును బ్రత్యక్షమౌను. అయితే, ప్రత్యక్షత్వము సుషుప్తిముక్తుల యందు సమంబుగా నున్నది గాన సుషుప్తిని ముక్తి యని చెప్పవద మనిన; సుషుప్తియం దజ్ఞానంబును బునరుత్థానంబును ఉన్నది గనుకను ముక్తియందు పునరుత్థానంబును అజ్ఞానంబును లేదు గనుకను సుషుప్తి ముక్తి యని చెప్పఁగూడదు. సుషుప్తి సుఖంబు తెలియంగున ముక్తి సుఖం బును బ్రత్యక్షంబై యున్నది గనుక శరీరముక్తికంటె అశరీరముక్తి ప్రత్యక్షము. యోగియైనవాఁడు అశరీరముక్తునికి వచ్చి చెప్పుచుండెడి దియు, నశరీరముక్తుం డశరీరముక్తుండనై యుండి వచ్చితి నని చెప్ప కుండుటయు అశరీరముక్తి లేదు. సశరీరముక్తి కలదని చెప్పుటయందు నేనశ్రుత్యాదులు ప్రమాణంబుగాఁ జెప్పఁబడినవో అవియెల్ల స్వర్గలోక విషయంబులై, అనిత్యంబులై ప్రత్యక్షంబుగాఁ గానఁబడునవి గనుకను బ్రహ్మలోకవిషయంబులు గాకపోయెను గనుకను నక్షత్రంబులకు నశరీర ముక్తి కల దనుటయందు ప్రమాణంబులు కావు. శాస్త్రముమాత్ర ప్రమాణంబు ప్రమాణాంతరంబు లేదు. అశరీరముక్తి కల దనుట యందు శాస్త్రము, యుక్తి అనుభవంబు నున్నవి. అట్లుండుటవలన అశరీరముక్తికొఱకే యత్నము సేయవలయును. సశరీరముక్తికొఱకై యత్నంబు సేయరాదు. చేసిన దుఃఖంబు పో దనుటకు శాస్త్రంబును యుక్తియుం జెప్పఁబడెను. దుఃఖంబు పోదనుటకు అనుభవంబుం జెప్పు చున్నారము.

సుషుప్త్యవస్థయందు శరీరపరిగ్రహంబు లేదు గాన దుఃఖంబును లేదు. జాగ్రత్స్వప్నాదులయందు శరీరపరిగ్రహం బున్నది గాన దుఃఖంబు ననుభవింపఁబడుచున్నది. అట్లగుటవలన శరీరపరిగ్రహం బెచ్చటఁ గలదో అచ్చట దుఃఖంబునుం గలదు. శరీరపరిగ్రహం బెచ్చట లేదో అచ్చట దుఃఖంబును లే దనుట అన్వయవ్యతిరేకవ్యాప్తిచేత సిద్ధంబు. ఇట్లే యాత్మకు శరీరపరిగ్రహంబు చేతనే దుఃఖంబు వచ్చుచున్నది. కావున దుఃఖంబు స్వాభావికం బని చెప్పఁగూడదు. ఆగంతుకమనియే చెప్పవలెను. అయితే యీశరీర మెందుచేత వచ్చిన దనఁగా; కర్మంబు తోడంగూడిన పంచీకృతపంచమహాభూతంబులవలననే వచ్చినదని తోఁచు చున్నది. అ ట్లెందుకుఁ జెప్పవలె? కేవల పంచీకృతపంచమహాభూతం బులచేతనే శరీరంబు వచ్చిన దని చెప్పవద మనిన; నట్లు చెప్పఁగూడదు.

అది యెట్లు లనిన; అంతటను పంచీకృత పంచమహాభూతంబులున్నవి గావున అందందు శరీరంబులు పుట్టవలెను. ఆవిధంబున బుట్టలేదు. కాఁబట్టి కేవల పంచీకృతపంచమహాభూతంబులచేతనే శరీరంబు వచ్చినదని చెప్పఁగూడదు. పంచమహాభూతంబులు శుక్లశోణితాకారంబులుగా నెక్కడఁ బరిణమించుచున్నవో అక్కడ శరీరంబులు పుట్టుచున్నవని చెప్పెదమనిన; ఆ మేరకు చెప్పఁగూడదు. నిత్యంబును స్త్రీపురుష సంయోగంబువలన శుక్లశోణితంబులు పుట్టుచున్నవి గనుక, అందు శరీరంబులు పుట్టవలెను. అట్లు పుట్టుటలేదు. కాఁబట్టి ఆ మేరకు చెప్పఁగూడదు. శుక్లశోణితంబులు లేవని చెప్పెద మనిన; ప్రత్యక్షంబుగా నగపడుచున్నవి గాన లేవని చెప్పఁగూడదు. అయినను శుక్లశోణితంబులకు సంయోగంబు లేదని చెప్పెద మనిన; శుక్లశోణితంబులకు సంయోగంబు లేకపోయినట్టయితే స్త్రీపురుషులకు రతి యుండఁగూడదు. అయినను శుక్లశోణితంబులే దేశకాలంబుల నపేక్షించి శరీరాకారమగుచున్నదని చెప్పెద మనిన; చెప్పఁగూడదు. అటులఁ జెప్పినట్లాయెనా? ప్రాణులకు వైచిత్ర్యంబు లేకపోవలెను. అయిన, ప్రాణులకు వైచిత్ర్యంబు గలదా యనిన; నొకరివలె నొకరుండలేరు గనుక ప్రాణులకు వైచిత్ర్యంబు కలదు. అయిన ప్రాణి వైచిత్ర్యంబు దేశకాలంబులచేత వచ్చుచున్నదని చెప్పెద మన; దేశకాలంబులు సర్వప్రాణులకును సాధారణంబులుగా నున్నవి గనుక దేశకాలాదులచేతను జగద్వైచిత్ర్యంబు వచ్చుచున్నదని చెప్పఁగూడదు. ఆదేశకాలాదులు సాధారణకారణంబులునుం గానివానిచేతను జగద్వైచిత్ర్యంబు రానీయనఁగా; అసాధారణమైన దేశకాలాదులచేతను ఘటాదివైచిత్ర్యంబు గానము గనుక దేశకాలాదులచేత జగద్వైచిత్ర్యము వచ్చుచున్నదని చెప్పఁగూడదు. మఱి యెందువలన ఘటాదివైచిత్ర్యము వచ్చుచున్నదనఁగా; అసాధారణకారణంబులైన కులాలవైచిత్ర్యంబువలన తోఁచుచున్నది. అటులనే పంచీకృతంబులును శుక్లశోణితాకారంబుగాఁ బరిణమించి సాధారణకారణమైన దేశకాలాదుల నపేక్షించి యున్నప్పటికిని అసాధారణకారణమైన కారణాంతరంబు నపేక్షించి విచిత్రశరీరాద్యాకారంబులుగాఁ బరిణమించుచున్నవని చెప్పవలెను. ఆకారణాంతరం బెయ్యది యనిన; కర్మంబే కావలయును. అటుల నయ్యె

నేని కర్మంబున కిట్టి సామర్థ్యం బున్నయది గాన కేవలం బగు కర్మ చేతనే శరీరంబు వచ్చెనని చెప్పవలెననిన; కర్మంబు నిరాశ్రయంబై యుండ లేదు గనుకను త్రిక్షణావస్థాయియై యున్నది గనుకను కేవలంబగు కర్మంబు వలన శరీరంబు వచ్చెనని చెప్పఁగూడదు. మఱి యెట్లనిన; కర్మంబుతోఁడఁ గూడుకొనిన పంచీకృతపంచమహాభూతంబులవలననే శరీరంబు వచ్చెనని చెప్పవలెను. ఇటుల చెప్పుటచేత రెండుకారణములచేత శరీరంబు పుట్టెనని చెప్ప బడును. ఆ రెండు కారణంబు లెవ్వి యనిన; కర్మంబులును పంచమహాభూతంబులును. ఈ రెండు కారణంబులలోపల నిమిత్తకారణంబగు కర్మవైచిత్ర్యంబువలన శరీరవైచిత్ర్యంబు వచ్చుచున్నది. ఈ యర్థంబునందు దృష్టాంతం బేమియైనం గలదా యనినఁ; గలదు. అది యెట్టులనిన; ఘటము పుట్టుటయందు కేవలంబగు నుపాదానకారణంబైన మృత్తుచేతను కార్యం బెటులఁ బుట్టలేదో కేవల నిమిత్తకారణంబగు కులాలవ్యాపారము మృత్తును నాశ్రయించినందుచేతనే కార్యం బెటులఁ బుట్టుచున్నదో మృత్తు ఏకరూపమై యున్నప్పటికిని కులాలవ్యాపారము చేత కార్యమందు వైచిత్ర్యం బెటుల వచ్చుచున్నదో అటులనే దార్ష్టాంతికమందును కేవలపంచమహాభూతములచేతను దేహము పుట్టలేదు. కేవల కర్మ చేతను శరీరము పుట్టలేదు. కర్మముతోడం గూడుకొనిన పంచీకృతపంచమహాభూతంబులవలననే శరీరము పుట్టుచున్నది. కర్మవైచిత్ర్యముచేతనే శరీరవైచిత్ర్యంబు వచ్చుచున్నదని కనుంగొనుటకు దృష్టాంతమందు ఉపాదానకారణమైనట్టి మృత్తుండినను నిమిత్తకారణమైన కులాలవ్యాపారము లేకపోయినచో ఘటం బెటుల పుట్టలేదో అటులనే దార్ష్టాంతికమందు ఉపాదానకారణమైన యీశ్వరసృష్టంబగు భూతంబులును కార్యంబగు భౌతికప్రపంచంబును స్థాయియై యున్నప్పటికిని అద్వితీయుండగు ఆత్మ నేననే జ్ఞానముచేతను నిమిత్తకారణంబగు కర్మం బెవనికి నశించిపోవుచున్నదో వానికి శరీరము రాదు. ఇది సిద్ధము. ప్రపంచము కాలత్రయంబులయందును లేకున్నను తోఁచుచున్నది. అటులఁ దోఁచినను లేదను నిశ్చయం బెవనికి కలిగియుండునో వానికి జన్మము లేదనుట యన్వయవ్యతిరేకములచేత సిద్ధము. అన్వయవ్యతిరేకంబు లన నెయ్యవి యనిన; కర్మము గలిగెనేని శరీరంబునుం

గలదు. కర్మంబు లేకున్న శరీరంబు లే దనుట. అటుల నెక్కడ ననుభవింపఁబడెను? అనిన: జాగ్రత్స్వప్నములయందు స్థూలసూక్ష్మభోగప్రదమైన కర్మము ఉన్నది గనుక శరీరంబు నున్నది. సుషుప్తియందు స్థూలసూక్ష్మభోగప్రదంబగు కర్మంబు లేదు గావున శరీరంబు లేదు. కర్మము గలిగిన శరీరమునుం గల దనుట శ్రుతియుక్త్యనుభవములచేత సిద్ధము.

సశరీరులయ్యును శరీరమును కుణపమువలె భావించి దేహాభిమానశూన్యులై సర్వావస్థలందును పరబ్రహ్మనిష్ఠులై ప్రపంచస్మృతి లేనివారలే జీవన్ముక్తు లని భావము.

శ్లో. సశరీరస్య దుఃఖిత్వాద్వ్యాప్తితో వ్యాహతా యతః,
అతోఽశరీరము క్త్యర్థం యత్నం కుర్యాదతంద్రితః.
సభూతపంచకం నాడీకిరణైః కేవలాదపి,
ఉభాభ్యాం మిళితాభ్యాం తచ్ఛరీర ముపజాయతే.
తచ్ఛరీరానవాప్తిశ్చ జ్ఞానాదేవచ శూన్యతః,
అతస్సర్వప్రయత్నేన జ్ఞానాభ్యాసరతో భవేత్.

ఇది చతుర్థవర్ణకము.

---

# పంచమవర్ణకము

## కర్మవిచారప్రకారము

పుణ్యకర్మంబనియు, మిశ్రకర్మంబనియు, పాపకర్మంబనియు కర్మంబు త్రివిధంబు. ఈపుణ్యపాపమిశ్రకర్మంబులకు ఫలంబు లెట్లనిన; పుణ్యకర్మంబునకు దేవాదిశరీరప్రాప్తి, పాపకర్మంబునకు తిర్యగాదిశరీరప్రాప్తి, మిశ్రకర్మంబునకు మనుష్య శరీరప్రాప్తి, పుణ్యోత్కర్షంబునకు హిరణ్యగర్భశరీరప్రాప్తి, పుణ్యమధ్యమంబున నింద్రాదిశరీరప్రాప్తి, పుణ్యసామాన్యంబునకు యక్షరక్షఃపిశాచాది శరీరప్రాప్తి, పాపోత్కర్షంబునకు పరులకు సంతాపకరంబైన గుల్మవృశ్చిక యూకవనమక్షికాదిశరీర ప్రాప్తి, పాపమధ్యంబునకు ఆమ్లపనసనారికేళ మహిషాశ్వగర్దభాదిశరీర

ప్రాప్తి, పాపసామ్యంబున గోగజాశ్వత్థవృక్షాదిశరీరప్రాప్తి, మిశ్రోత్కర్షంబునకు నిష్కామకర్మానుష్ఠానము చేతను చిత్తశుద్ధి, తద్ద్వారా సాధనచతుష్టయసంపత్తి, తద్ద్వారా సద్గురులాభపూర్వకంబుగాఁ జేయఁబడిన శ్రవణమనననిదిధ్యాసనముల చేతను గలిగిన జ్ఞానముద్వారా జీవన్ముక్తిసుఖంబు నిచ్చునట్టి శరీరప్రాప్తి, మిశ్రమధ్యమంబునకు స్వాశ్రమోచితకామ్యకర్మంబులకు యోగ్యమైన శరీరప్రాప్తి, మిశ్రసామాన్యంబునకు చండాలవ్యాఘ్రాదిశరీరప్రాప్తియు నగును. కనుక వివేకియైనవాఁడు కర్మఫలతారతమ్యమును విచారించి మిశ్రోత్కర్షం బెవ్విధంబున సిద్ధించునో యని అందుకుం దగిన యత్నమును చేయవలయును.

ఈపుణ్యపాపమిశ్రరూపంబులైన కర్మంబు లెందుచేతఁ జేయఁబడుచునున్నవనిన; త్రివిధకరణంబుల చేతఁ జేయఁబడుచున్నవి. సమస్తమైన వారలును నీకర్మంబు నొనర్చితి మని చెప్పుచున్నారు గనుక వారలయొక్క అనుభవము చేతను ఆత్మనిష్ఠముగా కర్తృత్వము దోఁచుచున్నది. కనుక కర్తృత్వం బాత్మనిష్ఠముగానే చెప్పుద మనఁగా; ఆత్మ నిర్వికారుఁడు గనుక నిర్వికారుం డైన యాత్మకు కర్తృత్వము చెప్పఁగూడదు. అట్లయితే ఈకర్తృత్వం బాత్మయందు తోఁచుచున్నది గదా? దీనికి గతి యేమి యనిన; అన్యనిష్ఠమైన కర్తృత్వం బాత్మయందు తోఁచుచున్నది. కాఁబట్టి ఆత్మకు కర్తృత్వ మాగంతుకమని చెప్పవలెను. అన్యనిష్ఠమయిన కర్తృత్వ మాత్మయందుఁ దోఁచుచున్న దని యెందుకు చెప్పవలెను? స్వాభావికమే యని చెప్పుద మన; అటులను చెప్పఁగూడదు. మంచిది, స్వాభావిక మని చెప్పిన కర్తృత్వము పోవుటకొఱకు యత్నము చేయక యుండవలెను. అటులగాదు; ముముక్షువులయినవారలు అనేకులు యత్నము సేయుచున్నారు గనుక కర్తృత్వము స్వాభావికమని చెప్పఁగూడదు. కర్తృత్వము స్వాభావికము, కర్తృత్వము పోవుటకై యత్నంబునుం జేయనీ అంటే స్వాభావికమనఁగా; స్వరూపమాయెను గనుక స్వరూపనాశనార్థంబుగా యత్నం బొనర్చుచున్నా రని చెప్పఁబడును. స్వరూపనాశనార్థ మెవరును యత్నము సేయరు గాన స్వాభావికకర్తృత్వనివృత్త్యర్థమై యత్నముచేయుచున్నారని చెప్పఁగూడదు. మంచిది, స్వాభావికమయిన కర్తృత్వంబునకు నివృత్తి చెప్పునప్పుడు స్వరూపమే నశించిపోవుచున్నది. కాఁబట్టి

కర్తృత్వము విడువఁబడి అకర్తయైనవాఁడు యెవఁడును లేకపోవును గావున కర్తృత్వము స్వాభావికమని చెప్పఁగూడదు. కర్తృత్వము స్వాభావికముగానీ, నివృత్తియునుగానీ అనిన; అగ్నికి ఉష్ణత్వంబు స్వాభావికంబు. ఉష్ణత్వంబునకు మణిమంత్రౌషధంబులవలన నెటుల నివృత్తి వచ్చుచున్నదో అటులనే ఆత్మకును స్వాభావికమైన కర్తృత్వంబునకు నుత్కృష్ట కర్మోపాసనాద్యనుష్ఠానంబులవలన నివృత్తి వచ్చుచున్న దని చెప్పెద మన; అగ్నికి ఉష్ణత్వము కాలాంతరమందు మణిమంత్రాదివియోగంబు వలన నెటుల యావిర్భవించుచున్నదో అటులనే ఆత్మకును కర్తృత్వము ఉత్కృష్టకర్మోపాసనఫలంబునకు నాశముకాఁగా తిరుగా నావిర్భవించును. ఇటువలె చెప్పినట్టియున కర్తృత్వనివృత్తిరూపమైన ముక్తికి జన్యత్వంబును అనిత్యంబును వచ్చును. ఇంతియ గాదు. ఆత్మ కర్మ యని వచించునట్టి శ్రుత్యాదులకు వైయర్థ్యంబును సంభవించును. సుషుప్తియం దాత్మ యున్నాఁడు గనుక, అందునుం గర్తృత్వము దోఁపవలయును. అటులఁ దోఁచలేదు. కాఁబట్టి ఆత్మకు కర్తృత్వంబు స్వాభావికం బని చెప్పఁగూడదు. సుషుప్తియం దాత్మయుండిన నెందుకు కర్తృత్వంబుః దోఁపవలయు. అక్ష్యాదులకు స్వకార్యంబులఁ గూర్చి కర్తృత్వం బుండినప్పటికిని స్నానభోజనశయన విహారకాలాదులయందు దాస్యాదికరణసంయోగంబు లేదు గాన కర్తృత్వం బెటుల తోఁచ లేదో, దాస్యాదికరణయోగానంతరంబునం దెటుల తోఁచుచున్నదో అటులనే ఆత్మకును సుషుప్త్యవస్థయందు కర్తృత్వంబు నున్నది. ఉండినను త్రివిధకరణసంయోగంబు లేదు. కాఁబట్టి తోఁచలేదు. జాగ్రత్స్వప్నంబులయందు కరణసంయోగం బున్నది గనుక కర్తృత్వంబు దోఁచుచున్నదని చెప్పెద మనిన; తూష్ణీంభూతావస్థయందును కరణసంయోగం బున్నది గనుక అక్కడను కర్తృత్వంబు దోఁచవలెను. అటుల తోఁచలేదు గనుక కర్తృత్వంబు స్వాభావికంబు గాదు. మఱి యెటు లనిన; ఆగంతుకం బనియే చెప్పవలయును. ఆగంతుక మనఁగా; అన్యనిష్ఠమైన ధర్మము. అన్యనిష్ఠంబుగాఁ దోఁచునది యాగంతుకము. అటుల తోఁచునా ? యనిన ; తోఁచును, అది యెటులనఁగా; ఓడయెక్కి పోయెడి పురుషునకు నజ్ఞానముచేతను ఓడయందున్న చాంచల్యము తీరస్థములయిన వృక్షాదులయందును, తీరస్థవృక్షాదినిష్ఠమయిన అచాం

చల్యమును ఓడయందు నెటుల తోఁచుచున్నదో, అటులనే త్రివిధ కరణనిష్ఠమైన కర్తృత్వము అజ్ఞానముచేతను ఆత్మనిష్ఠముగాఁ దోఁచు చున్నది. ఆత్మనిష్ఠమైన ఆకర్తృత్వము త్రివిధకరణనిష్ఠముగాఁ దోఁచు చున్నది. ఇందుకు దృష్టాంతము.—

చంద్రునిఁజూచు పురుషునికి మేఘనిష్ఠమయిన చాంచల్యము చంద్రనిష్ఠముగాను, చంద్రనిష్ఠమయిన చాంచల్యము మేఘనిష్ఠముగాను యెటులఁ దోఁచుచున్నదో, అటుల త్రివిధకరణనిష్ఠమయిన కర్తృత్వము అజ్ఞానముచేతను ఆత్మనిష్ఠముగాఁ దోఁచుచున్నది. కనుక ఆత్మకు కర్తృత్వము ఆగంతుకమే అయిన, త్రివిధకరణంబులకును కర్తృత్వము కలిగినగదా! అది ఆత్మనిష్ఠంబుగాఁ దోఁచుచున్నదని చెప్ప వచ్చును. త్రివిధకరణంబులును అచేతనంబులు గాన వానికి కర్తృత్వము చెప్పనే కూడదు. అది యెటు లనిన; లోకంబునందు చేతనులకు కరణసాపేక్షంబుగాఁ గర్తృత్వము కానఁబడుచున్నది గనుక అచేత నంబు లయిన త్రివిధకరణంబులకు కర్తృత్వము చెప్పనే కూడదు. చెప్పినచో చేతనత్వంబును కరణాంతరంబునుం గల్పింపవలయును. అటుల కల్పింపఁగూడదు గనుక త్రివిధకరణంబులకును కర్తృత్వమే కూడదని చెప్పెద మన; అటుల చెప్పఁగూడదు. అది యెట్టు లనిన; లోకంబునం దచేతనంబులకే కర్తృత్వము కానఁబడుచున్నది. కనుక, అచేతనంబు లయిన త్రివిధకరణంబులకును కర్తృత్వము చెప్ప వచ్చును. లోకమునం దచేతనంబులకుఁ గర్తృత్వం బెక్కడ కానఁ బడుచున్నదనిన; వాయ్వాదులయందు కానఁబడుచున్నది. ఎటువలె ననిన; అచేతనమయిన వాయువునకు కరణంబులును, చేతనత్వంబును అపేక్షింపకయే 'వృక్షాదులను విఱుచుట' యనెడి క్రియనుగూర్చి కర్తృ త్వము కానఁబడుచున్నది. ఇంతమాత్రమే కాదు. ప్రవాహమునకుఁ గరణంబును, జేతనత్వంబును అపేక్షింపకయే వృక్షాదులను పెరుకుట యనెడి క్రియనుగూర్చి కర్తృత్వము కానఁబడుచున్నది. కనుక అచే తనంబులయిన త్రివిధకరణంబులకును జేతనత్వంబును కరణాంతరం బును కల్పింపకయే త్రివిధకర్మములను గూర్చి కర్తృత్వము కూడును. అయితే త్రివిధకర్మములచేతం జేయఁబడిన పుణ్యాపాపమిశ్రకర్మంబు లెవ్వి యనిన; సవిశేషచింతయు, నిర్విశేషచింతయు, పరలోకచింతయు,

పరహితచింతయు, భక్తిజ్ఞానవైరాగ్యచింతయు, మనస్సుచేతఁ జేయఁబడిన పుణ్యకర్మంబులు; సర్వదా విషయచింతయు, పరాహితచింతయు, వేదశాస్త్ర ప్రామాణ్యాచింతయు, ధర్మాధర్మాద్యభావచింతయు, పరలోకాద్యభావచింతయు ననునివి మొదలగునవి మనస్సుచేతఁ జేయంబడిన పాపకర్మంబులు. సవిశేషనిర్విశేషధ్యానకాలాదులయందుఁ జేయఁబడిన విషయాదిచింత మనస్సుచేతఁ జేయఁబడిన మిశ్రకర్మము వేదాధ్యయనంబును, శాస్త్రపఠనంబును, గీతాసహస్రనామాదిపఠనంబును, గాయత్రీపంచాక్షర్యాదిజపంబును, భగవన్నామ సంకీర్తనంబును, పరోపకారవార్తాదులును ఇవి మొదలగునవి వాక్కుచేతఁ జేయఁబడిన పుణ్యకర్మంబులు. పెద్దలను దూషించుటయు, పరుల నాడరానిమాట లాడుటయు, అసత్యములు పలుకుటయు, చాడీలు చెప్పుటయు నివి మొదలగునవి వాక్కువలనఁ జేయఁబడిన పాపకర్మంబులు వేదాధ్యయనజపాదికాలంబులయందు లౌకికవార్తయు, ప్రమాణములు సేయుటయును, వాక్కుచేతఁజేయఁబడిన మిశ్రకర్మంబులు. పుణ్యతీర్థంబులందు స్నానంబొనర్చుటయు, గురుదేవతా నమస్కారంబు లాచరించుటయు, పరులను పీడింపకుండుటయు, అంగప్రదక్షిణంబును ఇవి మొదలగునవి కాయముచేతఁ జేయఁబడిన పుణ్యకర్మంబులు. సర్వదా పరులను పీడించుటయును, పరస్త్రీసంగమంబును, పరధనాపహారణంబును, దొంగిలుటయును, విటకాండ్రంగూడి సంచరించుటయును ఇవి మొదలైనవి కాయముచేతఁ జేయఁబడిన పాపకర్మములు. బ్రాహ్మణజనభోజననిమిత్తమయి బ్రాహ్మణులను పీడించుటయు, పరులద్రవ్యము నపహరించి చలివెందరలు పెట్టుటయు, గుడిగోపురములును, మఠాదులును గట్టుటయు, వెట్టిమనుష్యులచేత గుంటలు మొదలైన వానిని త్రవ్వించుటయు, బ్రాహ్మణవృత్తుల నపహరించి దేవాలయంబులకు విడుచుటయు ఇవి మొదలైనవి కాయముచేతఁ జేయఁబడిన మిశ్రకర్మములు. ఇటువలెనే త్రివిధకరణములచేతను, త్రివిధకర్మములును చేయఁబడుచున్నవి. ఈ విచారణకు ఫల మెద్ది యనిన; ముఖ్యఫలమనియు, అవాంతరఫలమనియు రెండువిధములు. ఇందున ముఖ్యఫల మేమనిన; ఈత్రివిధకర్మంబులును త్రివిధకరణంబులే చేయుచున్నవి. ఆత్మ యొక కర్మంబునుం జేయదు. ఆ యకర్తయైనయాత్మ నే నని దృఢనిశ్చయము

కలుగుటయే ముఖ్యఫలము. అవాంతరఫలం బెయ్యది యనిన; ఇటు వలెనే నిశ్చయజ్ఞానము గలిగినను త్రివిధకరణములను పుణ్యకర్మంబుల యందే వర్తింపఁ జేయవలయును. ప్రమాదవశంబున పుణ్యకర్మంబుల యందు త్రికరణంబులును వర్తింపక పోయినను ఆ త్రివిధకరణములను మిశ్రకర్మలయం దైనను వర్తించునటులఁ జేయింపవలయును. సర్వవిధములచేతను పాపకర్మలయందు కరణములను వర్తింపకుండఁ జేయవలయును. ఇది యీవిచారణకు అవాంతరఫలము. ఒకటికి రెండుఫలములు కలుగునా యనిన; కలుఁగును. అది యెటువలెనంటే; అరఁటిచెట్టు పైరు పెట్టినవానికి అరఁటిపండ్లు తనకు కావలసినట్లు వినియోగము చేసి కొనుట యెటుల ముఖ్యఫలమో, ఆకులు పువ్వులు కాయలు నార బొందె పిల్లలు మొదలైనవి యనుభవించుట యెట్లు అవాంతరఫలమో అటులనే ఈ విచారణకును ముఖ్యఫలమనియు, నవాంతరఫలమనియు రెండు విధంబులు. అయితే త్రివిధకరణంబులును ఒకదానివలన ప్రేరేపింపఁబడి త్రివిధంబు లగుకర్మంబులం జేయుచున్నవో, లేక తానే చేయుచున్నదో యనిన; తానే చేయుచున్నదని చెప్పరాదనిన; అటుల చెప్పఁగూడదు. చెప్పినట్లయిన పరుసవేది మొదలయినవి కారణంబులు గనుక వానికిని ప్రేరకుని యపేక్షలేకయే కర్తృత్వము రావలెను. అటుల లేదు. కనుక ఒకటిచేత ప్రేరేపింపఁబడుచున్నదని చెప్పవలెను. అయితే చేతనునివలన ప్రేరేపింపఁబడి చేయుచున్నదో, అచేతనునివలనం బ్రేరేపింపఁబడి చేయుచున్నదో యనిన; చేతనునిచేత ప్రేరేపింపఁబడి చేయుచున్నదని చెప్పరాద మనిన; చేతనుఁడైనయాత్మ నిర్వికారుఁడు గనుక చేతనునిచే ప్రేరేపింపఁబడి చేయుచున్న దని చెప్పఁగూడదు. మఱి యెటు లనిన: అచేతనునిచేతనే ప్రేరేపింపఁబడి చేయుచున్నదని చెప్పవలయును. ఇటుల నచేతనునిచేత ప్రేరేపింపఁబడ్డదని చెప్పవచ్చు ననిన; చెప్పఁగూడదు. అటుల చెప్పిన, ఘటము ఘటాంతరంబుచే ప్రేరేపింపఁబడినదై జలాహరణాదిక్రియలను చేయవలయును. అటుల కానము గనుక నేను గుడి గట్టించితి సహస్రబ్రాహ్మణభోజనము సేయించితి నని యాత్మ నిష్ఠముగానే కారయితృత్వము తోఁచుచున్నదని చెప్పరాద మనిన, ఆత్మ నిర్వికారుఁడు గాన ఆత్మకు కారయితృత్వము చెప్పఁగూడదు. అయిన ఈ కారయితృత్వానుభవంబునకు గతి యేది యనిన; అన్య

నిష్ఠమయిన కారయితృత్వము ఆత్మయందు తోఁచుచున్నది గనుక ఆత్మకు కారయితృత్వము ఆగంతుక మనియే చెప్పవలెను. అన్యనిష్ఠమయిన కారయితృత్వము ఆత్మయందు తోఁచుచున్న దని యెందుకు చెప్పవలెను. ఆత్మకు స్వాభావికమే యని చెప్ప రాదా అనిన; అటుల చెప్పరాదు. స్వాభావికమని చెప్పినట్లులయితే కారయితృత్వ నివృత్త్యర్థమై యెవరును యత్నము సేయక యుండవలయును. ముముక్షువులయినవారలు యత్నము సేయుచున్నారు. కనుక ఆత్మకు కారయితృత్వము స్వాభావిక మని చెప్ప గూడదు. ఆత్మకు కారయితృత్వము స్వాభావికంబునుం గానీ, యత్నంబునుం జేయనీ అనిన; స్వాభావిక మనఁగా స్వరూపము గనుక స్వరూపనాశనార్థముగానే చేయుచున్నారని ప్రమాద దోషము వచ్చును. అటుల స్వరూపనాశనార్థముగా నెవరును యత్నము సేయరు గనుక స్వాభావికకారయితృత్వ నివృత్త్యర్థమై యత్నము సేయుచున్నారని చెప్పఁగూడదు. ఇంతియ కాదు; స్వాభావికమయిన కారయితృత్వమునకు నివృత్తి వచ్చునప్పుడు స్వరూపమే నశించి పోవుచున్నది గనుక కారయితృత్వముచేత విడువఁబడి అకారయితయై ఉండేవాఁడు ఎవఁడును లేకపోవలయును కాన కారయితృత్వము స్వాభావిక మని చెప్పఁగూడదు. కారయితృత్వము స్వాభావికమును గానీ, నివృత్తియుఁ గానీ అనిన; అగ్నికి ఉష్ణత్వము స్వాభావికముగదా! స్వాభావికమైన ఉష్ణత్వమునకు మణిమంత్రౌషధములచేత నెటుల నివృత్తి వచ్చుచున్నదో అటులనే ఆత్మకును స్వాభావికమయిన కారయితృత్వమునకును, ఉత్కృష్టకర్మోపాసనాద్యనుష్ఠానములచేత నివృత్తి వచ్చుచున్నదని చెప్పెద మనిన; అగ్నికి ఉష్ణత్వము కాలాంతరమందు మణిమంత్రాది వియోగముచేత నెటుల నావిర్భవించుచున్నదో అటులనే యాత్మకును కారయితృత్వము ఉత్కృష్టకర్మోపాసనాఫలమునకు నాశము వచ్చుచుండఁగా తిరుగా నావిర్భవించును. ఇటుల చెప్పినట్లులయిన కారయితృత్వనివృత్తిరూపమయిన ముక్తికి జన్యత్వంబును అనిత్యత్వంబును వచ్చును. ఇంతియ కాదు; 'ఆత్మ లకారయిత' అని చెప్పు శ్రుతులకు వైయర్థ్యము సంభవించును. సుషుప్తియందాత్మ ఉన్నాఁడు గనుక అచట కారయితృత్వము తోఁచవలయును. సుషుప్తియందాత్మయున్నచో కారయితృత్వ మెందుకు తోఁచవలయును అనిన; ఉపా

ధ్యాయులకు అధ్యాపకత్వంబు స్వాభావికంబుగా నున్నను నియమ్యు లయిన శిష్యులు సన్నిధానంబునందు లేకున్న పక్షంబున నెటుల నధ్యాపకత్వము తోఁపకున్నదో, శిష్యులు సన్నిధానమం దుండుటవలన నెటుల నధ్యాపకత్వము తోఁచుచున్నదో, రాజప్రభృతులకు నియంతృత్వము స్వాభావికంబుగా నున్నను నియమ్యులయిన మంత్రిపురోహితాదులు సన్నిధానమందు లేకున్న పక్షమందు నియంతృత్వ మెటుల తోఁచ లేదో, ఆమంత్రిపురోహితాదులు సాన్నిధ్యమునం దున్న నియంతృత్వం బెటుల దోఁచుచున్నదో, ఆలాగుననే ఆత్మకును సుషుప్త్యవస్థయందు కారయితృత్వము స్వాభావికమై యున్నప్పటికిని నియమ్యులగు త్రివిధ కరణసంపర్కము లేనందున కారయితృత్వము తోఁచలేదు. జాగ్ర త్స్వప్నంబులయందు నియమ్యంబులగు కరణసంయోగంబున్నది గనుక కారయితృత్వంబు దోఁచుచున్నదని చెప్పిన తూష్ణీంభూతావస్థయందు కరణసంపర్కంబున్నది గాన నచ్చట కారయితృత్వము గనుక ఆత్మకు కారయితృత్వము స్వాభావిక మని చెప్పఁగూడదు. ఆగంతుక మనియే చెప్పవలయును. ఆగంతుక మనఁగా, అన్యనిష్ఠమయిన ధర్మం బన్య నిష్ఠంబుగఁ దోఁచును. అది యెటులనిన; జపాకుసుమముయొక్క లోహి తత్వము స్ఫటికనిష్ఠముగా నెటుల దోఁచుచున్నదో, అగ్నినిష్ఠమైన ఉష్ణప్రకాశత్వములు అయగిపిండనిష్ఠముగాను, అయగిపిండనిష్ఠమైన దీర్ఘత్వవర్తులత్వాదులు అగ్నినిష్ఠముగాను, రాగద్వేషాదినిష్ఠమైన కారయితృత్వము అజ్ఞానముచేత నాత్మనిష్ఠముగాను, ఆత్మనిష్ఠంబైన అకారయితృత్వము రాగద్వేషాదినిష్ఠముగాను తోఁచుచున్నది. అచేత నంబులకు కారయితృత్వము చెప్పఁగూడదు. చెప్పినచో ఘటంబు ఘటాంతరంబును ప్రేరేపింపవలయును గదా. అందుకు సమాధానం బేమి యనిన; అక్కడ యోగ్యత లేదు కనుక ప్రేరకత్వము కూడదు. యోగ్యత కలదానియందు ప్రేరకత్వము కూడు నని తోఁచుచున్నది. యోగ్యత గలచోటను ప్రేరేపకత్వ మెక్కడ కనుపడిన దనిన; అగ్ని హోత్రము మంటలోఁ గూడుకొనియుండు ఫిరంగిగుండ్లచేత చతురంగ బలమును సంహారము చేయుచున్నది. గనుక అచేతనం బగు నగ్నికి అచేతనములైన పాషాణాదులను గూర్చి ప్రేరకత్వము కానఁబడుచున్నది. ఇంతియ గాక, ప్రేతశరీరంబునకును స్వకీయజ్ఞాతిజనులచేతఁ జేయఁబడిన

క్రియలనుగూర్చి కారయితృత్వంబు గానంబడుచున్నది. అటులనే అచేతనంబులగు రాగద్వేషాదులకును త్రివిధకరణంబులవలనం జేయంబడిన త్రివిధకర్మంబులం గూర్చి కారయితృత్వంబుం జెప్పవలయును. ఇటుల చెప్పినపక్షమందు ఆత్మకు సర్వాంతర్యామిత్వమును జెప్పునట్టి శ్రుత్యాదులకు తాత్పర్యం బేమి యనిన, ఆత్మ నిర్వికారుఁడు గనుక ఆత్మకు నస్మదాదులవలె కారయితృత్వము చెప్పఁగూడదు. మఱి యెట్టులనిన, ఆదిత్యునియొక్క సన్నిధానముచేతను, సమస్తప్రాణులును, స్వకార్యంబులం దెటుల ప్రవర్తించుచున్నారో, అయస్కాంతసాన్నిధ్యముచేత అయస్సు ఎటుల చలించుచున్నదో, అటుల నాత్మసాన్నిధ్యమాత్రముచేత సమస్తమైన జగత్తును చలించుచున్నదని, శ్రుతిస్మృత్యాదులకు తాత్పర్యమని చెప్పవలయును. అటుల చెప్పినందువలన ఆత్మకు నిర్వికారత్వము సిద్ధించునా ? యనిన; సిద్ధించును. అది యెటు లనఁగా; ఆదిత్యప్రకాశసాన్నిధ్యముచేతను సకల ప్రాణులును వ్యాపారము సేయుచున్నప్పటికిని ప్రాణినిష్ఠములైన వికారములు ఆ సూర్యు నెటుల నంటవో, అయస్కాంతసాన్నిధ్యమువలన అయస్సు చలించినను అయోనిష్ఠములైన వికారము లా అయస్కాంతము నెటుల స్పృశింపలేవో అటులనే ఆత్మసన్నిధానమువలన సమస్తేంద్రియంబులు చలించినప్పటికిని ఇంద్రియనిష్ఠములైన వికారంబు లాత్మను కాలత్రయంబులయందును స్పృశింపనోపవు. కాఁబట్టి ఆత్మకు నిర్వికారత్వముఁ గూడును.

ఈ విచారంబునకు ఫలం బేమనిన, రథము నడిపించుటయందు నధికారులైనవారిచేత తేరు నడిపించు వ్యాపారం బభిమానమువలన వారలకు నియంతలై స్వస్థులైన ప్రభువులయందు నేను రెండు గడియలలోనే తేరు పఱచునటుల చేసితి నని యెటువలెఁ దోఁచుచున్నదో, అటులనే రాగద్వేషాదినిష్ఠమైన కారయితృత్వము అభ్యాసముచేత ఆత్మనిష్ఠముగాఁ దోఁచుచున్నది. విచారించినయెడల ఆత్మకు కారయితృత్వము లేదు గనుక అకారయితయైనను, నిర్వికారుఁడై తన్ను ఆత్మ నే ననెడి దృఢనిశ్చయము గలుగుటయే యీ విచారమునకు ఫలము. ఈ యర్థంబునందు సంశయంబు లేదు. సిద్ధము.

శ్లో. త్రివిధైరేవ కరణైః పుణ్యాపాపం చ మిశ్రకమ్,
క్రియతే న మయా కర్తేత్యేవం బుద్ధిర్విముచ్యతే.
రాగాద్యైరేవ నిర్వర్త్యం ప్రేరకత్వం న మే క్వచిత్,
ఇతి యస్య దృఢా బుద్ధి స్సము క్త స్సచ పండితః.

ఇది పంచమవర్ణకము.

---

# షష్ఠవర్ణకము

## రాగద్వేషాదిప్రకరణము

శ్లో. రాగాద్యైశ్శ్రద్ధయా యుక్తో బద్ధో ముక్తో భవేన్నరః,
తద్రాగాదికం త్రివిధం కేన స్యాదితి చింత్యతే.

ఏ రాగద్వేషములవలన నరుఁడు ప్రేరేపింపఁబడినవాఁడై త్రివిధ కరణంబులును, త్రివిధకర్మములును చేయుచున్నాఁడో, ఆ రాగద్వేషాదులు ఎన్ని విధంబులని విచారించుదము. ఎటులనఁగా; రాగ ద్వేష కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య ఈర్ష్య అసూయ దంభ దర్ప అహంకార ఇచ్ఛా భక్తి శ్రద్ధలని బదియాఱువిధంబులు, వీనియొక్క భేదంబులం జెప్పుచున్నారము. స్త్రీవిషయమయి వచ్చెడి చిత్తవృత్తికి రాగమనియును, ఒకం డపకృతి యొనర్చిన నాయపకృతికిఁ బ్రతిక్రియసేయవలయునని తోఁచెడిది ద్వేషమనియును, గృహారామక్షేత్రధనధాన్యాదులను సంపాదింప వలయు ననెడిది కామమనియును, తాను సంపాదించినట్టి పదార్థంబులకు విఘ్నము సేయునట్టి వానియందు దుగ్రము గలిగెడిది క్రోధమనియును, ఆర్జించిన పదార్థంబులను సెలవు సేయఁగూడ దనియెడిది లోభమును, ఐశ్వర్యమదముచేత కృత్యాకృత్యంబుల నెఱుంగలేనిది మోహమనియును, సకల సంపదలు గలిగిన నేను ఏమి సేసినను చెల్లునని తోఁచెడిది మద మనియును, ఒకఁడు తనకంటె నధికుఁడై యుండెనేని వాని యుత్కర్షమును సహింపనోపనిది మాత్సర్య మనియును, దుఃఖము పరునికి రాక తనకు రావచ్చునా? యనెడిది ఈర్ష్య యనియును, మనవలెనే పరులు సుఖముగ

నుండవచ్చునా? యని తోఁచెడిది అసూయ యనియును, తానొనర్చిన ధర్మము నలుగు రెఱింగి మెచ్చవలయు నని తోఁచెడిది దంభమనియును, తాను దొడ్డవాఁడనియు, నితరులెవరును తనకు సరి కారనియును తోఁచెడిది దర్పమనియును, ఓరీ నిన్ను శిక్షించెడివాఁడ నని యెఱుంగవా? నేను పట్టిన కార్యమును విడువనట్టివాఁడ నని పరులను బెదరించెడిది అహంకార మనియు, అనిర్వాచ్యంబు లగుశౌచాదిక్రియలను జేయవలె ననెడిది యిచ్ఛ యనియును, గురుదేవతాదులయందుఁగల ప్రీతికిభక్తి యనియును, గురువులయందును, వేదాంతవాక్యములయందును, యాగాదిక్రియలయందును గల విశ్వాసమునకు శ్రద్ధయనియును పేళ్లు. ఈ చందంబున రాగద్వేషాదులయొక్క స్వరూపంబుల నెఱుంగవలయును. ఈవిచారంబునకు ఫలం బేమనిన; రాగాదులు యత్నము సేయకయే వచ్చుచున్నవి. అహంకారవంతములగు రాగ మాదిగాఁగల పదిమూఁడింటికిని వశ్యుఁడై త్రివిధకరణంబులచేతను కర్మంబుల నొనర్చినచో వానికి నరకమువలన నివృత్తి లేదు గాన రాగద్వేషాదులకు చిత్తవృత్తులను ద్రిప్పి సర్వవిధంబులచేతను శ్రద్ధాభక్తిరూపంబులుగాఁ జేసినచోఁ గ్రమముగా శీఘ్రంబున సంసారబంధంబువలన విముక్తుఁడగును. కనుక శ్రద్ధాభక్తులను సంపాదింపవలయును. ఇచ్ఛచేతఁ జేయఁదగిన క్షుత్పిపాసాదినివృత్తియు, మూత్రపురుషాదివిసర్జనంబునుం జేయకున్నఁ దాత్కాలికంబునందు బాధకం బగును. వీనివలన స్వర్గనరకాది ప్రాప్తి లేదని యెఱుంగుట ఈ విచారంబునకు ఫలంబు. సుషుప్త్యవస్థయందును, తూష్ణీంభూతావస్థయందును, సమాధ్యవస్థయందును, రాగద్వేషంబులు లేవు గాన కర్మంబును లేదు. జాగ్రత్స్వప్నంబులయందు రాగద్వేషంబు లున్నవి గనుక కర్మంబున్నది గనుక రాగద్వేషములు గలిగిన కర్మంబునుం గలదు. రాగద్వేషంబులు లేకుండిన కర్మంబును లేదనుట అన్వయవ్యతిరేకంబులచేత సిద్ధము. ఈ రాగద్వేషాదులు అభిమానముచే వచ్చుచున్నవి. సమస్తజనులకు అభిమానపూర్వకంబగు రాగాదిపూర్వకం బగుప్రవృత్తి వచ్చునా? యనిన; ఒకస్త్రీకి నేను స్త్రీననను నభిమాన మెప్పుడు వచ్చుచున్నదో, అప్పుడు రాగాది పూర్వకంబుగా భర్తృశుశ్రూషయందును గృహాసంరక్షణంబునందును, పాకాదిక్రియలయందును, ప్రవృత్తి కనుపడుచున్నది. అటులనే పురు

షునకును నేను పురుషుండ నను నభిమానం బెప్పుడు వచ్చుచున్నదో అప్పుడు రాగాదిపూర్వకంబుగ దారాదిపరిగ్రహంబులయందును, కృష్యాదులయందును, ధనధాన్యార్జనములయందును ప్రవృత్తి కానబడుచున్నది. అటులనే; జనంబులకును వర్ణాశ్రమాద్యభిమానములచేతను, స్వస్వోచితవ్యాపారములయందు రాగాదిపూర్వకముగాఁ బ్రవృత్తి కనుపడుచున్నది గనుక రాగాదుల కభిమానము కారణము. ఈ విచారంబునకు ఫలం బేమి యనిన; ముముక్షువు లగువారలు సర్వవస్తువులయందును నభిమానమును పూర్తిగ విడువవలెను. విడిచినట్టయిన దుఃఖమువలన విడువఁబడుదు రని ఫలము. కనుక అభిమానంబు గలిగిన రాగాదులును గలవు. అభిమానంబు లేకున్న. రాగాదులును లేవనుటకు సుషుప్తి, జాగ్రత్త, తూష్ణీంభూతావస్థలయందు అనుభవము చూచుకొనవలసినది. అయిన నీ యభిమానము అవివేకము చేత వచ్చుచున్నది. అది యెటులనిన; సమస్తమైనవారలకును నేను బ్రాహ్మణుఁడను, నేను క్షత్రియుఁడను, నేను వైశ్యుఁడను, నేను శూద్రుఁడను అని బ్రాహ్మణత్వాద్యభిమానము వచ్చుచున్నది గదా! అది దేని నవలంబించి వచ్చుచున్న దని తెలుసుకొను వివేకము ఎవరికిని లేదు గనుక అభిమానము వచ్చుచున్నది. దీనికి అవలంబనము లేదా అనిన; శరీరంబు నవలంబించుకొని వచ్చుచున్న దని చెప్పెద మనిన; శరీరము క్షత్రియాదులకు సాధారణమై యున్నది గనుక వారలకు నేను బ్రాహ్మణుఁడ నని యభిమానము రాలేదు. కాఁబట్టి బ్రాహ్మణత్వాదులు శరీరంబు నవలంబించి వచ్చుచున్న వని చెప్పఁగూడదు. అయిన శిఖాయజ్ఞోపవీతాదుల నవలంబించుకొని వచ్చుచున్నవని చెప్పెదమనిన; శిఖాయజ్ఞోపవీతములు కులాలాదులకు సాధారణమై యున్నవి గనుక వారలకును నేను బ్రాహ్మణుఁడ నని యభిమానము రాలేదు. కాఁబట్టి శిఖాయజ్ఞోపవీతాదుల నవలంబించుకొని వచ్చుచున్న దని చెప్పఁగూడదు. అయితే ఒక్కొక యవయవంబులకు బ్రాహ్మణత్వాదులను చెప్పెద మనిన; ఆయా యవయవంబులకు భిన్నంబులైన నామంబు లున్నవి గనుక ఆయా యవయవంబులకు బ్రాహ్మణత్వాదివ్యవహారంబు లేదు గనుక ఆయా యవయవంబులకు బ్రాహ్మణత్వాదులు చెప్పఁగూడదు. అయిన విశిష్టమైన మాతాపితృల వలన జన్యములైన అవయవంబులకు బ్రాహ్మణత్వాదులు చెప్పెద మనిన;

విశిష్టమైన మాతృపితృాదులచేతఁ ద్యజింపఁబడిన కేశ, రోమ, నఖ, దంత, మల, మూత్రాదులకును బ్రాహ్మణత్వాది వ్యవహారము రావలెను. అట్లు రాలేదు గనుక దేనికిని బ్రాహ్మణత్వాదులు నిర్ణయించి చెప్పఁ గూడదు. బ్రాహ్మణత్వాదివ్యవహారమునకు గతి యేమనిన; శోభనం బనియును, ఉత్సవ మనియును అనేక వస్తుసమూహంబులకు ఆయా నామంబు లెటుల వచ్చుచున్నవో అటులనే అనిర్వచనీయమైన దేహేంద్రియాదిసంఘాతంబునకు వ్యవహారంబునందు బ్రాహ్మణుం డని పేరు. అటులనే క్షత్రియుఁ డనియు, వైశ్యుఁ డనియు, శూద్రుఁ డనియు, శాస్త్రజ్ఞుఁ డనియు, పౌరాణికుఁ డనియు, అవధాని యనియు, శైవుఁడనియు, వైష్ణవుఁడనియు ఇవి మొదలైన సమస్తనామంబులును దేహేంద్రియాదిసంఘాతమును విషయీకరించుకొని వచ్చుచున్నవి గనుక, దేహేంద్రియాదిసంఘాతంబునకే కాని ఆత్మకు కాలత్రయంబు నందును ఈ నామాదులు లేవని యెఱుంగకుండుట అవివేకము. ఈ యవివేకముచేతనే అభిమానంబు వచ్చుచున్నది. ఈ విచారంబునకు ఫల మేమనిన; బ్రాహ్మణత్వాదులు దేహేంద్రియాదిసంఘాతంబునకే యని యెఱుంగుట ఫలము. ఈయవివేక మెందుచేత వచ్చిన దనిన; అజ్ఞానము చేత వచ్చినది. అజ్ఞాన మనఁగా నెయ్యది యనిన; తన్నుఁ దా నెఱుంగ కుండుట. సదసత్తని చెప్పరాద మనిన; విరుద్ధము గనుక సదసత్తనియును చెప్పఁగూడదు. భిన్న మని చెప్పరాదమనిన; అద్వితీయబ్రహ్మమునకు హాని వచ్చును. ఆత్మ అద్వితీయుఁడని చెప్పెడిశ్రుతులకు వైయర్థ్యము వచ్చును. ఇంతియ కాదు. మాయకు ఆత్మ సత్తకంటె వ్యతిరిక్తమైన సత్త లేదు గాన ఆత్మకంటె భిన్నమైన పదార్థమని చెప్పఁగూడదు. భిన్నమని చెప్పి నట్లయిన ఆత్మ శక్తి యని ప్రతిపాదించెడి శ్రుతులకు వైయర్థ్యము వచ్చును. ఇంతియ కాదు; అభిన్నమని చెప్పినట్లయిన మాయకు చేతన త్వము రావలెను. అచేతనత్వము రాకపోవలెను. ఆత్మకు చేతనాచేతన స్వరూపత్వమనెడి ప్రమాదదోషంబు వచ్చును. మాయ యని చెప్పఁ బడకయుండవలెను. ఆత్మ యని చెప్పఁబడవలెను. ఆత్మ యని చెప్పెద మనిన; మాయయనియు, ప్రకృతియనియు, తన్ను తా నెఱుంగఁ డనిన; ఎఱుంగఁడు. తన్నుఁదా నెఱుఁగఁడని చెప్పవచ్చు ననఁగా; చెప్పవచ్చును. అది యెట్లనఁగా; నేను బ్రాహ్మణుఁడననియు, నేను క్షత్రియుఁడననియు,

నేను వైశ్యుఁడననియు, నేను శూద్రుఁడ ననియు, ఈకులగోత్రముల
యందుఁ బుట్టినవాఁడననియు, ఈశరీరము నే నాత్మగా నెఱుంగుదు రింతియె
కాని శరీరవ్యతిరిక్తుఁడైన యాత్మను నెవరును నెఱుఁగరు. ఎఱుఁగరని చెప్ప
వచ్చునా? శాస్త్రజ్ఞు లయినవారలు శరీరవ్యతిరిక్తుఁడైన ఆత్మయున్న వాఁ
డని చెప్పుచుండఁగా ఎవరును నెఱుఁగ రని యెటుల చెప్పవచ్చుననిన;
చెప్పవచ్చును. అది యెటులనన్న; కర్తయు, భోక్తయు, పరిచ్ఛిన్నుం
డును, లోకాంతరగామియు నయినజీవుని నాత్మగా నెఱుంగుదు రింతియె
కాని యకర్తయు, నభోక్తయు, నపరిచ్ఛిన్నుఁడు, నసంగుఁడు, నద్వితీ
యుఁడు, వేదాంతవేద్యుఁడు నైన ప్రత్యగాత్మ నెవరు నెఱుంగరు. ఇట్టి
యాత్మ నెఱుంగమి యే యజ్ఞానము. ఈయజ్ఞానముచేత నవివేకము వచ్చు
చున్నది. ఈయజ్ఞాన మెందుచేత వచ్చిన దనిన; అజ్ఞాన మనాది గనుక
నొకటిచేత వచ్చుచున్న దని చెప్పఁగూడదు. ఈ యజ్ఞానంబునకు
స్వరూప మేమనిన; చెప్పెదము. ఈయజ్ఞానము జ్ఞానముచేత బాధింపఁ
బడుచున్నది గనుక సత్తని చెప్పఁగూడదు. అసత్తని చెప్పుద మనిన;
శశవిషాణాదులవలె తోఁచకపోవలెను. అహమజ్ఞుండ నని యజ్ఞాన
మనుభవంబున్నది. అందువలన నజ్ఞాన మసత్తనియును జెప్పఁగూడదు.
ప్రధాన మనియు, అవిద్య యనియు, ప్రళయ మనియు, మహాసుషుప్తి
యనియు, తమస్సనియు, అజ్ఞానమనియు, ఆత్మప్రతిపాదకవ్యతిరిక్తము
లయిన శబ్దములచేతఁ జెప్పబడుచున్నది గనుక నాత్మయని చెప్పఁగూ
డదు. భిన్నాభిన్నమని చెప్పుద మనిన; విరుద్ధము గనుక చెప్పఁగూడదు.
సావయవమని చెప్పుద మనిన; మూలకారణము గాకపోవలెను. మూల
కారణమయియున్నది గనుక సావయవ మని చెప్పఁగూడదు. నిరవ
యవ మని చెప్పుద మనిన; జగదాకారముగాఁ బరిణమింపకపోవలెను.
జగదాకారంబుగాఁ బరిణమించుచున్నది గనుక నిరవయవ మని చెప్పఁ
గూడదు. ఉభయాత్మకమనిన; విరుద్ధంబు గాన చెప్పఁగూడదు. మఱి
యెటుల చెప్పవలెననిన; అనిర్వచనీయ మని చెప్పవలెను. ఈయనిర్వచ
నీయ మయిన యజ్ఞానముచేత నవివేకంబును, అవివేకముచేత నభిమా
నంబును, అభిమానమువలన రాగద్వేషాదులును, రాగద్వేషాదులవలన
కర్మంబును, కర్మంబువలన శరీరంబును, శరీరపరిగ్రహంబువలన దుఃఖం
బును వచ్చుచున్నవి. దుఃఖమున కాత్యంతికనివృత్తి యెప్పుడు వచ్చు

ననిన; సర్వాత్మనా శరీరపరిగ్రహంబు రాకపోయె నేని వచ్చును. ఈ శరీరపరిగ్రహము సర్వాత్మనా లేకపోవుట యెప్పటి కనిన; సర్వాత్మనా కర్మము లేకపోవునప్పుడు. కర్మము సర్వాత్మనా యెపుడు పోవు ననిన; సర్వాత్మనా రాగద్వేషాదులు పోవునప్పుడు. రాగద్వేషాదులు ఎప్పుడు పోవు ననఁగా; సర్వాత్మనా అభిమానము పోను. అభిమానము సర్వాత్మనా యెప్పుడు పోవుననిన; సర్వాత్మనా అవివేకము పోయినపోవును. అవివేకము సర్వాత్మనా యెపుడు పోవు ననిన; సర్వాత్మనా అజ్ఞానము పోయిన పోవును. ఈ అజ్ఞానము సర్వాత్మనా యెప్పుడు పోవు ననఁగ; అద్వితీయబ్రహ్మాత్మైక్యాపరోక్షజ్ఞానముచేతనే కాక మరియొందుచేతను పోదు. కర్మముచేత అజ్ఞానంబునకు నివృత్తి వచ్చు నని చెప్పరా దనిన; కర్మంబునకును అజ్ఞానంబునకును విరోధము లేదు గనుక అజ్ఞానంబునకు నివృత్తి రానేరదు. వృద్ధినే కలుగఁజేయును.

ఇందుకు దృష్టాంతము:—

అమావాస్యచీఁకటి మేఘావర్ణము అంధకారము నిబిడంబుగా నెటులఁ జేయుచున్నదో, అటులనే కర్మం బజ్ఞానంబును వృద్ధిఁ బొందించును గాని నివృత్తి చేయనేరదు. అంధకారము తనకు విరోధంబగు సూర్యప్రకాశముచేత నెటుల నివృత్త మగుచున్నదో అటులనే అజ్ఞానంబునకు విరోధంబగు నద్వితీయ బ్రహ్మాత్మైక్యాపరోక్షజ్ఞానముచేతను అజ్ఞానమునకు నివృత్తి వచ్చును. మరి యొందుచేతను ఈ యజ్ఞానంబునకు నివృత్తి గానేరదు. జ్ఞానము ఎటువలె వచ్చుననఁగా; ఆత్మానాత్మవివేకమువలన వచ్చును. మఱి యొందునల్లను రానేరదు. కర్మోపాసనాది యోగములచేత వచ్చుచున్నదని చెప్పరా దనఁగా; చెప్పఁగూడదు. అది యెట్లనిన; జ్ఞానము వస్తుతంత్రంబు గాన పురుషతంత్రంబగు కర్మంబువలన నంతఃకరణశుద్ధి వచ్చును గాని జ్ఞానము రానేరదు. జ్ఞానము ప్రమాణజన్యంబు గావున మానసక్రియాత్మకంబగు ఉపాసనలవల్ల చిత్తైకాగ్ర్యము వచ్చునుగాని జ్ఞానము రానేరదు. యోగంబును మానసక్రియారూపకంబు గావున అణిమాద్యైశ్వర్యంబులను సంపాదించి జ్ఞానంబునకును జ్ఞానఫలం బగు కృతకృత్యాదులకును విఘ్న

మును గలుగఁజేయును గాన జ్ఞానమును బుట్టింపనేరదు. అయితే అజ్ఞాన మెటుల వచ్చుననిన; ఆత్మానాత్మవిచారముచేతనే రావలెను.

ఇందుకు దృష్టాంతము :—

గాయత్రీసాలగ్రామరత్నాదులయొక్క తత్త్వజ్ఞానము, వాని కుచితమైన పరీక్ష నిఘర్షణాదివిచారముచేత నెటులఁ బుట్టుచున్నదో, స్నానధ్యానప్రాణాయామాదులచేత నెటుల బుట్టదో అటులనే ఆత్మానాత్మవిచారముచేత ఆత్మతత్త్వజ్ఞానము పుట్టునుగాని కర్మోపాసనాదుల వలన నుదయింపనేరదు. కాఁబట్టి ముముక్షువులైనవారలు సర్వదా సర్వప్రయత్నములచేత ఆత్మానాత్మవిచారమే చేయవలయును. ఇటుల చేసిన సంసారబంధఁబువలన విడువఁబడి శీఘ్రంబున జీవన్ముక్తిసుఖం బును బొందుదు రని సిద్ధాంతము.

శ్లో. దుఃఖహేతుర్హి దేహస్స్యాద్దేహహేతుశ్చ కర్మ తత్,
కర్మహేతుశ్చ రాగాదిర్మనో రాగాదికారణమ్.
అవివేకాన్మనహేతు రజ్ఞానం తస్య కారణమ్,
జ్ఞానాన్న శ్యేత్తదజ్ఞానం జ్ఞానం తస్య విచారతః.
అజ్ఞానవృక్షమవివేకమహాంకురం యో
దేహాభిమానవిటపం బహురాగశాఖమ్,
కర్మప్రదీప్తబహుదేహకటాహమేతం
జ్ఞానాసినా ర్తిరసమేషు సుధీశ్ఛినత్తి.

ఇది షష్ఠవర్ణకము

---

# సప్తమవర్ణకము

## ఆత్మానాత్మవివేకప్రకరణము

శ్లో. ఆత్మానాత్మవివేకేన మునిర్ముచ్యేత బంధనాత్,
స ఆత్మా కీదృశః కోవా ఆత్మా వేత్త్వత్ర చింత్యతే.

ఆత్మానాత్మవివేకముచేతనే జ్ఞాన ముదయించు నని చెప్పఁబడెను గాన నాయాత్మానాత్మలను విచారింపుదము. ఆత్మ యనఁగా; శరీర

త్రయవిలక్షణుఁ డై, అవస్థాత్రయసాక్షియై, పంచకోశవ్యతిరిక్తుఁ డై, సచ్చిదానందస్వరూపు డై యుండునట్టివాఁడు. అనాత్మ యనఁగా; సమష్టి వ్యష్ట్యాత్మకమైన శరీరత్రయము. ఇందులకు లక్షణంబు లనృత జడదుఃఖంబులు. మహాజన మన సమష్టి, పురుషుం డన వ్యష్టి, వనమన సమష్టి, వృక్షం బన వ్యష్టి, ఇటులనే పదార్థంబులు కూడిన సమష్టియు, ఒక పదార్థము వ్యష్టి యనియును ఎటుల చెప్పఁబడుచున్నదో అటుల దార్ష్టాంతికమందును సమస్త ప్రాణులయొక్క శరీరంబులు సమష్టి ఒక్క ప్రాణిశరీరము వ్యష్టి. ఈశరీరము స్థూలము, సూక్ష్మము, కారణము అని మూఁడువిధంబులు. ఈశరీరత్రయములోపల సమస్తప్రాణులయొక్క స్థూలశరీరంబులును సమష్టిస్థూలశరీరంబనియు, సమస్తప్రాణులయొక్క సూక్ష్మశరీరంబులును సమష్టిసూక్ష్మశరీరంబనియు, సమస్తప్రాణులయొక్క కారణశరీరంబులును, సమష్టికారణశరీరంబనియు, ఒకప్రాణియొక్క స్థూలశరీరము వ్యష్టిస్థూలశరీరంబనియు, ఒకప్రాణియొక్క సూక్ష్మశరీరము వ్యష్టిసూక్ష్మశరీరమనియు, ఒకప్రాణియొక్క కారణశరీరము వ్యష్టికారణశరీరంబనియు, ఈప్రకారముగా సమష్టి వ్యష్టివివరణం బెఱుంగం దగినది. ఇటుల యెందుకుఁ జెప్పవలయు ననిన; ఆత్మకు జీవత్వంబును నీశ్వరత్వంబును వచ్చుటకొఱకై చెప్పవలెను. ఈశ్వరత్వ జీవత్వంబు లాత్మకికమీఁదనా రాఁబోవుచున్నవి యన; ఈశ్వరత్వంబును జీవత్వంబును ఉపాధిచేత ననాదిగా వచ్చియుండునవి. అయినప్పటికిని ఆత్మకు ఈశ్వరత్వంబును జీవత్వంబును ఉపాధిచేత వచ్చినవి యని యెవ్వరు నెఱుంగక వాస్తవంబులని తలంతురు. అందువలన దోషంబేమి యనిన; నెంతపర్యంతము వాస్తవమని తెలిసికొనుచున్నారో అంతపర్యంతంబును వారలకు సంసారబంధంబువలన నివృత్తి కలుగనేరదు. కాఁబట్టి సర్వప్రజామాతృభూతమైన శ్రుతి ఈశ్వరత్వ జీవత్వంబులు ఉపాధిచేత వచ్చుననుటకై సమష్టియనియును, వ్యష్టియనియును విభాగించి చెప్పుచున్నది. అయిన నేయుపాధిచేత నీశ్వరత్వము, ఏ యుపాధిచేత జీవత్వము వచ్చు ననిన; సమష్టి శరీరత్రయోపాధిచేత నీశ్వరత్వంబును, వ్యష్టి శరీరత్రయోపాధిచేత జీవత్వంబును వచ్చుచున్నది. ఈశ్వరత్వంబునందు సమష్టి కారణశరీరము మాత్రము చాలును. అయిన సమష్టి

స్థూలసూక్ష్మశరీరంబుల నెందుకు చెప్పవలె ననిన; ఉపాసనార్థమై చెప్పఁబడుచున్నది. అది యెట్లనిన; ముఖ్యాధికారియైనవానికి సమష్టి కారణశరీరోపాధికుఁడైన ఆత్మ యుపాస్యుఁడై చెప్పఁబడుచున్నాఁడు. ఇతనికి నీశ్వరుఁడనియు, నంతర్యామి యనియు, నవ్యాకృతుండనియు పేళ్లు. మఱియు నతనికి సమష్టి కారణశరీరంబునం దభిమానంబు గల దనిన; అభిమానం బహంకారధర్మం బగుటవలనను, ఆ యవస్థయం దహంకారంబు లేదు గావున అభిమానము కలదని చెప్పఁగూడదు. ఆత్మకు సమష్టికారణశరీరవిశిష్టమాత్రత్వమే యీశ్వరత్వమని చెప్ప వలెను. ఈ యీశ్వరుని నుపాసింప నోపనివారల కీ యీశ్వరుని కవస్థాంతరంబగు సమష్టిసూక్ష్మశరీరోపాధికు నుపాసింపవచ్చునని శ్రుతి చెప్పుచున్నది. ఈ సూక్ష్మశరీరోపాధికుఁడైన యీశ్వరునికి హిరణ్యగర్భుఁడనియు, సూత్రాత్మ యనియు, ప్రాణుఁడనియు పేళ్లు. ఇతనికి నీ సమష్టిసూక్ష్మశరీరంబునందు అభిమానము లేదనిన; అభిమానమునకు ఆశ్రయమైన స్థూలశరీరము లేదు గనుక అభిమానము కలదని చెప్పఁ గూడదు; సమష్టిసూక్ష్మశరీరవిశిష్టమాత్రత్వమే హిరణ్యగర్భత్వమని చెప్పవలెను. ఇతని నుపాసన చేయుటయందు సమర్థత లేనివారు ఈ యీశ్వరునకు వ్యవస్థాంతరంబైన సమష్టి స్థూలశరీరోపాధికు నుపాసింప వచ్చునని శ్రుతి చెప్పుచున్నది. ఇతనికి విరాట్టనియు, వైశ్వానరుఁ డనియు, వైరాజసుఁడనియు మూఁడు నామధేయములు. ఇతనికి సమష్టి స్థూలశరీరంబునందు అభిమానము లేదా? యనిన; నియతమైన శరీర మొకటి లేదు గనుక అభిమానము కలదని చెప్పఁగూడదు. మరి యెటుల ననిన; ఆ యీశ్వరునికి సమష్టి స్థూలశరీరమాత్రత్వ మీశ్వరత్వమని చెప్పవలెను. అంతర్యామియైన యీశ్వరుఁడే సాత్త్వికరాజసతామస గుణంబుల నవలంబించి సృష్టిస్థితిసంహారంబులకొఱకు బ్రహ్మదేవుఁడని యును, విష్ణువనియును, రుద్రుఁడనియును ఎప్పుడు చెప్పఁబడుచున్నాఁడో, దుష్టనిగ్రహశిష్టపరిపాలనకొఱకై రామకృష్ణాద్యవతారముల నెప్పు డెత్తుచున్నాఁడో అప్పుడు ఆ యంతర్యామియైన యీశ్వరునికి ఆయా శరీరంబులయందు సృష్టిస్థిత్యాద్యభిమానంబు కలదు. అభిమానము లేదని చెప్పెదమనిన; సృష్టిస్థితిసంహారాదులు కూడవు గనుక అభిమానము కలదని చెప్పవలెను. అయిన జీవునికి నీశ్వరునికి వైలక్షణ్యం బేమియనిన;

జీవునకు అహంతా మమతాపూర్వకంబుగా స్వశరీరాదులయందు అభిమానంబున్నది. ఇటువలె నీశ్వరునకు లేదు గనుక జీవునకును నీశ్వరునకును ఇటువలె వైలక్షణ్యంబు గలదు. ఈశ్వరునకు లోకసంరక్షణార్థమగు అభిమానము స్వాభావికంబుగ లేదు. ఈ యీశ్వరుండే ప్రతిమాదులయం దుపాస్యుండై చెప్పఁబడుచున్నాఁడు. ఇటుల నెందుకు చెప్పవలయు ననిన; విరాడుపాసనయందు నధికారులయినవారలకు త్రిమూర్తుల నుపాసింపవలయుననియు, ఆ త్రిమూర్త్యుపాసనయందు ననధికారులైనవారలకు రామకృష్ణాద్యవతారాదుల నుపాసింపవలయు ననియు, ఆయవతారములయొక్క ఉపాసనయందు ననధికారులైనవారలకు ఆయవతార సూచకములైన తామ్రాదిప్రతిమాదుల నుపాసింపవలయుననియు శాస్త్రములు చెప్పుచున్నవి. సర్వజనులు నేయేమూర్తుల నుపాసింపుచున్నారో ఆయామూర్తులద్వారా ఈశ్వరుం డంతర్యామియై యుపాసింపఁబడుచున్నాఁడు. ఈ మూర్త్యాదుల నుపాసింపుమని చెప్పు శాస్త్రములకు తాత్పర్య మేమన; క్రమక్రమముగా నంతర్యామిస్వరూపంబు నెఱుఁగవలయు. ఇటుల సమష్టిత్రయోపాధివలన ఈశ్వరత్వంబు వచ్చినది. జీవత్వం బెవ్విధంబున వచ్చె ననిన; వ్యష్టిశరీరత్రయోపాధి వలన వచ్చినది. జీవత్వంబునకు శరీరత్రయము కావలెను. అది యెట్టు లనఁగా; జీవుం డంతఃకరణప్రతిబింబుఁడు గావున జీవత్వంబునందు సూక్ష్మశరీరంబును గావలయును స్థూలశరీరము లేక కర్తృత్వముకూడదు గనుక ఈ రెంటికిని కారణంబగు కారణశరీరంబును గావలెను. ఈ ప్రకారముగా జీవత్వంబునందును శరీరత్రయంబును గావలెను. జీవునికీశరీరత్రయంబునందును అభిమానము కలదా? యనిన; అభిమానంబు కర్తృత్వము లేక కూడదు గనుక శరీరత్రయంబునందును అభిమానము కలదు. అయిన నీజీవులు ఎందఱన; ముగ్గురు. వారల నామధేయంబు లెవ్వి యనిన; జాగ్రదవస్థయందును, వ్యష్టిస్థూలశరీరంబునందును, అభిమానంబుగల జీవునికి విశ్వుఁడనియును, వ్యావహారికుఁడనియును, చిదాభాసుఁ డనియును మూఁడునామంబులు. స్వప్నావస్థయందును, వ్యష్టిసూక్ష్మశరీరంబునందును అభిమానముగల జీవునికి తైజసుఁడనియును, ప్రాతిభాసికుఁడనియును, స్వప్నకల్పితుఁడనియును మూఁడుపేళ్లు. సుషుప్త్యవస్థయందును వ్యష్టికారణశరీరమునందు అభి

మానముగల జీవునికి ప్రాజ్ఞుఁడనియును, పారమార్థికుఁడనియు, అవచ్ఛిన్నుఁడనియును మూఁడు నామధేయములు. ఈప్రకారముగా ఆత్మ సమష్టిశరీరత్రయముచేత నీశ్వరత్వమును వ్యష్టిశరీరత్రయముచేత జీవత్వమును వచ్చెను. ఒక యాత్మకే రెండైన ఈశ్వరత్వజీవత్వము లెటుల కూడుననఁ దృష్టాంతము :—

ఒక దేవదత్తునికి పుత్రు నపేక్షించి పితృత్వంబును, పౌత్రు నపేక్షించి పితామహత్వంబును వచ్చినట్లు ఒకటైన యాత్మకు వ్యష్ట్యుపాధి నపేక్షించి జీవత్వమును సమష్ట్యుపాధి నపేక్షించి ఈశ్వరత్వంబును వచ్చెను. అయితే పితృపితామహత్వధర్మంబులతోఁ గూడుకొనియుండెడి దేవదత్తునియందు కించిద్జ్ఞత్వసర్వజ్ఞత్వాదులు కానము. జీవేశ్వరత్వాదిధర్మములతోఁ గూడుకొనియుండెడి యాత్మయందు కించిద్జ్ఞత్వసర్వజ్ఞత్వములు కానఁబడుచున్నవే. ఈదేవదత్తదృష్టాంతం బెటువలె కూడుననిన; ఒకఁడైన ఆత్మకు ఉపాధిద్వయమువలన నీశ్వరత్వజీవత్వంబులు రావచ్చుననుటకు ఈదేవదత్తదృష్టాంతంబుఁ జెప్పితిమి. ఇఁకను యాత్మకు మహదుపాధిచేతను, సర్వజ్ఞత్వంబును కించిదుపాధిచేతను కించిద్జ్ఞత్వంబును రావచ్చుననుటకు దృష్టాంతము చెప్పెదము. ఏకంబగు జలంబునకు చెరువనియెడి మహదుపాధిచేతను, అనేక కేదారంబులను పండించెడి శక్తిత్వంబును, సమస్తప్రాణులకును స్నానపానాదిక్రియలను చేయించెడి శక్తిత్వంబును, ఘటంబను నల్పోపాధిచేతను, పానపాకాది క్రియల నొనర్చునంతటి శక్తిత్వంబును నెటుల వచ్చుచున్నవో అగ్నికి గొప్పవత్తి యనెడి యుపాధిచేతను, దూరంబున నుండెడి పదార్థములను తోఁపింపఁజేసెడి శక్తిత్వంబును, చిన్నవత్తి యనెడి యుపాధిచేతను, సమీపంబునందుండెడి పదార్థములను మాత్రమే తోఁపింపఁజేసెడి శక్తిత్వంబును నెటువలెనున్నదో ఆటువలెనే ఒకఁడయిన ఆత్మకు మహత్తైన సమష్టిశరీరోపాధిచేతను, సర్వజ్ఞత్వాదులును వ్యష్టిశరీరోపాధిచేతను కించిద్జ్ఞత్వాదులును రావచ్చును. ఈప్రకారముగ నీశ్వరత్వజీవత్వంబులు యాత్మకు ఉపాధిచేతను వచ్చినవో లేక పరమార్థమునందు వచ్చినవో అనిన; పరమార్థమందు జీవేశ్వరులకు భేదంబు లేదని శ్రుతులు చెప్పుచున్నవి. విరుద్ధధర్మములతోఁ గూడుకొనియుండెడి జీవేశ్వరుల కభేదము కూడును, అది యెటులనన; పూర్వోక్తదృష్టాంతమందు

విరుద్ధధర్మములతోఁ గూడుకొని యుండెడి చెరు వనే యుపాధియుక్త జలంబునకును ఘటమనే యుపాధియుక్తజలంబునకు విరుద్ధాంశంబు లయిన చెరువు ఘట మనెడి యుపాధులనువిడిచి అవిరుద్ధాంశంబగు జలత్వముచేతను ఏకత్వజ్ఞానం బెటుల వచ్చునో విరుద్ధధర్మసహితంబగు పెద్దవత్తి యనెడి ఉపాధి కాగ్నికిని చిన్నవత్తియనెడి ఉపాధి కాగ్నికిని విరుద్ధాంశము లయిన పెద్దచిన్న వత్తియనెడి యుపాధులను విడిచి అవిరుద్ధమయిన అగ్నిమాత్రముచేతను నేకత్వజ్ఞాన మెటుల వచ్చునో అటులనే విరుద్ధధర్మంబులగు సర్వజ్ఞత్వాదులతోఁ గూడుకొనిన యీశ్వరునికిని, యీవిరుద్ధధర్మము లైన కించిద్జ్ఞత్వాదిధర్మంబులతోఁ గూడుకొనిన జీవునికిని విరుద్ధాంశములైన సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాదులను విడిచి అవిరుద్ధమయిన చైతన్యమాత్రంబునకు నేకత్వజ్ఞానము గూడును. ఈయర్థమే సకలశాస్త్రంబులయందును 'సోఽయం దేవదత్తః' అనియెడి దృష్టాంతపూర్వకంబుగా మహావాక్యంబునకు అర్థమని జహదజహల్లక్షణముచేతను చెప్పబడుచున్నది. కాబట్టి ఈప్రకారముగా విచారించి యెవఁడు తాను బ్రహ్మస్వరూప మని యెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁ డని సిద్ధాంతము.

శ్లో. సమష్టివ్యష్టిరూపాయ సృతిజాడ్యాదిలక్షణామ్,
జీవేశయోరుపాధిశ్చ నాత్మా సమ్యగ్వివేచితః.
సమష్టివ్యష్ట్యుపాధిభ్యాం జీవ ఈశ్వర ఇత్యపి,
భిన్నవద్భాతి యోఽస్సోఽయమాత్మా భిన్నశ్చ వస్తుతః.
మయి జీవత్వమీశత్వం కల్పితం వస్తుతో న హి,
ఇతి యస్తు విజానాతి స ముక్తో నాత్ర సంశయః.

ఇది సప్తమవర్ణకము.

# అష్టమవర్ణకము

## శరీరత్రయవిలక్షణప్రకరణము

శ్లో. స్థూలం సూక్ష్మం కారణం వా శరీరం కిం తవాత్మనః,
విలక్షణత్వ మేతేభ్యః కిం వేత్యేత ద్విచింత్యతే.

ఆత్మ శరీరత్రయవిలక్షణుం డని చెప్పఁబడెను. శరీరత్రయము నెఱుఁగక శరీరత్రయవిలక్షణత్వము నెఱుఁగఁగూడదు. కనుక శరీరత్రయస్వరూప మేదని విచారింపుదము. శరీరత్రయ మనఁగా; శరీరము స్థూలము, సూక్ష్మము, కారణము అని మూఁడువిధంబులు. స్థూలశరీర మనఁగా; కరచరణాద్యవయవాకారమైన స్తంభమువలెఁ దోఁచునట్టిది. సూక్ష్మశరీరమనఁగా; పదునేడవయవములతోఁ గూడుకొనియుండునట్టిది. కారణశరీరమనగా; అజ్ఞానము. వీటికి శరీరములని పేరు.

ఈ పేరు ఎందుకు వచ్చిన దనిన; జీర్ణించిపోవుటచేత శరీర మని పేరు వచ్చినది. అయితే యీ శరీరములు జీర్ణించిపోవుచున్నవా యనిన జీర్ణించి పోవుచున్నవి. అది యెటు లనిన; ఈ స్థూలశరీరము మూఁడు విధములుగా జీర్ణించిపోవుచున్నది, ఆ మూఁడువిధము లెయ్యవియనిన; అన్నములేకను, అన్నము కలిగినయెడల వ్యాధులచేతను, అన్నముగలిగి వ్యాధిరహితముగా నుండెనేని ముదిమిచేతను జీర్ణించిపోవుచున్నది. సూక్ష్మశరీరమునకు జీర్ణత్వ మెటు లనిన; వృద్ధిపూర్వకంబుగాఁ జెప్పఁబడును. వృద్ధి యనఁగా; రాగద్వేషాద్యాకారంబుగాఁ బరిణమించుట. వానియొక్క సంకోచము జీర్ణత్వము సూక్ష్మకారణశరీరములకు వృద్ధి సంకోచంబు లెవరియందు కానఁబడుచున్నవనిన; అజ్ఞానంబునందు వృద్ధియు, ముముక్షుత్వంబునందు సంకోచంబును గానఁబడుచున్నవి. కాఁబట్టి వీనికి శరీర మని పేరు వచ్చినది.

దేహములని పేరు ఎందుకు వచ్చిన దనిన; దహింపఁబడుచున్నవి కావున దేహములు. ఈ దేహములు దహింపఁబడుచున్నవా అనిన; దహింపఁబడుచున్నవి. అగ్నిచేత భస్మాకారములుగా దహింపఁబడు నవి కొన్ని శరీరములే కదా! అన్నిశరీరంబులును దహింపఁబడుచున్న వని

యెటుల చెప్పవచ్చు. స్థూలశరీరము సర్వదా తాపత్రయముల చేత దహింపబడుచున్నది. సూక్ష్మకారణశరీరంబులకు దహ్యమానత్వ మెటు వలెననిన; జ్ఞానాగ్ని చేత దహింపఁబడుచున్నవి గనుక ఈ శరీరత్రయంబునకును దేహము లని పేరు వచ్చినది.

పూర్వశరీరంబునకు స్థూలమని పేరు ఎందుకు వచ్చిన దనిన; స్తంభమువలెనే ప్రత్యక్షముగఁ దోఁచుచున్నది గనుక దానికి స్థూల శరీరమని పేరు వచ్చినది. మధ్యశరీరమునకు సూక్ష్మశరీరమని పేరు ఎందుకు వచ్చెను? పూర్వశరీరమువలె స్థూలముగా కనుపడ లేదు గనుక దీనికి సూక్ష్మశరీరమని పేరు వచ్చెను. దీనికే లింగశరీరమని పేరు ఎందుకు వచ్చిన దనిన; లీనమయిన శబ్దాది విషయముల నంగీకరింపు చున్నది గనుక, ఆత్మను నిర్లక్షణముచేత తెలియపఱచుచున్నది గాన లింగశరీరమని పేరు వచ్చినది. పశ్చిమశరీరమునకు కారణశరీరమని పేరు ఎందుకు వచ్చిన దనిన; ఈ రెండు శరీరములను బుట్టించుచున్నది గనుక కారణశరీరమని పేరు వచ్చినది.

స్థూలశరీరము ప్రత్యక్షంబుగాఁ గనుపడుచున్నది గావున స్థూల శరీరము కల దని చెప్పవచ్చును. స్థూలశరీరమువలె సూక్ష్మశరీరము ప్రత్యక్షంబుగాఁ గనుపడలేదే. స్థూలశరీరవ్యతిరిక్తమయిన సూక్ష్మశరీరము గలదని యెటుల నెఱుంగవచ్చు? పదునేడువిధంబులగు కార్యంబులవలన సూక్ష్మశరీరంబు గలదని యెఱుంగవచ్చును. ఈపదునేడువిధంబులగు కార్యంబులును స్థూలశరీరంబుచేతఁ జేయఁబడుచున్నవి. సుషుప్తి మూర్ఛావస్థలయం దుండెడి శరీరంబుచేత పదునేడువిధంబులగు కార్యంబులునుం జేయఁబడవలయును. అటులను జేయఁబడ లేదు. కాన స్థూలశరీరముయొక్క కార్యము లని చెప్పఁగూడదు. మరి దేని యొక్క కార్యములని చెప్పవలయును. స్థూలశరీరవ్యతిరిక్తమయిన సూక్ష్మ శరీరముయొక్క కార్యము లేయని చెప్పవలయును. సూక్ష్మశరీరము స్థూలశరీరమును విడిచి స్వతంత్రంబుగా నొక కార్యంబును జేయు లేదు గాన సూక్ష్మశరీరముయొక్క కార్యములని యెటుల నెఱిఁగెడి దనిన; ఎఱుంగవచ్చును. అగ్నిహోత్రము కాష్ఠాదుల నాశ్రయించి దహనపాకాదిక్రియలను చేసినప్పటికిని ఆ దహనపాకాదిక్రియలు కాష్ఠాదుల

యొక్క క్రియలు గాక కాష్ఠవ్యతిరిక్తమైయున్న అగ్నియొక్క క్రియ లెటువలె నగుచున్నవో, అటువలెనే సూక్ష్మశరీరము, స్థూలశరీరము నాశ్రయించి పదునేడువిధములైన కార్యములను జేసినప్పటికిని కేవల స్థూలశరీరముయొక్క కార్యములు కావు స్థూలశరీరవ్యతిరిక్తమైన సూక్ష్మశరీరముయొక్క కార్యములని యెఱుంగవచ్చును ఈ పదునేడు విధములైన కార్యంబు లేవి యన; కారణనిరూపణపూర్వకంబుగా నిరూపింపుచున్నారము.

దీనికి కారణం బేమన; సప్తదశావయవాత్మకమైన సూక్ష్మశరీరము. ఆ సప్తదశావయవంబులు నెయ్యవి యనిన, జ్ఞానేంద్రియపంచకంబును, కర్మేంద్రియపంచకంబును, ప్రాణాదిపంచకంబును, చిత్తంబుతోడంగూడిన మనంబును, అహంకారంబుతోఁగూడిన బుద్ధియును, ఈ పదునేడునుంగూడి సూక్ష్మశరీరంబని చెప్పంబడును. జ్ఞానేంద్రియపంచక మనఁగా; శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులు. వీనికి జ్ఞానేంద్రియంబులని పేరు ఎటుల వచ్చె? శబ్దాదివిషయజ్ఞానాదులను బుట్టింపుచున్నవి. కనుక వీనికి జ్ఞానేంద్రియంబులని పేరు. ఇవి జ్ఞానజనకంబు లెందువలన నయ్యె? సత్త్వగుణమునవలనఁ బుట్టినవగుటచేత జ్ఞానజనకంబు లాయెను. కర్మేంద్రియంబు లనఁగా; వాక్పాణిపాదపాయూపస్థలు. వీనికి కర్మేంద్రియంబులను నామధేయం బెందువలన వచ్చె? వచనాదిక్రియలను బుట్టించుచున్నవి. కనుక కర్మేంద్రియంబు లని పేరు ఇవి క్రియాజనకంబు లెటులయ్యె? రజోగుణంబువలనఁ బుట్టిన వగుటంజేసి క్రియాజనకంబు లాయెను. ప్రాణాదిపంచకం బనఁగా; ప్రాణాపానవ్యానోదానసమానములు. వీనికి ప్రాణంబులని పేరు ఎందుకు వచ్చె నన; స్థూలశరీరంబును జీవింపఁజేయుచున్నవి గావున వీనికి ప్రాణము లని పేరు. మనోబుద్ధు లనఁగా; అంతఃకరణవృత్తివిశేషములు.

## జ్ఞానేంద్రియవిచారము

౧ శ్రోత్రేంద్రియ మనఁగా; శబ్దంబులెల్ల దేనిచేత గ్రహింపఁబడుచున్నవో అది శ్రోత్రేంద్రియము. ఆ శబ్దంబు లెన్నివిధంబు లనిన; లౌకికమనియు, వైదికమనియు రెండువిధంబులు. ఇందు లౌకికంబె ట్లది యనిన; ప్రాకృతరూపంబులైన అష్టాదశభాషలును లౌకికము. వైదికం

చెయ్యది యనిన; సంస్కృతరూపంబులగు వేదశాస్త్రాదులు వైదికము. లౌకికం బెన్నివిధంబు లనిన; అనంతవిధంబులు. వైదికం బెన్నివిధంబు లనిన; అదియు ననంతవిధంబులు. ఇన్నిశబ్దంబులును దేనిచేతఁ గ్రహింపఁ బడుచున్నవో అది శ్రోత్రేంద్రియము. ఈ శ్రోత్రేంద్రియంబు కర్ణ శష్కుల్యవచ్ఛిన్ననభోదేశంబు నాశ్రయించుకొని యున్నది. ఆ నభో దేశమే శ్రోత్రేంద్రియ మని చెప్పవలెననిన; మృతమూర్ఛితశరీరం బులయం దుండెడి నభోదేశముచేత శబ్దంబు లన్నియును గ్రహింపఁ బడవలయును. అటుల గ్రహింపఁబడ లేదు గాన నానభోదేశవ్యతిరిక్తమై శబ్దగ్రహణశక్తిమత్తై సూక్ష్మమై యొకవస్తువానభోదేశంబు నాశ్ర యించుకొనియున్నది. దానికి శ్రోత్రేంద్రియమని పేరు. దాని కధిష్ఠాన దేవత దిక్కు. ఆ యధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపఁబడిన శ్రోత్రేంద్రి యము శబ్దంబులనెల్ల గ్రహించుచుండును.

2. త్వగింద్రియం బనఁగా, స్పర్శంబు లన్నియు దేనిచేత గ్రహింపఁబడుచున్నవో, అది త్వగింద్రియము. ఆస్పర్శంబు లెన్నివిధము లనిన; శీతమనియు, ఉష్ణమనియు, శీతోష్ణమనియు, మృదువనియు, కఠిన మనియు అయిదువిధంబులు. అందులో నొక్కొకటి యనంతవిధంబులు. ఈ స్పర్శంబులన్నియు దేనిచేత గ్రహింప బడుచున్నవో అది త్వగింద్రి యము. ఈత్వగింద్రియము త్వక్కును సర్వత్ర వ్యాపించుకొనియున్నది. అదే త్వగింద్రియమని చెప్పవలెననిన; మృతమూర్ఛితశరీరంబులయం దుండెడి త్వక్కుచేతను, స్పర్శంబు లన్నియును గ్రహింపఁబడవలయును. అటుల గ్రహింపఁబడలేదు గనుక ఆత్వగ్వ్యతిరిక్తమయి స్పర్శగ్రహణ శక్తిమత్తై సూక్ష్మమయి యొకవస్తు వాత్వక్కు నాశ్రయించుకొని యున్నది. దాని కధిష్ఠానదేవత వాయువు. ఆ యధిష్ఠాన దేవతచేత ప్రేరే పింపఁబడిన త్వగింద్రియము స్పర్శంబులనన్నింటిని గ్రహించుచుండును.

3. చక్షురింద్రియ మనఁగా; సమస్తరూపంబులును దేనిచేత గ్రహింపఁబడుచున్నవో, అది చక్షురింద్రియము. ఆ రూపంబు లెన్ని విధంబు లనిన; తెలుపు, నలుపు, ఎఱుపు, పచ్చ, ఆకుపసుపు, శబలము, హ్రస్వము, దీర్ఘము, స్థూలము, సూక్ష్మము అని పదివిధములు అందులో నొకటొకటి యనేకవిధములు. ఇన్నిరూపంబులును దేనిచేత గ్రహింపఁ

బడుచున్నవో అది చక్షురింద్రియము. ఈ చక్షురింద్రియము కంటి నల్ల గ్రుడ్డు నాశ్రయించుకొని యున్నది. నల్లగ్రుడ్డే చక్షురింద్రియ మని చెప్పరాద మనిన; సుషుప్తమూర్ఛితశరీరంబులయందుండు నల్లగ్రుడ్డు చేత రూపంబులు గ్రహింపఁబడవలయును. అటుల గ్రహింపఁబడ లేదు గాన నల్లగ్రుడ్డునకు వేఱై రూపగ్రహణశక్తిమత్తై సూక్ష్మమై యొక వస్తు వానల్లగ్రుడ్డు నాశ్రయించుకొని యున్నది. దానికి చక్షురింద్రియ మని పేరు. సూర్యుం డధిష్ఠానదేవత. ఆ యధిష్ఠాన దేవతచేత ప్రేరే పింపఁబడిన చక్షురింద్రియము రూపంబులనన్నిఁటిని గ్రహించుచున్నది.

౪. రసనేంద్రియ మనగా రసంబులన్నియు దేనిచే గ్రహింపఁ బడుచున్నదో, అది రసనేంద్రియము. ఆరసంబు లెన్నివిధంబు లనిన; ఉప్పు, పులుసు, కారము, తీపు, వగరు, చేదు అని ఆఱువిధంబులు. వీనిలో నొక్కటొక్కటి యనేకవిధంబులు ఈరసంబులన్నియు దేనిచే గ్రహింపఁబడుచున్నవో అది రసనేంద్రియము. ఇది కొననాలుక నాశ్ర యించుకొనియున్నది. ఆకొననాలుకే రసనేంద్రియమని చెప్పరా దనిన; సుషుప్తమూర్ఛితశరీరంబులయం దుండెడి నాలుకచే రసంబు లన్ని యును గ్రహింపఁబడవలయును, అటుల గ్రహింపఁబడ లేదు గాన నా కొననాలుకకు వ్యతిరిక్తమై రసగ్రహణశక్తిమత్తై సూక్ష్మమై యొక వస్తు వాకొననాలుక నాశ్రయించుకొనియున్నది. దానికి రసనేంద్రియ మని పేరు వరుణుం డధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపఁ బడిన రసనేంద్రియము రసంబుల నన్నిఁటిని గ్రహించుచుండును.

౫. ఘ్రాణేంద్రియ మనఁగా; గంధము లన్నియు దేనిచే గ్రహింపఁబడుచున్నవో అది ఘ్రాణేంద్రియము. ఆగంధము లెన్నివిధము లనిన; సుగంధము, దుర్గంధము, మిశ్రగంధము అని మూఁడువిధములు. అందులో నొకటి యనేకవిధంబులు. ఇన్ని గంధములును దేనివలన గ్రహింపఁబడుచున్నవో అది ఘ్రాణేంద్రియము. ఈఘ్రాణేంద్రియము నాసికాగ్రము నాశ్రయించుకొని యున్నది. ఆ నాసికాగ్రమే ఘ్రాణేం ద్రియమని చెప్పరాదమనిన; సుషుప్తమూర్ఛితశరీరంబులయందుండెడి నాసికాగ్రముచేత గంధములన్నియు గ్రహింపఁబడవలయును. అటుల గ్రహింపఁబడ లేదు. కాన నాసికాగ్రవ్యతిరిక్తమై గంధగ్రహణశక్తిమత్తై

సూక్ష్మమై యొకవస్తు వానాసికాగ్రంబు నాశ్రయించుకొని యున్నది. దానికి ఘ్రాణేంద్రియ మని పేరు. దాని కధిష్ఠానదేవత లశ్వినీదేవతలు. ఆ యధిష్ఠానదేవతలచేత ప్రేరేపింపఁబడిన ఘ్రాణేంద్రియము చేత గంధములన్నియు గ్రహింపఁబడుచున్నవి.

## కర్మేంద్రియవిచారము

౧. వాగింద్రియమనఁగా; శబ్దములన్నియు దేనిచేత నుచ్చరింపఁబడుచున్నవో అది వాగింద్రియము. ఆ వాగింద్రియ మెక్కడ నున్నదనిన; ఎనిమిదిస్థానముల నాశ్రయించుకొని యున్నది. ఆ యెనిమిది చోటులు నెయ్యవి యనిన; రసనయు, తాలుమూలంబులును, ఉత్తరోష్ఠ అధరోష్ఠంబులును, కంఠహృదయంబులును, బ్రహ్మరంధ్రంబును అను నీ యెనిమిదిస్థానంబుల నాశ్రయించుకొని యుండును. ఈ యష్టస్థానములే వాగింద్రియ మని చెప్పెద మనిన; సుప్తమృతమూర్ఛితశరీరంబులయం దుండునట్టి యెనిమిదిచోటులచేతను శబ్దంబు లుచ్చరింపబడవలయును. అటుల నుచ్చరింపఁబడలేదు గనుక ఆ యష్టస్థాన వ్యతిరిక్తమై వచనగ్రహణశక్తిమత్తై సూక్ష్మమై యొకవస్తు వా యెనిమిదిచోటుల నాశ్రయించుకొనియున్నది. దానికి వాగింద్రియమని పేరు. దాని కధిష్ఠానదేవత *చతుర్ముఖుఁడు. ఆ యధిష్ఠానదేవతచేత ప్రేరేపింపఁబడిన వాగింద్రియము శబ్దముల నన్నిఁటి నుచ్చరించుచుండును.

౨. పాణీంద్రియ మనఁగా, హానోపాదానాదిక్రియలు దేనిచేతఁ జేయఁబడుచున్నవో అది పాణీంద్రియము. పాణీంద్రియ మెచ్చట నున్నదనిన; అరచేతి నాశ్రయించుకొని యున్నది. అరచెయ్యే పాణీంద్రియ మని చెప్పెదమనిన; సుప్తమృతమూర్ఛితశరీరంబులయం దుండెడి అరచేతిచేత హానోపాదానాదిక్రియలు చేయఁబడవలెను. అటుల చేయఁబడలేదు. కాఁబట్టి అరచేతికంటె వ్యతిరిక్తమై హానోపాదానాదిక్రియాశక్తిమత్తై సూక్ష్మమై యొకవస్తు వా యరచేతి నాశ్రయించుకొని యున్నది. దానికి పాణీంద్రియ మని పేరు. దీనికి ఇంద్రుం డధిష్ఠానదేవత. ఆ యధిష్ఠానదేవతచేతఁ బ్రేరేపింపఁబడిన పాణీంద్రియము హానోపాదానాదిక్రియలను జేయుచుండును.

---

* 'అగ్ని' యని శ్రీశంకరాచార్యులు.

3. పాదేంద్రియమనఁగా; గమనాదిక్రియలు దేనిచేతఁ జేయఁబడుచున్నవో, అది పాదేంద్రియము. అది అరకాలి నాశ్రయించి యున్నది. ఆ యరకాలే పాదేంద్రియమని చెప్పుదమనిన; సుప్తమృతమూర్ఛితశరీరంబులయందుండు నరకాలిచేత గమనాగమనాదిక్రియలు సేయఁబడవలెను. అటుల చేయఁబడలేదు గాన ఆ యరకాలికంటె వ్యతిరిక్తమై గమనాదిక్రియాశక్తిమంతమై సూక్ష్మమై యొకవస్తువా యరకాలి నాశ్రయించుకొనియున్నది. దానికి పాదేంద్రియమని పేరు. దీని కధిష్ఠానదేవత *యుపేంద్రుఁడు. ఆ యధిష్ఠానదేవతచేతఁ బ్రేరేపింపఁబడిన పాదేంద్రియము గమనాగమనాదిక్రియలను జేయుచుండును.

4. పాయ్వింద్రియమనఁగా; పురీషవిసర్జనము మొదలైనక్రియలు దేనిచేతఁ జేయఁబడునో అది పాయ్వింద్రియము. అది గుదము నాశ్రయించుకొనియున్నది. ఆ గుదమే పాయ్వింద్రియ మని చెప్పుదమనిన; సుప్తమృతమూర్ఛితశరీరంబులయందుండెడి గుదముచేత పురీషవిసర్జనము మొదలైన క్రియలు సేయఁబడవలెను. అటుల చేయఁబడలేదు గాన ఆ గుదవ్యతిరిక్తమై పురీషవిసర్జనాదిక్రియాశక్తిమంతమై సూక్ష్మమై యొకవస్తువా గుదము నాశ్రయించుకొని యున్నది. దానికి పాయ్వింద్రియ మని పేరు. దీనికి మృత్యు వధిష్ఠానదేవత. ఆ యధిష్ఠానదేవతచేతఁ బ్రేరేపింపఁబడిన పాయ్వింద్రియము పురీషవిసర్జనము మొదలైన క్రియలను జేయుచుండును.

5. ఉపస్థేంద్రియమనఁగా; శుక్లమూత్రములు విసర్జనముసేయుట మొదలైన క్రియలు దేనిచేతఁ జేయఁబడుచున్నవో, అది యుపస్థేంద్రియము. అది యోనిలింగముల నాశ్రయించుకొని యున్నది. ఆ యోనిలింగములే ఉపస్థేంద్రియ మని చెప్పుద మనిన; సుప్తమృతమూర్ఛితశరీరంబులయం దుండెడి యోనిలింగములచేత శుక్లమూత్రవిసర్జనము సేయుట మొదలైనక్రియలు చేయఁబడవలెను. అటుల చేయఁబడలేదు గనుక శుక్లమూత్రవిసర్జనాదిక్రియాశక్తిమంతమై సూక్ష్మమై యొకవస్తువా యోనిలింగముల నాశ్రయించుకొని యున్నది. దానికి ఉపస్థేంద్రియమని పేరు. ప్రజాపతి యధిష్ఠానదేవత ఆ యధిష్ఠానదేవ

* విష్ణువు.

తచేఁ బ్రేరేపింపఁబడిన ఉపస్థేంద్రియము శుక్లమూత్రవిసర్జనము మొదలైన క్రియలను చేయుచుండును.

## పంచవాయువులలక్షణము

ప్రాణవాయు వనఁగా; ఉచ్ఛ్వాసము దేనిచేతఁ జేయఁబడుచున్నదో, అది ప్రాణవాయువు. దానికి స్థానము హృదయము. విశిష్టకుఁ డధిష్ఠానదేవత. ఆ యధిష్ఠానదేవతచేతఁ బ్రేరేపింపఁబడిన ప్రాణవాయువు ఉచ్ఛ్వాసమును జేయుచుండును.

అపానవాయు వనఁగా; నిశ్శ్వాసము దేనిచేతఁ జేయఁబడుచున్నదో, అది అపానవాయువు. దానికి స్థానము గుదము. విశ్వకర్త యధిష్ఠానదేవత. ఆ యధిష్ఠానదేవతచేతఁ బ్రేరేపింపఁబడిన యపానవాయువు నిశ్శ్వాసమును చేయుచుండును.

వ్యానవాయు వనఁగా; శరీరము నుద్ధరించుకొని యింద్రియాదులకు బల మిచ్చుచు నేది యున్నదో, అది వ్యానవాయువు. స్థానము శరీరమాద్యంతము. విశ్వయోని యధిష్ఠానదేవత. ఆ యధిష్ఠానదేవతచేత ప్రేరేపింపఁబడిన వ్యానవాయువు ఇంద్రియాదులకు బలము నిచ్చుచు శరీరము నుద్ధరించుచుండును.

ఉదానవాయు వనఁగా; సుషుప్త్యవస్థయందు సకలేంద్రియముల నుపసంహరించుకొని తనకు కారణమైన అజ్ఞానమునందు లయించుచు జాగ్రదవస్థయందు ఆయా యింద్రియముల నాయా గోళకములయందు జరుపుచు ఉత్క్రమణకాలమునందు సకలేంద్రియములను గ్రహించుకొని లోకాంతరమునకుఁ బోవునది ఉదానవాయువు స్థానము కంఠము. అజుం డధిష్ఠానదేవత ఆ యధిష్ఠానదేవతచేతఁ బ్రేరేపింపఁబడిన యుదానవాయువు పైఁజెప్పిన వ్యాపారములనెల్లఁ జేయుచుండును.

సమానవాయు వనఁగా; భక్ష్య భోజ్య లేహ్య చోష్యము లనియెడి నాలుగువిధములైన యాహారములను జఠరాగ్నితోఁ గూడుకొని పచనముచేసి శరీరంబునకు పుష్టిని నేది సేయుచున్నదో అది సమానవాయువు స్థానము నాభిప్రదేశము. జయుఁ డధిష్ఠానదేవత, ఆ యధిష్ఠానదేవతచేత ప్రేరేపింపఁబడిన సమానవాయువు అగ్నితోఁగూడుకొని

భక్ష్యభోజ్యాదులను పచనము చేసి శరీరమునకు పుష్టి సేయుచుండును. ఈ వాయువులును వీనికి చెప్పఁబడిన స్థానములును ఉనికియును కల దనుటకు సమ్మతివచనము:— శ్లో. "ప్రాణోఽపాన సమానశ్చో దాన వ్యానౌ చ వాయవః, హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభి సంస్థితః, ఉదానః కంఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః." అని యమర నిఘంటువునందు చెప్పియున్నది.

అయితే; శ్రుతులయందు దశవాయువులు చెప్పఁబడియుండఁగా పంచవాయువు లని యెటుల చెప్పవచ్చు ననిన, ఆ వాయువులు ఈ పంచవాయువులలో నంతర్భూతములు గనుక పంచవాయువు లని చెప్ప వచ్చును. అయినప్పటికిని ఆ వాయువులను వివరించుచున్నారము. అవి యెవ్వి యనిన; నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అని యైదు ఉపవాయువులు. వీనియొక్క వ్యాపారము లెవ్వి యనిన; నాగవాయువు వాంతి చేయించును. కూర్మవాయువు పెదవులను కంటిఱెప్పలను మూయుటకును, తెఱచుటకును కారణమై యుండును. కృకరవాయువు తుమ్మునటుల చేయును. దేవదత్తవాయువు ఆవులించునటుల చేయును. ధనంజయవాయువు శరీరమును పోషింపఁ జేయును. ఆ యుపవాయువు లైదును పంచవాయువులలో నంతర్భూత ములు గాన నా పంచవాయువులయొక్క స్థానములు, నధిష్ఠానదేవత లును వీనికి స్థానదేవతలు.

## అంతఃకరణచతుష్టయవివరణము

మనస్సనఁగా; సంకల్పవికల్పములు దేనిచేతఁ జేయఁబడుచున్న వో, అది మనస్సని చెప్పఁబడును. దానికి స్థానము గళాంతము. చంద్రుఁ డధిదేవత. ఆ యధిష్ఠానదేవతచేత ప్రేరేపింపఁబడిన మనస్సు సంకల్ప వికల్పములను చేయుచుండును.

బుద్ధియనఁగా; నిశ్చయము దేనిచేతఁ జేయఁబడుచున్నవో, అది బుద్ధి. దానికి స్థానంబు ముఖంబు. *చతుర్ముఖుం డధిష్ఠానదేవత. అయధి ష్ఠానదేవతచేత ప్రేరేపింపఁబడినబుద్ధి నిశ్చయమును చేయుచుండును.

* 'బృహస్పతి' యని శ్రీశంకరాచార్యులు.

అహంకార మనఁగా; అభిమానంబు దేనివలన కలుగుచున్నదో, అది అహంకారము. స్థానంబు హృదయంబు. రుద్రుం డధిష్ఠాన దేవత. ఆ యధిష్ఠాన దేవత చేత ప్రేరేపింపఁబడిన యహంకారం బభిమానమును జేయుచుండును.

చిత్తమనఁగా; ధారణ దేనిచేతఁ జేయఁబడుచున్నదో, అది చిత్తము. దానికి స్థానంబు నాభి. క్షేత్రజ్ఞుం డయిన జీవుం డధిష్ఠాన దేవత. ఆ యధిష్ఠాన దేవతచేతఁ బ్రేరేపింపఁబడిన చిత్తము ధారణమును చేయుచుండును.

ఈ లింగశరీరము షోడశాత్మక మని యొకశ్రుతి చెప్పుచున్నది. ఆ పక్షంబునం దంతఃకరణముమాత్రమే చెప్పఁబడుచున్నది. సప్తదశ లింగమని యొకశ్రుతి చెప్పుచున్నది. ఆపక్షంబునందు మనస్సు, చిత్తము ఒకటి యనియు, బుద్ధియు నహంకారంబు నొకటి యనియును చెప్పఁ బడుచున్నది. నవదశలింగ మని యొకశ్రుతి చెప్పుచున్నది. ఆ పక్షం బున మనోబుద్ధిచిత్తాహంకారంబులు నాలు గని చెప్పవలెను. ఎటులఁ జెప్పినను విరోధము లేదు. ఈ చెప్పఁబడిన పదునేడువిధములయిన కార్యములచేతను సప్తదశావయవమయిన లింగశరీరము కలదని నిశ్చ యింపఁబడెను.

కారణశరీరము కల దని యెటువలె నెఱుంగుట యనిన; స్థూల శరీరంబులు సూక్ష్మకార్యములయి కానఁబడుచున్నవి గనుక, వీని కొక కారణము కలదని యూహింపఁబడుచున్నది. కార్యములచేత కారణం బూహింపఁబడును. అది యెట్లనిన; కార్యమైన ధూమముచేత కారణం బగు నగ్ని యెటుల నూహింపఁబడుచున్నదో అటులే కార్యమయిన స్థూలసూక్ష్మశరీరముచేత కారణశరీర మొకటి యున్నదని యూహింపఁ బడుచున్నది. ఇంతియే గాక; అహ మజ్ఞుండ నని అజ్ఞానము ప్రత్యక్ష ముగా ననుభవింపఁబడుచున్నది గనుక కారణశరీర మొకటి కలదని చెప్పవచ్చును. ఈరీతిని శరీరత్రయము గలదని నిశ్చయించి ఆత్మకు శరీరత్రయవిలక్షణత్వం బెటువలె నని విచారింపవలయును. ఆత్మవిలక్ష ణత్వము శరీరత్రయంబునందును, శరీరత్రయలక్షణం బాత్మయందును లేకుండుటయే శరీరత్రయవిలక్షణత్వము ఆత్మలక్షణం బెయ్యది యనిన;

సచ్చిదానందరూపము. అనాత్మలక్షణము అనృతజడదుఃఖాత్మకము ఈ లక్షణముల కన్యోన్యవిలక్షణత్వము కలదు.

ఇందుకు దృష్టాంతం బెట్లనిన; పురుషునిలక్షణంబు స్త్రీయందును, స్త్రీలక్షణంబు పురుషునియందును నెటుల లేదో, అట్లే సల్లక్షణమసత్తునందును, అసల్లక్షణము సత్తునందును లేదు. అది యెటులనిన; ప్రకాశలక్షణం బంధకారంబునందును, అంధకారలక్షణంబు ప్రకాశంబునందును నేలాగున లేవో అట్లే చిల్లక్షణము జడంబునను, జడలక్షణంబు చిత్తునను లేదు. మఱియు నెట్టు లనిన; చంద్రికాలక్షణం బాతపంబునందును, ఆతపలక్షణంబు చంద్రికయందును నెటుల లేదో అటులే ఆనందలక్షణంబు దుఃఖంబునందును, దుఃఖలక్షణం బానందంబునందును లేదు. ఇవ్విధంబున సత్తు చిత్తు ఆనందంబులకును, అనృతజడదుఃఖంబులకును అన్యోన్యవిలక్షణత్వము. సల్లక్షణము, అసల్లక్షణము, చిల్లక్షణము, జడలక్షణము, ఆనందలక్షణము, దుఃఖలక్షణము నెఱుఁగకయే వీనికి అన్యోన్యవిలక్షణత్వం బెఱుంగంగూడదు గాన వీనికి లక్షణంబును జెప్పుచున్నారము. ఒకదానిచేతను బాధింపఁబడక భూతభవిష్యద్వర్తమానకాలంబులయం దేకరూపంబుగా నుండునది సల్లక్షణము. కాలత్రయంబులయందును లేనిదై తోఁచుచు నొకదానిచేత బాధింపఁబడి నశించెడిది అసల్లక్షణము. ఇందుకు రజ్జువును, రజ్జువునం దారోపింపఁబడిన సర్పమాలాద్యదులును దృష్టాంతము. రజ్జువునందు సల్లక్షణము గలదు. ఎటులనిన; రజ్జువునం దారోపింపఁబడిన సర్పమాలాద్యదులలోపల నొకదాని చేతను ఆ రజ్జువు బాధింపఁబడక భ్రాంతికాలంబునందును, దత్పూర్వకాలంబునందును, భ్రాంతి పరిసమాప్తికాలంబునందును ఏకరూపం బయియున్నది గాన రజ్జువునందు సల్లక్షణం బున్నది. రజ్జువునం దారోపింపఁబడిన సర్పమాలాద్యదులయం దసల్లక్షణము కలదు. ఎటులనిన; ఆ సర్పాది భ్రాంతికాలంబునందును, భ్రాంతికి పూర్వకాలంబునందును, భ్రాంతిపోయిన తరువాతను; తాను లేకున్నను తోఁచి బాధింపఁబడుచున్నది గనుక అసల్లక్షణ మాసర్పమాలాద్యదులయం దున్నది. రజ్జులక్షణము సర్పంబునందును, సర్పలక్షణంబు రజ్జువందును లేదు. కావునను ఆ రజ్జువును సర్పాదులకు శబ్దముచేతను, అర్థముచేతను, లక్షణముచేతను, ప్రతీతిచేతను, వ్యవహారముచేతను వైలక్షణ్య మెటులనున్నదో అటులే

సల్లక్షణము అసత్తైనటువంటి దేహేంద్రియాదిప్రపంచంబునందు లేదు గనుక ఆ యసల్లక్షణము సత్తైనటువంటి ఆత్మయందు లేదు. కనుక అసత్తుసత్తులకు శబ్దముచేతను, అర్థముచేతను, లక్షణముచేతను, ప్రతీతిచేతను, వ్యవహారముచేతను వైలక్షణ్యమున్నది. ఇందువలన సిద్ధించునది యేమి యనిన; అసల్లక్షణము సల్లక్షణము కాదు. సచ్ఛబ్దార్థ మసచ్ఛబ్దార్థము కాదు. అసచ్ఛబ్దార్థము సచ్ఛబ్దార్థము కాదు. సల్లక్షణ మసల్లక్షణమును, అసల్లక్షణము సల్లక్షణంబును కాదు. సత్ప్రతీతి యసత్ప్రతీతియు, అసత్ప్రతీతి సత్ప్రతీతియును గాదు. కనుక సద్రూపమైన ఆత్మకును, అసద్రూపమయిన దేహేంద్రియాదిప్రపంచంబునకును రజ్జుసర్పంబులకువలె పైనచెప్పిన యైదువిధంబులచేతను కాలత్రయంబునందును అన్యోన్యవైలక్షణ్యము సిద్ధించును.

## చిజ్జడంబులకు లక్షణము

చిల్లక్షణం బేదియనిన; ఒకసాధనంబు నేనియు నపేక్షింపక తానే తోఁచుచు తనయం దారోపింపఁబడిన పదార్థంబులను తోఁపింపఁ జేయునది చిల్లక్షణము జడలక్షణం బెద్దియనిన; తాను తోఁపక అన్యవస్తువును తోఁపింపఁజేయక యుండునట్టిది జడలక్షణము. ఇందుకు ఆదిత్యుండును ఆదిత్యునిచేత భాస్యమయిన ఘటంబును దృష్టాంతము. ఆదిత్యుని యందు చిల్లక్షణము గలదా? యనిన; దృష్టాంతమంతయు నేకదేశము గనుక యేకదేశదృష్టాంతమైన ఆదిత్యునియందు చిల్లక్షణము కలదు. అది యెటులనిన; సూర్యుఁడు ప్రకాశాంతరము నపేక్షింపక తాను దోఁచుచు తన ప్రకాశమును సంబంధించుకొని యుండెడి ఘటమును తోఁపింపఁ జేయుచున్నాఁడు గనుక ప్రకాశస్వరూపుఁడయిన ఆ యాదిత్యునియందు చిల్లక్షణము కలదు. అయితే, ఘటంబునందు జడలక్షణంబు కలదు. అది యెటులనిన; ఘటము తాను తోఁపక అన్యవస్తువును తోఁపింపఁ జేయలేదు గావున ఘటంబునందు జడలక్షణము గలదు. ఆదిత్యలక్షణము ఘటంబునందును, ఘటలక్షణం బాదిత్యునియందును లేదు గనుక ఆదిత్యునికిని ఘటమునకును శబ్దార్థలక్షణ ప్రతీతివ్యవహారంబులచేత నెటువలె వైలక్షణ్యమున్నదో అటులే చిల్లక్షణము జడమయిన దేహేంద్రియాదులయందును జడలక్షణము చిత్తైన యాత్మ

యందును లేదు గనుక చిత్తునకు జడమునకు శబ్దాద్యలక్షణప్రతీతివ్యవహారములచేతను వైలక్షణ్యము కలదు. ఇందువలన సిద్ధించు నేమి యనిన; అప్రకాశ్యనిష్ఠమయిన వికారములచేతను ప్రకాశ్యమయిన వస్తువునకు కాలత్రయంబులయందును సంబంధంబు లేదని సిద్ధించెను, అది యెటులనిన; అప్రకాశ్యఘటాదినిష్ఠమయిన ఛిద్రత్వాచ్ఛిద్రత్వంబులవలన హానిలాభంబులను, స్పృష్టిమత్త్వాస్పృష్టిమత్త్వంబులవలన ప్రత్యవాయాభ్యుదయంబులును, శ్లక్ష్ణత్వాశ్లక్ష్ణత్వంబులవలన హర్షవిషాదంబులును, సమీచీనాసమీచీనత్వంబులవలన నతిశయానతిశయత్వంబులును ప్రకాశస్వరూపుం డగు నాదిత్యు నెటుల స్పృశింపలేదో అటులే అప్రకాశ్యదేహాదినిష్ఠమైన వికారంబులును గుణంబులును ధర్మంబులును జాతినామాదులును వర్ణాశ్రమాదులును కర్తృత్వభోక్తృత్వాదులును కామక్రోధాదులును ప్రకాశస్వరూపుండై సాక్షియై చిన్మాత్రుండయిన యాత్మను కాలత్రయంబులయందును స్పృశింప లేవని సిద్ధించెను. ఆనందంబునకును దుఃఖంబునకును లక్షణం బెటు లనిన; నిరుపాధికమయి నిత్యమయిన సుఖస్వరూపత్వ మానందలక్షణము. తాపత్రయాత్మకమయిన క్లేశత్వము దుఃఖలక్షణము. ఇందుకు క్రొత్తమృత్కుంభంబులోని శీతలజలంబును. కంచుకుండలోని చింతనిప్పులును దృష్టాంతము. ఆజలంబునం దానందలక్షణము గలదు. అది యెటులనిన; ఆతపంబుచేత కొట్టువడి తపించుచువచ్చిన పురుషుం డాశీతలభాండమును స్పృశించి నేత్రముల నొత్తుకొనినమాత్రముచేతనే వానియొక్క తాపమణఁగిపోవుచున్నది. అది జలముయొక్క యావేశమే కాని సాక్షాజ్జలము కాదు. ఈజలావేశమునకే తాపనివర్తకత్వము ప్రత్యక్షంబుగఁ గనుపడుచుండఁగా నాజలపానముఁ జేసినచో సకలతాపంబులును పోవు ననునది సర్వానుభవసిద్ధంబగుటవలన నాజలంబులనందానందలక్షణం బున్నది. చింతనిప్పులయందు దుఃఖలక్షణము కలదు. అది యెట్లన; దాహతాపంబులు లేనివాఁడు ఆచింతనిప్పులతోఁ గూడుకొని యుండెడి కంచుభాండమును స్పృశించినట్లయిన ఆ భాండనిష్ఠమయిన చింతనిప్పులయొక్క ఆవేశము వానికి దాహతాపములనుకలుగఁజేసి చేతులు బొబ్బలగునట్లు చేయుచున్నది. అది చింతనిప్పులయొక్క యావేశమేగాని ప్రత్యక్షమగు నగ్ని కాదు. చింతనిప్పులయొక్క యావేశమువలననే తాపము

కలుగుచుండఁగా నా చింతనిప్పులను స్పృశించినచో సమస్తప్రాణులను భస్మము సేయుననెడిది సర్వానుభవసిద్ధము. కనుక ఆ చింతనిప్పుల యందు దుఃఖలక్షణంబు గలదు. ఇందుకే మఱియొక దృష్టాంతముఁ జెప్పెదము. అమృతంబునుం గాలకూటవిషంబును దృష్టాంతము. అమృతంబునం దానందలక్షణం బున్నదా యనిన; అమృతంబు తాను సుఖస్వరూపమయి యుండి తన్ను పానంబొనర్చినవారలకు నిరతిశయసుఖంబు నిచ్చుచున్నది. కనుక ఆ యమృతంబునం దానందలక్షణం బున్నది. కాలకూటవిషంబునందు దుఃఖలక్షణం బున్నదా యనిన; కాలకూటవిషంబు తాను పాపాత్మకంబయియుండి తనసమీపంబు నొందినవారలకు మిక్కిలి దుఃఖకరమయిన ప్రాణహానిని గలుగఁజేయుచున్నది. కనుక ఆ కాలకూటవిషంబునందు దుఃఖలక్షణం బున్నది. అమృతలక్షణము కాలకూటవిషంబునందును, కాలకూటవిషలక్షణం బమృతంబునందును, జలలక్షణం బగ్నియందును, అగ్నిలక్షణంబు జలంబునందును లేదు గనుక జలాగ్నులకును అమృత కాలకూటవిషంబులకును శబ్దార్థలక్షణ ప్రతీతివ్యవహారముల చేత అన్యోన్యవైలక్షణ్య మెటువలె నున్నదో, అటువలెనే ఆనందలక్షణము దుఃఖాత్మకమైన దేహేంద్రియాది ప్రపంచంబునందును, భార్యాపుత్రాది ప్రపంచంబునందును లేదు. కాఁబట్టి ఈ దుఃఖలక్షణము సుఖస్వరూపుఁ డగు ఆత్మయందు లేదు. కనుకను ఆ యానందంబునకును దుఃఖంబునకును శబ్దార్థలక్షణప్రతీతివ్యవహారంబులవలన నన్యోన్యవైలక్షణ్యము కలదు. ఇందువలన సిద్ధించెడి దేమి యనిన; కాలకూటనిష్ఠమయిన తాపము జలము నెటుల స్పృశింప లేదో అటులే దేహేంద్రియాది ప్రపంచనిష్ఠమయిన తాపత్రయములు సుఖస్వరూపుఁడయిన ఆత్మను కాలత్రయమందును స్పృశింప వనుట సిద్ధించెను.

ఈ విచారములకు ఫలమెయ్యది యనిన; రజ్జువువలె సద్రూపుఁడయి, ఆదిత్యునివలె చిద్రూపుఁడయి, జలామృతమువలె ఆనందస్వరూపుఁడయిన ఆత్మ, సర్పమువలె ననృతమును, ఘటమువలె జడమును, అగ్ని కాలకూటవిషమువలె దుఃఖస్వరూపము నగు దేహేంద్రియాది ప్రపంచంబుకంటె విలక్షణుం డని యెఱుంగుట ఫలము. ఇటుల నెవ్వ రెఱుంగుచున్నారో వారు జీవన్ముక్తు లని వేదాంతసిద్ధాంతము.

శ్లో. అనేకావయవః స్థూలశ్శుక్లశోణితసంభవః,
దేహస్సూక్ష్మస్తథా సప్తదశావయవలక్షణః.
కారణం చాజ్ఞానసంజ్ఞో ఽనృతదుఃఖాత్మకా అమీ,
తేభ్యో విలక్షణస్త్వాత్మా సత్యజ్ఞానాదిలక్షణః.
ఆత్మలక్షణసత్యాదే స్తథాభిన్నో ఽనృతాదితః,
పీయూషవిషవద్భాను భాండవద్రజ్జుసర్పవత్.
ఇతి యస్తు వివిచ్యైత విజానాతి పునఃపునః,
స సంసారాద్విముక్తస్స్యాత్ నాన్యథా కర్మకోటిభిః.

ఇది అష్టమవర్ణకము

---

# న వ మ వ ర్ణ క ము

## అవస్థాత్రయసాక్షిత్వప్రకరణము

శ్లో. జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యా అవస్థాః కాః కిమాత్మనః,
సా క్షేత్రమాసామిత్యేత త్సదృష్టాంతం విచార్యతే.

ఆత్మకు అవస్థాత్రయసాక్షిత్వము శ్రుతులయందు జెప్పఁబడియున్నది. అవస్థాత్రయంబు నెఱుంగకయే అవస్థాత్రయసాక్షిత్వంబు నెఱుంగరాదు గాన ముందుగ నవస్థాత్రయం బన నెయ్యదియో విచారింతము. అవస్థాత్రయ మనఁగా; జాగ్రదవస్థ. స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ అని మూఁడువిధంబులు. అందులో జాగ్రదవస్థ యనఁగా; సకలేంద్రియంబులవలనను బాహ్యార్థజ్ఞానం బెంతపర్యంతంబు గలుగుచున్నదో అంతపర్యంతంబును జాగ్రదవస్థ. స్వప్నావస్థ యనఁగా; సకలేంద్రియంబులవలనను బాహ్యార్థజ్ఞానములేక మనస్సే విషయాకారంబుగాఁ బరిణమించి కర్త్రాద్యాకారంబుగా నెంతపర్యంతంబు దోఁచుచున్నదో అంతపర్యంతంబును స్వప్నావస్థ. సుషుప్త్యవస్థయనఁగా; సకలేంద్రియంబులవలనను బాహ్యార్థజ్ఞానంబు లేక మనస్సునుం గర్త్రాద్యాకారంబుగాఁ బరిణమింపక, విషయాద్యాకారంబుగానైననుం దోఁపింపక, బుద్ధికారణా

ద్వ్యాకారంబుగా నెంతపర్యంతం బుండునో అంతపర్యంతంబును సుషు ప్త్యవస్థ. ఈయవస్థాత్రయసాక్షిత్వం బాత్మకు ఎటుల వచ్చినదనిన; అవ స్థాత్రయంబుతోడం గూడుకొని యుండియు నా మూఁడవస్థలను వాని యొక్క వ్యాపారంబులను అవస్థాత్రయవాసులను నెఱుంగునది యే యవస్థాత్రయసాక్షిత్వమని చెప్పబడును. ఈ సాక్షిత్వంబున కీ విశే షంబులన్నియుం గావలయును.

ఇందుకు దృష్టాంతము.—ఏకాంతముగా మఠాదిస్థలవిశేషంబు లందు జపంబు చేసికొనుచుండునట్టి యొక పురుషుని సన్నిధియందు అప్పు యిచ్చి పుచ్చుకొనిన యిద్దరు పురుషులు అచ్చట నొక ముహూర్తకా లము జపముచేయుచుండ తరువాత అప్పుయిచ్చినవాఁడు పుచ్చుకొనిన వాఁడు లేకయే చేత నప్పుగాఁ దీసుకొనిన ద్రవ్యంబు నిమ్మని యడుగ నతం డీతరుణంబునం దియ్యఁజాల నని చెప్పుటయు నావిషయమయి యొకముహూర్తమాత్ర మాయిరువురును వాదించుచుండి యటు తరువాతను అప్పుయిచ్చినవాఁడు పుచ్చుకొన్నవానిని పైక మిమ్మని యిబ్బంది చేయఁగా నతఁడు నీకు నేను బాకీ లేదని పలుక నాబుణ దాత యాబుణస్థునిమీఁద కోపించి కలహించి న్యాయస్థలంబునకుఁ బోయి న్యాయాధిపతితో ఫలానివాఁడు నాయొద్ద అప్పుతీసికొనిన ద్రవ్యమును నే నడుగఁగా ధనము నిచ్చుటకు బదులుగా నన్నుఁగొట్టి నీకు నేను పైకంబు నియ్యవలసినది లేదని చెప్పినాఁడు. కాఁబట్టి న్యాయమును విచారించి నాబాకీదారునివల్ల నాకు రావలసినధనమును నిప్పింపవలసిన దని విన్నవింపఁగా ఆ న్యాయాధిపతి బుణముఁ బుచ్చు కొనిన మనుష్యుని పిలువం బనిచి నీకు అప్పు యిచ్చినవాఁడు తనపైక మిమ్మనియడుగ న్యాయప్రకార మియ్యక యతని నేలకొట్టితి వని యడి గిన నాబుణస్థుఁడు న్యాయాధిపతికి నెదురుగా నిలిచి అయ్యా! నేనితనిం గొట్టలేదు. ఇతఁడే నన్నుఁ గొట్టి నేను తనతప్పిదమును బయలుపఱతు నను శంకచేత ఫిర్యాదు చేసినాఁ డని జవాబుఁ జెప్పెను. అప్పుడు ఆ న్యాయాధిపతి యా వాదిప్రతివాదులవాఙ్మూలములు అన్యోన్యవిరు ద్ధములయి యుండుటను చూచి 'యింపుకు సాక్షు లెవ్వరైనం గలరా' యని యడిగెను. అప్పుడు వారు ఉభయులును సాక్షులు కలరని చెప్పి నట్లయిన నే సాక్షివలన వారియొక్క యాథార్థ్యము బయలుపడునో ఆ

సాక్షియందు పూర్వము చెప్పఁబడిన సాక్షిత్వమున్నది. అది యెట్లనిన; ఆ వాది ప్రతివాదు లిద్దఱును ఎంతపర్యంతంబు మౌనంబుగా నుండిరో అంతపర్యంతంబును సుషుప్త్యవస్థకు దృష్టాంతము. ఆ యవస్థయందు వ్యాపారత్రయంబును లేదు. ఆ మౌనంబుగా నుండిన యిరువురును అవస్థావాసులు. ఆ వాది ప్రతివాదు లెంతవఱకు సౌజన్యంబుగా మాటలాడుకొనుచుండిరో అంతవఱకును స్వప్నావస్థకు దృష్టాంతము. ఆ స్వప్నావస్థయందు వ్యాపారత్రయంబును గలదు. ఆ మూఁడువ్యాపారంబులు నెయ్యవి యనిన; హస్తచలనాదులు, కాయికవ్యాపారములు, అన్యోన్యసంభాషణంబులు, వాచికవ్యాపారములు, ఉత్తరప్రత్యుత్తరంబులకు చింతించుట మానసికవ్యాపారములు, మృదుభాషులగువారు ఉభయులు నవస్థావాసులు. ఆ వాదిప్రతివాదులు ఎంతసేపు కలహంబు సేయుచుండిరో అంతసేపటివఱకు జాగ్రదవస్థకు దృష్టాంతము, ఆ యవస్థయందు వ్యాపారత్రయంబును గలదు. ఆ మూఁడువ్యాపారంబులు నెయ్యవి యనిన; అన్యోన్యతాడనాదులు, కాయికవ్యాపారంబులు, పరస్పరపౌరుషోక్తులు, వాచికవ్యాపారములు, అన్యోన్యమర్మచింతనంబులు, మానసికవ్యాపారములు కలహించుచున్న వారిరువురును అవస్థావాసులు. వీరల కలహమును చూచుచుండిన మధ్యస్థుఁడైన దేవదత్తుఁడు అవస్థాత్రయయుక్తులగువారలకు సహాయంబుగా నొక్కమాటయైన నాడలేదు గాన అవస్థాత్రయముతోఁ గూడుకొని యుండి యా మూఁడవస్థలను వాటియొక్క వ్యాపారంబులను ఆ యవస్థాత్రయవాసులను నెఱుఁగుచున్నాఁడు. కనుక ఆ మధ్యస్థుఁడైన దేవదత్తునియందు సాక్షిలక్షణం బున్నది. కాఁబట్టి సాక్షియైన ఆత్మయందిన్ని విశేషంబులు నున్నవి. అది యెట్లనిన; అవస్థాత్రయముతోఁ గూడుకొని యుండుటయును, అవస్థాత్రయంబును, అవస్థాత్రయవ్యాపారంబులను నెఱుంగుటయును ఈ నాలుగువిశేషణంబులును సాక్షియైన ఆత్మయం దున్నవి. దార్ష్టాంతికంబునం దవస్థాత్రయం బేమి యనిన; జాగ్రత్స్వప్నసుషుప్తులని మూఁడువిధంబులు. అందు జాగ్రత్త యనఁగా; నిదురపోయి లేచినది మొదలుకొని తిరుగా నిదురవచ్చునంతపర్యంతంబును జాగ్రత్త యని చెప్పఁబడును. ఇందుకు దృష్టాంతము.—విశాల

మైన పట్టణమువలె జాగ్రదవస్థ. ఆ పట్టణంబునందు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రవీథులవలె జాగ్రదవస్థయందు కాయికవాచికమానసిక వ్యాపారంబు లున్నవి. ఆ పట్టణముయొక్క హానివృద్ధులకు అభిమాని యైన ప్రభువువలె జాగ్రదవస్థయందు వచ్చెడి సుఖదుఃఖముల చేత తపించుచుండెడి విశ్వుం డవస్థావాసుఁడు. స్వప్నావస్థయనిన; నిద్రా కాలంబునందు జాగ్రద్వాసనామయంబయిన మనస్సు చేత కల్పింపఁబడిన ప్రపంచంబునందు ప్రాతిభాసికజీవుం డెంతపర్యంతము వ్యవహరించుచున్నాఁడో అంతపర్యంతంబును స్వప్నావస్థయని చెప్పఁబడును. ఇందుకు దృష్టాంతము.—పైనఁజెప్పిన పట్టణములోపలి కోటవలె స్వప్నావస్థ. ఆ కోట లోపలి బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రవీథులవలె నీ స్వప్నావస్థయందు కాయికవాచికమానసికవ్యాపారంబు లున్నవి. ఆ కోటయొక్క హాని వృద్ధులకు అభిమానియైన ప్రభువువలె నీ స్వప్నావస్థయందు వచ్చెడి సుఖదుఃఖములచేత తపించుచుండెడి తైజసుఁడు స్వప్నావస్థావాసుఁడు. సుషుప్త్యవస్థయనఁగా; బాహ్యవ్యాపారంబును, అంతర్వ్యాపారంబును, దేహేంద్రియాదిస్మరణయును లేక జీవుఁడు నిశ్చేష్టుఁడై యెంతపర్యంతము నిద్రపోవుచున్నాఁడో అంతపర్యంతంబును సుషుప్త్యవస్థ యని చెప్పఁబడును. ఇందుకు దృష్టాంతము.—ఆ కోటయందుండు నగరువలె సుషుప్త్యవస్థ ఆ నగరునందు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రవీథు లెటుల లేవో అటుల సుషుప్త్యవస్థయందు కాయికవాచికమానసికవ్యాపారంబులు లేవు. ఆ నగరుయొక్క హానివృద్ధుల కభిమానియైన ప్రభువువలె సుషుప్త్యవస్థయందు నిజానందము ననుభవించుచుండెడి ప్రాజ్ఞుఁడు సుషుప్త్యవస్థావాసుఁడు.

ఆత్మకు అవస్థాత్రయమును గూర్చి సాక్షిత్వ మెట్లనిన; నిన్నటి జాగ్రదవస్థయును, జాగ్రదవస్థయందు చేయఁబడిన కాయికవాచికమానసికవ్యాపారంబులును, ఆ యవస్థావాసుఁడును నిన్నటిస్వప్నావస్థయును, ఆ స్వప్నావస్థయందు చేయఁబడిన కాయికవాచికమానసికవ్యాపారంబులును, ఆ యవస్థావాసుఁడును నిన్నటి సుషుప్త్యవస్థయును, ఆ సుషుప్త్యవస్థయందు ఏ వ్యాపారంబునుం జేయకుండుటయును ఆ యవస్థావాసుఁడును ఇవియన్నియు నేఁడు దోఁచుచున్నది. కనుక ఇది స్మరణమో అనుభవమో యనిన; స్మరణ మని చెప్పవలెను. అనుభవ

మని చెప్పవలెనిన; ఇక్కడ విషయసన్నికర్షణము లేదు గనుక అనుభవ మని చెప్పఁగూడదు. స్మరణ మని చెప్పవలెను. అయితే ఈస్మరణం బనుభూతవస్తువిషయమైవచ్చుచున్నదా యనిన; అనుభూతవస్తువిషయమయ్యే వచ్చుచున్నది. అయినను భూతవస్తువిషయమై వచ్చుచున్నదని చెప్పెద మనిన; ప్రపంచవ్యాపారంబంతయును మనస్సుచేత స్మరింపఁబడవలయును. అటుల స్మరింపఁబడలేదు గాన స్మరణంబనుభూతవిషయమని చెప్పవలెను. అయినచో అనుభూతవిషయమై యెవరిచేత ననుభవింపఁబడిన దనిన; మనచేతనే అనుభవింపఁబడినది. అట్లయిన మనము కూడియుండి యనుభవించితిమో కూడియుండక యనుభవించితిమో యనిన; కూడి యనుభవించితిమి. కూడకయుండి యనుభవించితి మని చెప్పెద మనిన; స్వర్గాదులయందుఁండెడి విషయానుభవములను మన మిప్పుడే యనుభవింపవలెను. అటుల యనుభవింపలేదు గాన కూడుకొనియుండి విషయాదుల ననుభవించితిమని చెప్పఁగూడదు. చెప్పిన యెడల అవస్థలను అవస్థావ్యాపారంబులను అవస్థావాసులను అనుభవించితి మని చెప్పవలెను. అయినను కూడకయుండుట యెట్లనిన; న్నిన్నటి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును ఆ యవస్థావ్యాపారములును అవస్థావాసులును నశించి పోయి మనము ఉన్నాము గనుక మన మా యవస్థావాసులతోఁ గూడలేదు. అటుల కూడినట్లయిన ఆయవస్థాదులు నశించిపోయినట్లు మనము నశించిపోదుము. కూడియుండిన నశించిపోవలెనని నియమము కలదు. అది యెట్లనిన; వస్త్రముతోఁ గూడుకొనియుండెడి చిత్రవిశేషములు వస్త్రములు నశించినప్పుడు వానితోఁగూడ నెటుల నశించిపోవుచున్నవో అటులనే మనము ఆయవస్థాత్రయముతో కూడియుండినట్లు అవి నశించినప్పుగే నశించిపోదుము. కాబట్టి అవస్థాత్రయములతో మనము కూడక ఆయవస్థలను, అవస్థావ్యాపారములను, అవస్థావాసులను నెఱుఁగుచున్నాము. అందువలన సాక్షిలక్షణము మనయందు ఉన్నది. కనుక మనమే అవస్థాత్రయసాక్షి యని యెఱుంగునది అయితే యిప్పుడు చెప్పినప్రకారము అవస్థాదుల నెఱింగెడివాఁడు సాక్షి యని సెలవిచ్చితిరి అవస్థలను, అవస్థావ్యాపారములను ఎఱుఁగుచున్న వాఁడు అవస్థావాసుఁడుగదా యనిన; ఆయవస్థావాసునికి సాక్షిత్వము సిద్ధించి యుండఁగా నతనికి సాక్షిత్వము లేదను

టయు, ఆయవస్థావాసునికంటె వ్యతిరిక్తుఁడైనవానికి సాక్షిత్వము కల దనుటయు కూడదు. అది యెట్లనిన; అవస్థావాసుఁడు బాహ్యము లైన వృక్షాదులవలె అంతరమైన దేహాదులవలె వికారియై యున్నాఁడు గనుక ఆ వృక్షాదులకు దేహాదులకు అన్యపదార్థావభాసకరూపమైన సాక్షిత్వము ఎట్లు లేదో అటులే వికారియైన యవస్థావాసునికిని అవస్థలకు అవస్థావ్యాపారములకును అవభాసకరూపమయిన సాక్షిత్వము లేదు. అయిన అవస్థావాసుఁడు వికారి యగును. అది యెట్లన; అవస్థా వాసుఁడు నిన్న ఎటువంటి సుఖదుఃఖములచేత తపించుచుండెనో అటుల నేఁడును తపించుచుండక అంతకంటె నతిశయముగా నయినను కొద్దిగా నయినను సుఖదుఃఖములచేత తపింపుచున్నాఁడు. కనుక వీఁడు వికారి యగును. కనుక వీనికి సాక్షిత్వము కూడదు. అయితే వీనికంటె వ్యతిరిక్తమయిన సాక్షి యని యొకటి కానమే; కలదని యెటుల యెఱుఁగవచ్చు ననిన; యెఱుఁగవచ్చును. ఎటు లనిన; ఈ యవస్థావాసుఁడు నిన్న ఏసుఖ దుఃఖములతోఁ గూడుకొనియుండెనో ఆ సుఖదుఃఖములలో నేఁడును గూడుకొనియుండక అంతకంటె న్యూనాధికములగు సుఖదుఃఖములతో కూడుకొనియున్నాఁడని ఈ యవస్థావాసునియొక్క వికారముల నెవఁ డెఱుంగుచున్నాఁడో, వాఁడు అవస్థావాసునికంటె వ్యతిరిక్తుఁ డయిన సాక్షి యని యెఱుఁగవచ్చును. అయితే నిర్వికారియైన ఆత్మ నేను సాక్షి యని యెఱుఁగదు. వికారియైన యవస్థావాసుఁడు కదా నేను సాక్షి యని యెఱుఁగుచున్నాఁడు. ఆపక్షమందు నిర్వికారుఁడయిన ఆత్మను ఎటుల సాక్షి యని చెప్పవచ్చును. ఇందుకు దృష్టాంతము.—దర్పణా లోకంబునందు గ్రీవస్థమయిన ముఖము దర్పణంబునందు ప్రతిబింబింప నా ప్రతిబింబద్వారా తనయొక్క సౌందర్యకురూపత్వాదుల నెటుల యెఱుంగుచున్నాఁడో అటుల నిర్వికారుఁడయిన ఆత్మ అంతఃకరణంబు నందు ప్రతిబింబించి యా ప్రతిబింబరూపమయినవాఁడు కర్తయై శ్రుత్యర్థ విచారముచేసి యావికారములయిన ప్రతిబింబరూపము తాను నిర్వికారుఁడును పరిపూర్ణుఁడయిన బ్రహ్మంబును సాక్షియు నని యెఱుఁగు చున్నాఁడు. ఈదృష్టాంతంబునందలి దృశ్యమైన దర్పణంబును, ఆదర్పణంబు నందు దృశ్యమై తోఁచెడి యాభాసమును గ్రీవస్థముఖంబునం దుండెడి సౌందర్యకురూపత్వాదుల నెటుల నెఱుఁగ లేదో అటుల దృశ్యమయి

వికారియైన అంతఃకరణంబును ఆ యంతఃకరణంబునందు ప్రతిబింబించి దృశ్యుఁడును వికారియు నైన చిదాభాసుఁడును తనకు పరమార్థస్వరూపమై అధిష్ఠానాత్మనిష్ఠమయిన సాక్షిత్వనిర్వికారత్వపరిపూర్ణత్వాదులను నెఱుంగలేదు గాన నిర్వికారుఁ డయిన ఆత్మ నేను సాక్షి నని యెఱుఁగకున్నను వికారియైన యవస్థావాసుఁడు నేను సాక్షినని యెఱిఁగినట్లుగా నున్నప్పటికిని వికారుఁగు నవస్థాత్రయవాసులకు సాక్షిత్వము కూడదు. ఆనిర్వికారుఁడయిన ఆత్మకే సాక్షిత్వము చెప్పవలెను. ఆ సాక్షిలక్షణము మనయందే యున్నది గనుక మనమే సాక్షియనుటకు సందేహము లేదు. అయితే మనయందు ఈసాక్షిత్వము పూర్వమే సిద్ధించియున్నదా లేక యిప్పుడు సాధనముచేత సిద్ధింపవలసియున్నదా? యనిన; వివాదకర్తృత్వసాక్షియం దుండునట్టి సాక్షిత్వము సాధనములచేత సిద్ధింపక పూర్వమే యెటుల సిద్ధించియున్నదో అటులే మనయం దుండెడిసాక్షిత్వంబును సాధనములచే సిద్ధింపక పూర్వమే సిద్ధించియున్నది. అయితే సాక్షిత్వ మెందుచేత తోఁపలేదనిన; విచారింపలేదు గనుక తోఁపలేదు. విచారించినచో మనకే సాక్షిత్వము నిత్యసిద్ధమయి యున్నది. ఈవిచారమునకు ఫలం బేమనిన; పైన చెప్పిన వివాదకర్తృసాక్షియైన దేవదత్తునికంటె నన్యులయినసంవాదులయొక్క అవస్థలును అవస్థావ్యాపారములును అవస్థావ్యాపారత్వములును వివాదకర్తృసాక్షి యైన దేవదత్తునికి లేదు గనుక ఈ యవస్థాదివికారములు వానినెటువలె స్పృశింపలేవో ఈయవస్థాదులనెల్ల నుదాసీనుఁడై చూచుచున్నాఁడు గనుక ఈయవస్థాదులకు సాక్షియయి యెటువలెనున్నాఁడో అటులనే మనకంటె నన్యమయిన సాభాసాహంకారముయొక్క అవస్థాత్రయంబును ఆ యవస్థాత్రయవ్యాపారంబులును ఆ యవస్థావత్త్వంబును మనకు లేవు. కనుక ఆ యవస్థాదివికారములు సాక్షియైన మనలను స్పృశింపలేవు. మన మీయవస్థాదులనెల్ల నుదాసీనులమయి చూచుచున్నాము గనుక ఈ యవస్థాదులకెల్లను కాలత్రయంబునందును సాక్షియై యున్నారము. అనుటయే ఈ విచారమునకు ఫలము ఇటుల లెస్సగా విచారణచేసి నేనే సాక్షిస్వరూపుఁడ నని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే కృతార్థుఁడును జీవన్ముక్తుఁడు నని వేదాంతసిద్ధాంతము.

శ్లో. ఇంద్రియైరుపలబ్ధిస్స్యా దర్థానాం జాగ్రదాత్మనః,
నిద్రాయాం మనసైవార్థోపలబ్ధిస్స్వప్న ఉచ్యతే,
సర్వేషాం జ్ఞానరహితా సుషుప్తి స్స్యా త్సుఖాత్మికా,
తద్వ్యాపారాః కాయికాద్యా స్తథా విశ్వాదినామకః.
అవస్థాద్వై స్సుసంయుక్త స్తజ్జాత్మ్యాద్వయం భవేత్,
అవస్థాద్వై రయుక్తశ్చ తన్నాశేఽప్యనన్యసంస్థితేః.
యథా వివాదకర్తౄణాం సాక్షీ చైత్రరథ స్తథా,
అవస్థాదివికారాణాం సాక్షీ వ్యక్తా స్స్వయం యథా.
అహం సాక్షీతి యో విద్యాన్వివిచ్యైవ పునఃపునః,
స ఏవ ముక్త స్సో విద్వా నితి వేదాంతడిండిమః.

ఇది నవమవర్ణకము.

---

# దశమవర్ణకము

## పంచకోశవివరణప్రకరణము

శ్లో. కింరూపాః పంచకోశాస్స్యుః కా వా తద్వ్యతిరిక్తతా,
ఆత్మవచ్చేతి తత్సర్వం సదృష్టాంతం విచార్యతే.

ఆత్మ పంచకోశవ్యతిరిక్తుఁ డని శ్రుతులు చెప్పుచున్నవి. కనుక పంచకోశముల నెఱుంగకయే పంచకోశవ్యతిరిక్తమయిన ఆత్మ నెఱుఁగఁ గూడదు గాన ముందు పంచకోశస్వరూపమును విచారింపునము. అది యెటు లనఁగ; పంచకోశము లనఁగా; అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశము లని యైదువిధంబులు. వీనియం దన్నమయకోశ మనఁగా; అన్నమువలన జన్యమై స్తంభము వలె స్థూలమైన కరచరణాద్యవయవాకారమై షడ్భావవికారమై *

* "జాయతే = పుట్టుట, అస్తి = పుట్టియుండుట, వర్ధతే = పెఱుఁగుట, విపరిణమతే = పండుట, అపక్షీయతే = తఱుఁగుట, వినశ్యతి = నశించుట" యను నవి షడ్భావవికారములు. ఇవి దేహధర్మములు.

షట్కోశాత్మకమై తోఁచునట్టి స్థూలశరీరము అన్నమయకోశ మని చెప్పఁబడును. ప్రాణమయకోశ మనఁగా; కర్మేంద్రియంబు లైదును, ప్రాణము లైదును. ఈ పదియును గూడి ప్రాణమయకోశ మాయెను. మనోమయకోశ మనఁగా; మనస్సును, జ్ఞానేంద్రియంబు లయిదును. ఈ యాఱునుంగూడి మనోమయకోశ మాయెను. విజ్ఞానమయకోశ మనఁగా; బుద్ధియును, జ్ఞానేంద్రియంబు లైదును. ఈ యాఱునుంగూడి విజ్ఞానమయకోశ మాయెను. ఆనందమయకోశ మనఁగా; ప్రియమోద ప్రమోదవృత్తిమత్తై అజ్ఞానప్రధానమైన అంతఃకరణము ఆనందమయ కోశమని చెప్పఁబడును. ప్రియమోదప్రమోదము లనఁగా; ఇష్టమైన వస్తువును చూచినమాత్రముననే వచ్చునట్టి సంతోషమునకు ప్రియ మని పేరు. ఆ చూచినవస్తువు లభించిన తర్వాత వచ్చిన సంతోషము నకు మోద మని పేరు. ఆ లభించిన వస్తువు ననుభవించిన తర్వాత వచ్చిన సంతోషమునకు ప్రమోద మని పేరు.

వీనికి కోశము లను పేరు ఎందుకు వచ్చిన దనిన; కోశములు ఆత్మ నెఱుఁగనీక కప్పుచున్నవి గనుక వీనికి కోశములని పేరు. ఇందుకు దృష్టాంతము.—ఖడ్గమును ఒఱ కప్పినట్టును, తంబురను గవిసెన కప్పి నట్టును, పసిరికెపురుగును పసిరికెతిత్తి కప్పినట్టును, చింతగుల్ల చింత పండును గప్పినట్టును, ఆత్మను పంచకోశంబులును గప్పియున్నవి గాన వీనికి కోశములని పేరు వచ్చెను. అయితే ఈ దృష్టాంతమందు ఒఱయును కత్తియును, గవిసెనయుం దంబురయును, పసిరికెతిత్తియు జంతువును,చింత గుల్లయుం జింతపండును, పరిచ్ఛిన్నంబు లగుటవలనను సమానసత్తాకం బులు కావు గనుకను ఒకటి నొకటి యుపజీవించుకొని యుండ లేదు గనుకను ఆ యొఱ మొదలయిన పదార్థంబులు కప్పునట్టె వగును. దార్ష్టాంతికమందైతే సమానసత్తాకములు కావు గనుకను ఆత్మసత్త నుపజీవించుకొని తోఁచెడి పంచకోశములు ఆత్మను కప్పుట యెటుల సమ ర్థములగు ననిన; ఆదిత్యకిరణపరిణామవిశేషమైన మేఘంబు లాయాది త్యునియొక్క సత్తచే నుపజీవించుకొని యుండినప్పటికిని ఆ మేఘంబు లాదిత్యుని నెటుల కప్పుచున్నవో, అగ్నిసత్త నుపజీవించుకొని తోఁచెడి ధూమంబగ్ని నెటుల కప్పుచున్నదో, రజ్జుసత్త నుపజీవించుకొని తోఁచెడి

సర్పమా రజ్జువు నెటుల కప్పుచున్నదో, మృత్సత్త నుపజీవించుకొని తోఁచెడి ఘటము మృత్తు నెటుల కప్పుచున్నదో, స్వర్ణసత్తనుపజీవించు కొని తోఁచెడి కుండలంబు లాస్వర్ణము నెటుల కప్పుచున్నదో, అటులనే ఆత్మసత్త నుపజీవించుకొని తోఁచెడి పంచకోశంబులును ఆత్మను కప్ప వచ్చును. ఇటువలె పంచకోశంబులును ఆత్మను కప్పును గాన వీనికి కోశము లని పేరు చెప్పవచ్చును.

అయితే, ఆత్మకు పంచకోశవ్యతిరిక్తత్వ మెటు లనిన; దృష్టాంత మందు ఖడ్గము మొఱలగునవియును, ఒర మొదలగునవియును ఏకముగా వ్యవహరింపఁబడునవియై తోఁచినప్పటికిని ఆ ఖడ్గాదులు ఒఱ మొదలైనవానికంటె భిన్నంబులై యెటుల దోఁచుచున్నవో అటులనే ఆత్మయును పంచకోశంబులు నేకముగా వ్యవహరింపఁబడునవియై తోఁచినప్పటికిని ఆత్మ కాలత్రయమందును పంచకోశంబులకంటె వ్యతిరిక్తుఁడై తోఁచుటయే పంచకోశ వ్యతిరిక్తత్వము. పంచకోశంబులతోఁ గూడియుండెడి ఆత్మను గదా ? పంచకోశవ్యతిరిక్తుఁడని చెప్పవలెను. ఈయాత్మకు పంచకోశములతో కూటమి కలదు. ఆ కూటమి యెందుచేత వచ్చినదనిన; అన్యోన్యాధ్యాసచేత వచ్చినది. అన్యోన్యాధ్యాస యేది యనిన; ఒక వస్తువునందలి ధర్మము మఱియొక వస్తువునందు తోఁచుట అన్యోన్యాధ్యాసము. అన్యోన్యాధ్యాసద్వారా పంచకోశములకును ఆత్మకును కూటమి కలదు. అది యెట్లనిన; అన్నమయకోశమునకును ఆత్మకును అధ్యాసద్వారా కూటమి వచ్చిన ప్రకారమును సంక్షేపరూపంబుగాఁ జెప్పెదము. జీవసామాన్యజాతివికారలింగవర్ణ విశేషజాత్యాశ్రమనామ రూపసంసారవేషక్రియాదిద్వారా కూటమి వచ్చినది. అది యెట్లనిన; నేను జీవుండనని జీవాధ్యాసము. నేను మనుష్యుండనని సామాన్యజాత్యధ్యాసము. నేను పుట్టి పెరిగి యుండి యింత పొడవై క్షీణించి నశించి పోవుచున్నా ననియెడి వికారద్వారా వికారాధ్యాసము. నేను పురుషుండను, స్త్రీని యని లింగద్వారా లింగాధ్యాసము. నేను బ్రాహ్మణుండ, క్షత్రియుండ, వైశ్యుండ, శూద్రుఁడ నని వర్ణద్వారా వర్ణాధ్యాసము. నేను తెలుగువాఁడను, అరవవాఁడను, కన్నడివాఁడను, వెలనాఁటివాఁడను, వేఁగినాఁటివాఁడను, మురికినాఁటివాఁడను, పాకనాఁటివాఁడను, నియోగివాఁడను, గుజరాతివాఁడను, మహారాష్ట్రుఁడను, నేను కాశ్యప

గోత్రిని, భారద్వాజగోత్రిని, ఆశ్వలాయనసూత్రముగలవాఁడను, ఆప స్తంబసూత్రముగలవాఁడను, బోధాయనసూత్రముగలవాఁడను, కాత్యాయనసూత్రముగలవాఁడనని విశేషజాతిద్వారా విశేషజాత్యధ్యాసము. నేను బ్రహ్మచారిని, గృహస్థుఁడను, వానప్రస్థుఁడను, సన్యాసిని యని ఆశ్రమద్వారా యాశ్రమాధ్యాసము. నేను కృష్ణదాసుఁడను, రామదాసుఁడను, ఎల్లంభట్టను, తిప్పంభట్టను, పోలంభట్టను, నల్లనివాఁడను, ఎఱ్ఱనివాఁడనని నామరూపద్వారా నామరూపాధ్యాసము. నేను దీక్షితుఁడను, సోమయాజిని, ప్రతివసంతయాజిని, మహావ్రతయాజిని, వాజపేయయాజిని, పౌండరీకయాజి నని సంస్కారద్వారా కర్మాధ్యాసము. నేను మాయావాదిని, సత్యవాదిని, విశిష్టాద్వైతవాదిని, పరమభాగవతుఁడను, శైవుఁడను, శాస్త్రజ్ఞుడను, పౌరాణికుఁడను, యోగీశ్వరుఁడను, గంగాయాత్ర చేసినవాఁడనని వేషద్వారా వేషాధ్యాసము. నేను ఉపాధ్యాయుఁడను, శిష్యుఁడను, భక్తుఁడను, యాజ్ఞికుఁడను, జ్ఞానిని, పెండ్లికుమారుఁడను, వడ్లవాఁడను, కుమ్మరివాఁడను, మంగలవాఁడను, చాకలివాఁడను, మణియగాఁడను, కరణమువాఁడనని క్రియాద్వారా క్రియాధ్యాసము ఇవి మొదలైన అన్నమయకోశనిష్ఠములైన ధర్మములు ఆత్మయందును, ఆత్మనిష్ఠమైన సచ్చిదానందలక్షణములు స్థూలంబుగాఁ దోఁచెడి అన్నమయకోశంబునందును దోఁచుచున్నవి గాన, ఈ అన్యోన్యాధ్యాసముచేతను అన్నమయకోశంబునకును ఆత్మకును కూటమి వచ్చినది.

ప్రాణమయకోశమునకును ఆత్మకును కూటమి యెట్లనిన; అధ్యాసపూర్వకముగానే వచ్చినది. అది యెట్లనిన; నేను క్షుత్పిపాసలు గలవాఁడను, శక్తివీర్యబలములు గలవాఁడను, వక్తను, దాతను, మూగను, పంగువును నను నివి మొదలైన ప్రాణమయకోశనిష్ఠమైన ధర్మంబులాత్మనిష్ఠములుగాను, ఆత్మనిష్ఠములైన సచ్చిదానందధర్మములు ప్రాణమయకోశనిష్ఠములుగాను ప్రాణము లెస్సగాఁ దోఁచుచున్నదని ప్రాణమయకోశంబునందును తోఁచుచున్నది గనుక ప్రాణమయకోశంబునకు ఆత్మకును అన్యోన్యాధ్యాసచేత కూటమి వచ్చినది.

మనోమయకోశంబునకు ఆత్మకును అన్యోన్యాధ్యాసము ఎట్లనిన నేను సంకల్పవాసిని, వికల్పవాసిని, శోకిని, మోహిని, కామిని

క్రోధిని, ద్వేషిని, శ్రోతను, స్రష్టను, ఇచ్ఛగలవాడను, రసయితను, ఘ్రాతను, బధిరుఁడను, అజిఘ్రాఁడను, కారణుండను, వికతనాసికుండ నను నివి మొదలైన మనోమయకోశనిష్ఠమైన సంకల్పాదిధర్మంబులు ఆత్మయందును, ఆత్మధర్మంబులైన సచ్చిదానందంబులు మనస్సున లెస్సగాఁదోఁచుచున్నవని మనోమయకోశంబునందును తోఁచుచున్నది. కాఁబట్టి మనోమయకోశంబునకును ఆత్మకును అన్యోన్యాధ్యాసముచేత కూటమి వచ్చినది.

విజ్ఞానమయకోశంబునకును ఆత్మకును అన్యోన్యాధ్యాసముచేత కూటమి యెటుల వచ్చిన దనిన; నేను కర్తను, నిశ్చయవాసిని, బుద్ధిమంతుఁడను, ఊహాపోహాచతురుఁడను, ఏకసంథాగ్రాహిని శ్రోత్రియుఁడను, విరక్తుఁడను, పండితుఁడను, లోకాంతరంబులకుఁ బోవువాఁడ నని విజ్ఞానమయకోశనిష్ఠమైన ధర్మంబు లాత్మయందు, ఆత్మధర్మంబులైన సచ్చిదానందంబులు బుద్ధిని లెస్సగాఁ దోఁచుచున్నవని విజ్ఞానమయ కోశంబునందును తోఁచుచున్నది గనుక విజ్ఞానమయకోశంబునకును ఆత్మకు నన్యోన్యాధ్యాసముచేత కూటమి వచ్చినది.

ఆనందమయకోశంబునకును ఆత్మకును కూటమి యెట్లు వచ్చిన దనిన; నేను భోక్తను, అసంతుష్టుడను, సుఖిని, సాత్వికుఁడను, రాజసుఁడను; తామసుఁడను, అజ్ఞుఁడను, మూఢుఁడను, భ్రాంతుఁడ నను నివి మొదలగు నానందమయకోశధర్మంబు లాత్మయందును, ఆత్మధర్మంబులగు సచ్చిదానందంబులు జ్ఞానము లెస్సగాఁ దోఁచుచున్నదని ఆనందమయకోశనిష్ఠముగాఁ దోఁచుచున్నది. కాఁబట్టి ఆనందమయకోశంబునకును ఆత్మకును అన్యోన్యాధ్యాసముచేత కూటమి వచ్చినది. ఈ అధ్యాసముచేత ఆత్మకు పంచకోశములతో కూటమి వచ్చెను గనుక పంచకోశములకంటె నాత్మను పృథక్కరించి యెఱుఁగవలసివచ్చెను, అయితే పంచేంద్రియక్రమం బెట్లనిన; దృష్టాంతపూర్వకముగా నెఱింగించుచున్నారము.

నా యావు, నా దూడ, నా భార్య, నాపుత్రుఁడు అని తన్ను సంబంధించుకొని తోఁచు పశ్వాదులు తా నెటుల కాఁడో అటులనే దార్ష్టాంతికమందును నాశరీరము నాప్రాణము నామనసు నాబుద్ధి యని

తన్ను సంబంధించుకొని తోఁచు పంచకోశంబులును తాను కాఁడు. పంచకోశంబులకంటె వ్యతిరిక్తుండనే యెఱుఁగవచ్చును. దృష్టాంతమందు ఆవు బలిసియున్నది. దూడ చిక్కిపోయినది. కోడె బ్రతుకదు. కుమారుఁడు చెప్పినట్లు వినలేదు. భార్య యింటికి స్వతంత్రురాలైనను బిడ్డలు లేనిది. నా యర్థము నెవ్వరికిని సెలవుసేయకుము అని తనకు హితమైన కార్యము లొకటియును సేయలేదు. కొమార్తె మిక్కిలి మూఢురాలై యున్నది. నా కుమారుఁడు దుర్బుద్ధియైయున్నాఁడు అను నివి మొదలైన పశ్వాదినిష్ఠవికారములును విషయములును తన్ను ఎటుల స్పృశింపలేవో అటుల దార్ష్టాంతికమందును అన్నమయకోశనిష్ఠమైన జీవత్వ మానుషత్వాదివికారంబులును ప్రాణమయకోశనిష్ఠమైన క్షుత్పిపాసాదివికారంబులును మనోమయనిష్ఠమైన సంకల్పాదివికారంబులును విజ్ఞానమయకోశనిష్ఠమైన కర్తృత్వాదివికారంబులును ఆనందమయకోశనిష్ఠమైన భోక్తృత్వాదివికారంబులును పంచకోశవ్యతిరిక్తుఁడును సాక్షియునైన తన్ను (ఆత్మను) కాలత్రయంబునందును స్పృశింపలేవు. ఇటుల ప్రత్యేకించి యెఱుఁగునది పంచకోశవ్యతిరిక్తజ్ఞానము.

పంచకోశవ్యతిరిక్తజ్ఞానము రావచ్చునా యనిన; రావచ్చును. ఎటువలె రావచ్చుననిన; అధ్యయనకాలంబునందు అధ్యయనము చేయు పురుషులచేత ఉచ్చరింపఁబడి కూడుకొని పుట్టిన శబ్దంబులను పంచుటకు వశము గాకున్నప్పటికిని విచారించి వివేకయుక్తమైన బుద్ధిచేతను 'ఇది దీనిశబ్దము, ఇది దీనిశబ్దము' అని యెటుల యెఱుంగుచున్నాఁడో, జలముతో కూడుకొనియుండెడి ఉష్ణత్వమును తనచేత పంచుటకు వశము గాకపోయినప్పటికిని త్వగింద్రియముచేత స్పృశించి వివేకయుక్తమైన బుద్ధిచేతను జలంబును ఉష్ణత్వంబును ప్రత్యేకంబుగా నెటుల యెఱుంగుచున్నాఁడో, గోడయందు వ్రాయఁబడిన చిత్రపువులోని నీలపీతాది రూపంబులను పంచుటకు శక్యము గాకపోయినను చక్షురింద్రియముచేత చూచి వివేకయుక్తమయిన బుద్ధిచేత ఇది గోడయనియు, దీనియందుండెడి చిత్రరూపములు నీలపీతాదు లనియు నెటువలె నెఱుంగుచున్నాఁడో, జలముతోఁగూడుకొనియుండెడి ఉప్పు, పులుసు తీపు మొదలయిన రసములను పంచుటకు శక్యముగాకపోయినను రసనేంద్రియంబు

వలన ననుభవించి వివేకయుక్తమయిన బుద్ధిచేత ఇది ఉప్పు. ఇది పులుసు, ఇది తీపు, ఇది వగరు, ఇది చేదు; ఇది కారము అని ప్రత్యేకంబుగా నెటుల యెఱుఁగుచున్నాఁడో, వస్త్రము నాశ్రయించుకొని యుండెడి గంధవిశేషములను పంచుటకు శక్యము గాకపోయినప్పటికిని ఘ్రాణేంద్రియముచేత నాఘ్రాణముచేసి వివేకశీలమయిన బుద్ధిచేత నిది సుగంధమిది దుర్గంధమని గంధవిశేషములను ప్రత్యేకంబుగ నెటు లెఱుఁగుచున్నాఁడో, అటులనే దార్ష్టాంతికమందును పంచకోశంబుల నున్న వానితోఁ గూడుకొనియుండెడి ఆత్మను పంచుటకు శక్యముగాక పోయినప్పటికిని వివేకయుక్తం బగు బుద్ధిచేత పంచకోశస్వరూపంబు లిట్టివనియు ఆత్మస్వరూప మిట్టిదనియు విచారించినయెడల పంచకోశంబులతోడ ఆత్మకు కాలత్రయంబులయందును సంబంధంబు లేదని ప్రత్యేకంబుగా విభజించి యెఱుఁగవచ్చును.

ఇంతపర్యంతంబును వ్యవహారకాలంబునందు పంచకోశంబుల నొక్కొక్కవస్తువుగాఁ బెట్టుకొని ఆత్మను పంచకోశంబులకంటె వ్యతిరిక్తుఁ డని వివేకించి యెఱిఁగెడి ప్రకారమును చెప్పితిమి. వస్తుతః విచారించినప్పుడు రజ్జ్వాదులయం దారోపింపఁ బడిన సర్పాదులు రజ్జ్వాదివ్యతిరిక్తంబుగా నెట్లో, అటులనే ఆత్మయం దారోపింపఁబడిన పంచకోశంబులును అధిష్ఠానంబగు ఆత్మకంటె వ్యతిరిక్తముగా లేవు. అయినచో నీదృష్టాంతమందు రజ్జ్వాదజ్ఞానము వచ్చినతర్వాత సర్పాదిప్రతీతి యెటుల లేదో అటులనె దార్ష్టాంతికంబునందును ఆత్మజ్ఞానము వచ్చినతర్వాత ఆత్మపంచకోశములయొక్క ప్రతీతి రాకపోవలెను. అటుల రాలేదు గనుక ఆరోపితంబులగు పంచకోశంబులు నధిష్ఠానమయిన ఆత్మకంటె వ్యతిరిక్తంబుగ లేవనుట బుద్ధి కెటువలె ద్రఢిమ కలుగుననిన; కలుగును. అది యెట్లనిన; మరుమరిచికలయందు జలభ్రాంతి వచ్చినవెనుక ఆజలమందు పానాది క్రియలను చేయవలె నని వర్తించిన పురుషుఁడు విచారించి ఇది జలముగాదు, మరుమరీచిక లని తెలియక భ్రమగొంటి నని మరుమరీచికాజ్ఞానము వచ్చినతర్వాత తిరుగా జలప్రతితి యెటుల వచ్చునో, అటులనే ఆత్మయం దారోపింపఁబడిన పంచకోశంబులు నధిష్ఠానమయిన యాత్మకంటె వేఱుగా లేదని యెఱింగినప్ప

టికిని తిరుగా పంచకోశములయొక్క ప్రతీతి రావచ్చును. అయినచో దృష్టాంతమయిన మరుమరీచికలయందు జలప్రతీతి మాత్రమే కాని పానస్నానాదిక్రియలుసేయుట కానమే. దార్ష్టాంతికమందైన అధిష్ఠానమైన యాత్మకంటె వేఱుగా పంచకోశములు లేవని యెఱిఁగిన తర్వాత పంచకోశములయొక్క ప్రతీతియు వ్యవహారంబును వచ్చుచున్నదే, రావచ్చునాయనిన; రావచ్చును. అది యెట్లనిన; మృత్తునం దారోపింపఁబడిన ఘటశరావాదులు మృద్వ్యతిరిక్తంబుగా లేవని యెఱిఁగినప్పటికిని ఆఘటశరావాదులయొక్క ప్రతీతియును వ్యవహారంబును ఎటుల వచ్చుచున్నదో స్వర్ణంబునం దారోపింపఁబడిన కటకమకుటాదులు స్వర్ణవ్యతిరిక్తంబుగా లేవని యెఱిఁగినప్పటికిని ఆకటకమకుటాదులయొక్క ప్రతీతియును వ్యవహారంబును ఎటుల వచ్చునో అటులనే ఆత్మయందారోపింపఁబడిన పంచకోశములును అధిష్ఠానమయిన ఆత్మకంటె వ్యతిరిక్తముగా లేవని యెఱిఁగినప్పటికిని పంచకోశములయొక్క ప్రతీతియును వ్యవహారంబును రావచ్చును. అయినను ఈదృష్టాంతమందు ఘటాదులు తోఁచుచు వ్యవహారంబునకు వచ్చినప్పటికిని సూక్ష్మబుద్ధిగలవానికి మృద్వ్యతిరిక్తముగా ఘటాదులు లేవని యెటుల బుద్ధియందు దృఢమగుచున్నదో అటులనే దార్ష్టాంతికమందును పంచకోశములు తోఁచుచు వ్యవహారమునకు వచ్చినప్పటికిని సూక్ష్మబుద్ధియైనవానికి ఆత్మవ్యతిరిక్తముగా పంచకోశములు లేవని బుద్ధియందు దృఢపడవచ్చును. ఇటు లెఱుఁగుటయే పంచకోశవ్యతిరిక్తత్వజ్ఞానము. ఈ విచారమునకు ఫలం బేమనిన; ఆత్మ అవస్థాత్రయంబునందు ననుస్యూతుఁడై యున్నాఁడు, పంచకోశంబు లవస్థాత్రయంబులయం దెందును అనుస్యూతములయి యుండ లేదు, కాఁబట్టి వ్యావృత్తములయిన పంచకోశములు తోఁచుచు వ్యవహారములకు వచ్చినప్పటికిని ఈపంచకోశములు ఆత్మవ్యతిరిక్తముగా లేవనుటయే యీవిచారమునకు ఫలము. ఈప్రకారమున పంచకోశములను ఆత్మను భిన్నములుగా విచారించి పంచకోశములు తోఁచినప్పటికిని ఆత్మవ్యతిరిక్తముగా లేవని యెవఁ డెఱుఁగుచున్నాఁడో, వాఁడే కృతార్థుండును, విద్వాంసుండును, జీవన్ముక్తుండును, బ్రహ్మము నని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

శ్లో. శుక్లశోణితసంభూత దేహోఽన్నమయ ఉచ్యతే,
ప్రాణాదిపంచకం ప్రాణమయః కర్మేంద్రియై ర్యుతమ్.
జ్ఞానేంద్రియైః కర్మో యుక్తం మనోమయ ఇతీరితః,
బుద్ధి జ్ఞానేంద్రియై ర్యుక్తం విజ్ఞానమయకోశకమ్.
ప్రియాదియుక్త మజ్ఞాన మానందమయ ఉచ్యతే,
ఏతేభ్యో వ్యతిరిక్తోఽయ మాత్మా సర్వాంతరత్వతః.
కోశాశ్చైతే హ్యనాత్మానో మహాత్మో విషయత్వతః,
ధేనుతద్వత్సపుత్రస్త్రీ కన్యావయ ఇవానిశమ్.
మృదారోపితకుంభాద్యా భాతా అపి న తత్పృథక్,
ఆత్మన్యారోపితాః కోశాః భాతా అపి పృథఙ్మహీ.
ఏవం కోశాతిరిక్తత్వం స్వాత్మనో యో విబుధ్యతి,
స సంసారీ వభాతోఽపి పరంబ్రహ్మైవ నాన్యథా.

ఇది దశమవర్ణకము.

---

# ఏకాదశ వర్ణకము

## సచ్చిదానందస్వరూప వివేచన ప్రకరణము

శ్లో. కిమస్యసత్స్వరూపత్వం చిద్రూపత్వం కిమాత్మనః,
కిం వానందస్వరూపత్వమిత్యేతచ్చింత్యతే స్ఫుటమ్.

ఆత్మ సచ్చిదానందస్వరూపుఁడని శ్రుతులు చెప్పుచున్నవి గనుక ఆ సచ్చిదానందస్వరూపములను వివరింపుచున్నారము. సద్రూపమనఁగా, ఏ వస్తువు దేనిచేతను బాధింపఁబడక కాలత్రయంబునందు నేకరూపమై యుండునదో ఆ వస్తువు సద్రూపము. ఈ సద్రూప మాత్మయందున్నదా? యనిన; ఆత్మ కాలత్రయంబునందు దేనిచేతను బాధింపఁబడకయున్నాఁడు గనుక ఆత్మయందు సద్రూపత్వ మున్నది. ఆత్మ కాలత్రయంబునందు నున్నాఁడనుటకు ప్రమాణం బేమి యనిన; సర్వజనులయొక్క యనుభవమే ప్రమాణము.

సర్వజను లనఁగా నెవ్వరనిన; దరిద్రుఁడు, ధనాఢ్యుఁడు, కర్మి, భక్తుఁడు, ముముక్షువు అనువారలు. వీరలయొక్క అనుభవము చెప్పెదము. దరిద్రుఁడు నేను జన్మాంతరంబునం దెవ్వరికి నేమియు నిచ్చినవాఁడను కాను గనుక నీ జన్మంబునందును దారిద్ర్యమే యనుభవించుచున్నాను. ఈ జన్మంబునందును నొకనికైన నేమియు నిచ్చుటకు శక్తిలేనివాఁడ నైయున్నాను. ఇందువలన నింకొకజన్మమునకును దరిద్రుఁడనై పుట్టుదు ననెడి దరిద్రునియొక్క వాక్యముచేతను, ధనాఢ్యుఁడు నేను జన్మాంతరంబునందు పెద్దలైనవారలకు దానముచేసియున్నందున ఈ జన్మంబున ధనాఢ్యుఁడనైయున్నాను. ఈ జన్మంబునం దెవ్వరికేనియు నేమేనియు నిచ్చినంగదా యింకొకజన్మంబునను కలిమి గలవాఁడనై పుట్టుదు ననెడి ధనాఢ్యునియొక్క మాటచేతను, కర్మియైనవాఁడు నే ననేకజన్మములయందు సత్కర్మము నే చేసియున్నాఁడను. ఈసత్కర్మముచేత తనకు పరలోకసౌఖ్యము కల దనెడు కర్మియొక్క పలుకులచేతను, భక్తుఁడు నే ననేకజన్మములయందు భగవంతు నుపాసించినవాఁడ నగుటచేత నా యుపాసనావిశేషమువలన నీ జన్మంబునందును తనకు నిరతిశయమైన భక్తి గలిగెను. ఈ భక్తిచేతను తనకు భగవత్సాన్నిధ్యము కలుగు ననెడి భక్తునియొక్క వార్తచేతను, ముముక్షువు నే ననేకజన్మసంసిద్ధుఁడను. ఈశ్వరార్పణముగా నే సమస్తకర్మములను చేసినవాఁడను. కాఁబట్టి తనకీజన్మంబునందు చిత్తశుద్ధియు, సద్గురులాభంబును, శ్రవణాదులును కలిగెను. నేను కృతార్థుఁడనై తిని. ఇఁక మీఁద తనకు జన్మములు లేవని పలికెడి ముముక్షువుయొక్క వాక్యముచేతను, తటస్థుఁడైన వివేకికి ఆత్మ కాలత్రయమునందు నున్నాఁడనెడి యనుభవము సిద్ధించెను. సమస్తజనులు ని య్యైదుగురిలో నంతర్భూతులు గనుక ని య్యైదుగురియొక్క అనుభవముచేతను ఆత్మకు సద్రూపత్వము సిద్ధించెను. మనముగూడ ని య్యైదుగురలో నంతర్భూతులము. కనుక మనకును సద్రూపత్వము సిద్ధించెను. అనుభవమునకుమాత్రము సద్రూపత్వము సిద్ధించె నిం లయే కాని యుక్తిచేతను సద్రూపత్వము సిద్ధింపలేదు గదా యనిన; మనము కాలత్రయంబునందున్నాము గనుక యుక్తిచేతను మనకు సద్రూపత్వము సిద్ధించెను.

ఇందుకు దృష్టాంతము:—మనమిప్పుడున్నామో, లేదో యనిన; ఉన్నాము అయిన శరీరులమైయున్నామో, లేక అశరీరులమైయున్నామో యనిన; అశరీరులమైయున్న, వ్యవహారముకూడదు గనుక మన మిప్పుడు ప్రత్యక్షముగా వ్యవహారము చేయుచున్నాము గనుక శరీరులమైయున్నాము. మన కీశరీర మెందుచేత వచ్చినదనిన; కర్మచేత వచ్చినది. ఎవరు చేసినకర్మవలన వచ్చినదనిన; తాను చేసిన కర్మమువలన వచ్చినది. అన్యులు చేసిన కర్మముచేత వచ్చినదని చెప్పరాదనిన; అన్యులు చేసిన అగ్నిష్టోమాదులఫలములు తనకు రావలెను. అట్లు రాలేదు. కాబట్టి అన్యులు చేసిన కర్మమువలన తనకు శరీరము వచ్చినదని చెప్పఁగూడదు. తాను చేసినకర్మమువలననే తనకు శరీరము వచ్చినదని చెప్పవలెను. అయితే యీజన్మమునందుచేసిన కర్మమువలననా? లేక జన్మాంతరంబునఁ జేసిన కర్మమువలననా? తనకు శరీరము వచ్చిన దనిన; ఈ జన్మమందుఁ జేసిన కర్మమువలన శరీరము వచ్చినదని చెప్పఁగూడదు. ఎందువలన ననిన; వృక్షనిష్ఠమైన బీజము తనకు కారణమైన వృక్షంబు నెటుల పుట్టింపనేరదో అటులనే యీ శరీరమువలననే చేయఁబడిన కర్మ పశ్చాద్భావమైయున్నది గనుక తనకు ఆశ్రయమై పూర్వభావియైన శరీరమును బుట్టింపనేరదు గనుక ఈ జన్మమందుఁ జేసిన కర్మచేత శరీరము వచ్చినదని చెప్పఁగూడదు. జన్మాంతరమందు తాను జేసిన కర్మచేతనే శరీరము వచ్చినదని చెప్పవలెను. అయితే, జన్మాంతరమందు శరీరులమై యుండి కర్మమునొనర్చితిమో, లేక అశరీరులమైయుండి కర్మము నొనర్చితిమో యనిన; అశరీరులమైయుండి కర్మచేయఁగూడదు గనుక సశరీరులమైయుండే కర్మచేసితిమి. ఆశరీర మెందుచేత వచ్చినదనిన; దానికి పూర్వజన్మమందు చేసిన కర్మచేత వచ్చినది. ఈ యుక్తివలన మన మనేకకోటి కల్పంబులయందు శరీరులమైయుండి అనేకకోటికర్మంబులను చేయుచు, నాయా కర్మములవలన ననేకశరీరములను పరిగ్రహింపుచు, నాయా శరీరనిష్ఠమైన సుఖదుఃఖముల ననుభవింపుచు, అనేకకోటికల్పముల యందు శరీరులమై యుండినటుల నూహింపఁబడుచున్నారము గనుక యుక్తిచేతను మనము భూతకాలమందును వర్తమానకాలమందును ఉన్నామనుట సిద్ధించెను. అయితే, మనకు యుక్తిచేత భవిష్యత్కాల

మందు విద్యమానత్వ మెటుల ననిన; ఇప్పుడు మనము శ్రవణ మనన నిదిధ్యాసముల చేతను, జ్ఞానము సంపాదింపక పోయినట్టయిన పూర్వజన్మ మందుఁ జేసియున్న కర్మములకు ఫలభూతమైన యీ జన్మము వచ్చి నటుల నీ జన్మంబునం దీశరీరముచేతఁ జేయఁబడిన కర్మములకు ఫల భూతంబులగు ననేకశరీరంబు లికమీఁదను వచ్చును. వర్తమానకాలం బునం దీశరీరపరిగ్రహముచే బహువిధంబులగు కర్మంబుల నెటుల చేయు చున్నారమో అటులే భవిష్యత్కాలమందును శరీరపరిగ్రహమువలన బహువిధములైన కర్మలను జేయఁబోవుచున్నారము. తత్కర్మంబులకు ఫల భూతంబులగు ననేకశరీరంబులును మనకు రాఁబోవుచున్నవి. ఆ శరీరపరి గ్రహమువలన ననేకవిధంబులగు కర్మలను జేయుచు నాకర్మఫలభూతంబు లైన సుఖదుఃఖంబుల ననుభవింపుచు ననేకకోటికల్పంబు లుండఁబోవు చున్నారమని యుక్తిచేత నూహింపఁబడుచున్నారము. కనుక కాల త్రయంబునందు మనము ఉన్నామనుట యుక్తిచేతను సిద్ధించెను. ప్రళ యంబునందు జగత్తు బాధింపఁబడినప్పటికిని మనము బాధింపఁబడ లేదు గనుక మన మొకదానిచేతను బాధింపఁబడకున్నారమనుట సిద్ధించెను. మనకు నుత్పత్తి మొదలైన వికారంబులు లేవు గాన నేకరూపత్వంబును సిద్ధించెను. ఈ చెప్పఁబడిన సల్లక్షణంబులు మనయందు నున్నవి. కాఁబట్టి మనకు సద్రూపత్వము సిద్ధించెను.

ఆత్మకు చిద్రూపత్వ మెటువలె ననిన; ఏవస్తువైతే సాధనాంత రంబును నపేక్షింపక తాను తోఁచుచుఁ దనయం దారోపింపఁబడిన సమస్త పదార్థంబులం దోఁపింపఁజేయుచున్నదో, అది చిత్తని చెప్పఁబడును. ఏ సాధనాంతరంబు నపేక్షింపక తాను తోఁచుచుఁ దనయం దారో పింపఁబడిన సమస్తపదార్థంబులను తోఁపింపఁజేయుట యనెడి చిద్రూపత్వ మాత్మయం దున్నదా? యనిన; ఉన్నది. అది యెటువలెననిన; మనచేత బాల్యము మొదలుకొని యేతావత్పర్యంతంబు నేయే వ్యాపారంబులు సేయఁబడెనో ఆయా వ్యాపారములలోపల కొన్ని తోఁపక పోయినప్పటి కిని, తక్కిన వ్యాపారములు ప్రకాశసాధనములైన ఆదిత్య, చంద్ర, నక్షత్ర, విద్యుచ్ఛత్రుస్సులలోపల నొకసాధనంబు నపేక్షింపక యే గాఢాంధ కారంబునందు ముసుఁగుఁబెట్టుకొని పండుకొనియుండినప్పటికిని మన

కందఱికిని తోఁచుచున్నది గనుక ఆత్మస్వరూపులమైన మనయందు చిద్రూపత్వంబున్నది. అయితే బాల్యము మొదలుకొని యేతావత్పర్యంతంబును మనయం దారోపింపఁబడిన సమస్తపదార్థములలో కొన్ని పదార్థములు మాత్రమే కదా తోఁచుచున్నవి. మనయం దారోపింపఁబడిన చిద్రూపత్వము మనకు నెటులగూడుననిన; కూడును. అది యెటులవలె ననఁగా, ఆంతర ప్రపంచంబును, బాహ్య ప్రపంచంబును, సర్వపదార్థములని చెప్పఁబడును. ఈ ప్రపంచద్వయంబును మన చేత తోఁపింపఁబడు చున్నది. బాహ్య ప్రపంచము మన చేత నెటుల తోఁపింపఁబడుచున్నదనిన; పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులనియు, శబ్దస్పర్శరూపరసగంధంబులనియు, పంచీకృతభూతంబు లనియు, అపంచీకృతభూతంబు లనియు, బ్రహ్మాండమనియు, చతుర్దశభువనంబులనియు, చతుర్విధభూతగ్రామంబులనియు, వీనికి కారణంబగు మాయయనియు, వివిధనామరూపగుణదోషవికారధర్మశక్త్యాశ్రయమైన బాహ్యప్రపంచమంతియును మనచేత నెఱుఁగఁబడుచున్నదో, లేక బాహ్యప్రపంచము చేత మన మెఱుఁగఁబడుచున్నామో యనిన; బాహ్యప్రపంచంబువలన మన మెఱుఁగఁబడలేదు గనుకను మనచేతనే బాహ్యమైన సమస్తప్రపంచంబును నెఱుఁగఁబడుచున్నది గనుకను బాహ్యప్రపంచంబు నెఱుఁగుచునుండెడి మనకు బాహ్యమైన సర్వపదార్థావభాసకత్వము సిద్ధించెను. ఆంతరప్రపంచము మనచేత నెటుల తోఁపింపఁజేయఁబడుచున్నదనిన; అజ్ఞానమనియు, నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయకోశంబులనియును, స్థూలసూక్ష్మకారణశరీరంబులనియును, షడ్భావవికారంబులనియును, షట్కోశంబులనియును, షడూర్ములనియును, జ్ఞానేంద్రియంబులనియును, కర్మేంద్రియంబులనియును, ప్రాణపంచకమనియును, అంతఃకరణచతుష్టయమనియును, సంకల్పాధ్యవసాయాభిమానావధారణాలనియును, జాగ్రత్స్వప్నసుషుప్తులనియును, అవస్థావ్యాపారంబులనియును, అవస్థాభాసులనియును, సమాధిమార్గములనియును, మనోవాక్కాయంబులనియును, కామక్రోధలోభమోహమదమాత్సర్యంబు లనియును, నిత్యానిత్యవస్తువివేక మనియును, ఇహాముత్రార్థఫలభోగవిరాగమనియును, శమాదిషట్కసంపత్తియనియును,

ముముక్షుత్వ మనియును, సాత్త్వికతామసరాజసగుణంబు లనియును, సుఖదుఃఖంబు లనియును, జ్ఞానాజ్ఞానంబు లనియును, పంచక్లేశంబు లనియును, మైత్రీకరుణాముదితోపేక్షలనియును, యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధ్యష్టాంగ యోగంబు లనియును, ప్రత్యక్షానుమానోపమానశబ్దాద్యుపలబ్ధంబు లనియును, రోగంబు లనియును, ఆరోగ్యంబులనియును వివిధనామరూపగుణ ధర్మవికార శక్త్యాశ్రయమైన యాంతర ప్రపంచమంతయు మనచేత నెఱుఁగఁబడుచున్నదో, లేక ఆ యాంతర ప్రపంచముచేత మన మెఱుఁగఁబడుచున్నామో అనిన; ఆ యాంతర ప్రపంచంబుచేత మన మెఱుఁగఁబడలేదు గనుకను మనచేతనే యాంతరమైన సమస్తప్రపంచంబు నెఱుఁగఁబడుచున్నది గనుకను ఆ యాంతర ప్రపంచంబు నెఱుఁగుచునుండెడి మనకు ఆంతరమైన సర్వపదార్థావభాసకత్వంబు సిద్ధించెను. అందువలన, మనయందారోపింపఁబడిన సర్వపదార్థావభాసకత్వము సాధనాంతరము నపేక్షింపకయే మనకు సిద్ధించియున్నది. అయితే, మనస్సుచేతఁగదా సర్వంబు నెఱుఁగఁబడుచున్నది. మనము మనస్సుచేతనే కదా యెఱుఁగఁబడుచున్నాము గనుక సాధనాంతర నిరపేక్షమై స్వప్రకాశత్వంబును సర్వపదార్థావభాసకత్వంబును మనకెటుల కూడుననిన; మనస్సువృత్తివినాశవత్తై సావయవమై పరిచ్ఛిన్నమై దృశ్యమై ఘటంబుచందంబున భూతకార్యమై యున్నది గనుక ఆ మనస్సునకు జడత్వమే కాని చేతనత్వము లేదు. కాఁబట్టి ఆ జడమైన మనస్సు ఒక పదార్థంబును దోఁపింపనేరదు. ఆత్మచేత తోఁపింపఁబడెడి మనస్సు ఆత్మను తోఁపింపనేరదనుట చెప్పవలసినది లేదు. అది యెటులనిన; ఆత్మ తానయ్యే మనస్సును సమస్తపదార్థములను తోఁపింపుచున్నాఁడు. ఇటుల తోఁపించుటయందు మనస్సు ఉపాధిమాత్రము.

ఇందుకు దృష్టాంతము :— స్థాలియందు తైలంబువలనఁ దడుపఁబడిన వత్తి తానునుం దోఁపక తైలాదులను నెటుల తోఁపింపలేదో, అగ్నితేజస్సైనతే వత్తి యను నుపాధితోఁ గూడుకొని తాను సాధనాంతరంబు నపేక్షింపక విశేషంబుగాఁ దోఁచుచు ఆ వత్తిని తైలమును స్థాలిని సమీపపదార్థంబులను నెటుల తోఁపింపుచున్నదో, అటుల స్థాలి

స్థానమైన స్థూలశరీరమందు తైలస్థానమైన కర్మంబుచేత నుత్థాపితమై వత్తిస్థానమైన మనస్సు తోపనేరక యుండుకొని అన్యపదార్థంబులను తోపింపనేరదు. ఆత్మయైతే, యా మనస్సుతోఁ గూడుకొని తాను సాధనాంతరంబు నపేక్షింపక విశేషంబుగాఁ దోఁచుచు మనస్సును దేహేంద్రియాదు లను బాహ్యాంతరంబు లగు సర్వపదార్థంబు లను తోపింపఁజేయుచున్నది. అంతరమైన అంతఃకరణంబును, అంతఃకరణ వృత్తులను ఎఱుంగుటయందు ఆత్మ నిరుపాధికుఁడై యెఱుఁగుచున్నాఁడు. ఆ యాత్మస్వరూపమే మనము గనుక సాధనాంతరనిరపేక్షమై స్వయం ప్రకాశమానమైన సర్వపదార్థావభాసకత్వము మనకు సిద్ధించెను.

ఆత్మకు ఆనందస్వరూపమెటు లనిన; నిత్యమై నిరుపాధికమై నిరతిశయమైన సుఖస్వరూపత్వం బానందస్వరూపత్వము. స్రక్చందనాదుల వలన బుద్ధికి సర్వోత్కృష్టమై సర్వదుఃఖనివర్తకమై నిత్యమైన సుఖమానందము. ఏ యానందంబు సమస్తమైనవారిచేతను సుషుప్తికాలమందనుభవింపఁబడుచున్నదో, ఆయానందమం దీలక్షణంబున్నది. అయితే, సుషుప్తికాలమం దానందంబుగలిగినట్లాయెనా ? ఆ యానందమం దీలక్షణము కలదని చెప్పవచ్చును, దుఃఖాభావము మాత్రము వినాగా ఆనందంబు లేదనెడి యానందంబునకు నిరుపాధికత్వంబును నిరతిశయసుఖస్వరూపత్వంబు నిత్యత్వంబు ఎటుల రావచ్చు ననిన; సుషుప్తిపురుషుఁడా సుషుప్త్యవస్థయందు సుఖంబు ననుభవింపకపోయినట్లయితే ఆయవస్థనుండి పునరుత్థితుఁడైన తర్వాత నేను సుఖంబుగ నిద్రపోతినని చెప్పక యుండవలయును. దుఃఖసహితుఁడయ్యేయుంటినని చెప్పవలెను. అటుల చెప్పలేదు. కాఁబట్టి సుషుప్త్యవస్థయందు సమస్తమైనవారలచేతను ఒక ఆనందం బనుభవింపఁబడుచున్నది. ఆ యానందమందు నిత్యమై నిరుపాధికమై నిరతిశయమైన సుఖస్వరూపత్వలక్షణంబున్నది. ఆ సుఖంబునకు నిరుపాధికత్వం బెటులనిన; సుఖజనకంబులగు స్రక్చందనాదివిషయంబులు సుషుప్త్యవస్థయందు లేకున్నను సమస్తమైనవారలచేతను సుఖమనుభవింపఁబడుచున్నది గనుక ఆసుఖంబునకు నిరుపాధికత్వంబున్నది. ఆసుఖంబునకు నిరతిశయస్వరూపత్వమెటులనిన సమస్తవిషయజన్యంబులైన సుఖంబులలోపల నుత్కృష్టమైన స్త్రీసంభోగసుఖమందు విరసము

పుట్టి సమస్తప్రాణులును ఆ సుఖమును త్యజించి ప్రతిదినంబున సుషుప్తి సుఖమును బొందుచున్నారు గనుకను, ఆ సుఖమునకు విఘ్నము చేసిన వారలను శిక్షింపుచున్నారు గనుకను, ఇంతమాత్రమే కాదు. జాగ్రత్స్వప్నములయందు తోంచుచున్నట్టి ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములైన సమస్తదుఃఖములను బోంగొట్టుచున్నవి గనుకను, ఆ సుషుప్తిసుఖమునకు నిరతిశయత్వమున్నది ఆ సుషుప్తిసుఖమునకు నిత్యత్వమెటువలె ననిన; జాగ్రత్స్వప్నములయందు దనుభవింపఁబడిన సమస్తవిషయసుఖములును ఎటు లనేకరూపములై యనుభవింపఁబడుచున్నవో అటులనే ఈ సుషుప్తిసుఖంబును అనేకరూపంబులుగా ననుభవింపఁబడక ప్రతి సుషుప్తియందును నేకరూపంబుగా ననుభవింపఁబడుచున్నది. కనుక ఆ సుషుప్తిసుఖమునకు నిత్యత్వంబున్నది. అయినను ఈ సుషుప్తిసుఖము నిత్యత్వమైనచో జాగ్రత్స్వప్నంబులయందునుం దోంచవలయు. అటుల తోంచనిచో, నా సుషుప్తిసుఖంబునకు నిత్యత్వ మెటుల చెప్పెడి దనిన; చెప్పవచ్చును. అది యెట్లనిన; సుషుప్తిసుఖము నిత్యమైయున్నప్పటికిని దుఃఖరూపమైన దేహేంద్రియాది సంపర్కమువలన నా సుషుప్తిసుఖము తిరోహితమైయున్నది. కనుక తోంచలేదు. ఆత్మకార్యంబులగు దేహేంద్రియాదులచేత కారణభూతమైన ఆత్మసుఖమునకు తిరోధాన మెటుల కూడును. ఎట్లనిన; అగ్నికి ప్రకాశము స్వతస్సిద్ధమైయున్నప్పటికి స్వకార్యమైన ధూమసంపర్కముచేత నా ప్రకాశంబున కెటుల తిరోధానత్వము వచ్చుచున్నదో, మఱియు నాదిత్యునకు ప్రకాశత్వము స్వతస్సిద్ధమైయున్నప్పటికిని స్వకార్యమైన మేఘపటముదాయముచేత నాయాదిత్య ప్రకాశత్వమునకు నెటుల తిరోధానత్వము వచ్చుచున్నదో అటులే ఆత్మకును సర్వదా సుఖస్వరూపత్వము స్వతస్సిద్ధమైయున్నప్పటికిని ఆత్మకార్యంబులైన దేహేంద్రియాదులసంపర్కంబువలన జాగ్రత్స్వప్నంబులయందు ఆ సుఖంబునకు తిరోధానత్వము కూడును. బహిర్ముఖుడైనవాని కీసుఖం బాత్మసుఖంబని జాగ్రత్స్వప్నంబులయందు తోంచకున్నప్పటికిని అంతర్ముఖుఁడైనవానికి సర్వదా తోంచును. కాఁబట్టి ఈ సుషుప్తిసుఖము కాలత్రయంబునం దున్నది అందువలననే యీ సుఖంబునకు నిత్యత్వ నిరుపాధికత్వ నిరతిశయ సుఖస్వరూపత్వంబులు

సర్వదా సిద్ధించియున్నవి ఈ విచారంబునకు ఫలమేమనిన; ఈ చెప్పం బడిన సద్రూపత్వ చిద్రూపత్వ ఆనందస్వరూపత్వములు మనయందే సిద్ధించియున్నవి గాన సచ్చిదానందస్వరూపుడైన ఆత్మ మనమే యని దృఢనిశ్చయము కలుగుటయే యీ విచారములకు ఫలము.

శ్లో. కేనాప్యబాధితత్వేన త్రికాలేఽప్యేకరూపతా,
విద్యమానత్వ మస్త్యేత త్తద్రూపత్వం సదాత్మనః.
స్వారోపితాశేషపదార్థభాసక
త్వమాత్మనస్సాధనమంతరేణ యత్,
వదంతి వేదాంతవిదో హితాం స్వయం
ప్రకాశమానస్య తు చిత్స్వరూపతామ్.
నిరుపాధికనిత్యత్వం సుప్తౌ సర్వసుఖాత్పరమ్,
సుఖరూపత్వమస్త్యే తదానందత్వం తదాత్మనః.
ఏవం విశ్చయ్య యో విద్యాత్ సచ్చిదానందరూపతామ్,
స ఏవ వేత్తి యో విద్వాన్ స ముక్తస్స చ పండితః.

ఇది ఏకాదశవర్ణకము.

---

# ద్వాదశ వర్ణకము

## అఖండత్వమననము

శ్లో. అఖండత్వం సదా సచ్చిదానందానాం యథా భవేత్,
భిన్నసద్గుణవద్భానమానానాం వర్ణ్యతే తథా.

పూర్వమం దాత్మకు సచ్చిదానందత్వమును నిరూపించి యిప్పు డాసచ్చిదానందస్వరూపుం డైన యాత్మకు నఖండత్వమును నిరూ పించుచున్నారము. అఖండత్వ మనఁగా, దేశకాలవస్తువులవలన నపరి చ్ఛిన్నత్వము. ఆ యఖండత్వమున కీమూడు విశేషణంబులు నేల చెప్పవలయును, ఒక విశేషణమైనను, లేక రెండువిశేషణములైనను చాలవా? అనిన; చాలవు. ఎందుచేత ననఁగా, ఆత్మకు దేశముచేత నపరిచ్ఛిన్నత్వమే అఖండత్వ మని చెప్పెద మనిన; ఆకాశము వ్యాప కమై యున్నది గాన, నా యాకాశమునకు దేశముచేత నపరిచ్ఛిన్నత్వ

మున్నందున నాకాశంబునకును అఖండత్వము వచ్చును. ఆ యాకాశం బునకు అఖండత్వంబు నిరాకరించుటకొఱకు కాలముచేతను అపరిచ్ఛి న్నత్వ మఖండత్వ మని చెప్పితిమి. ఆ యాకాశమునకు కాలముచేత నపరిచ్ఛిన్నత్వము లేదా ? యనిన; లేదు. అది యెట్లులనఁగా; ఆకా శము ఉత్పత్తినాశవంతమైయున్నది గనుక దానికి కాలముచేత నపరి చ్ఛిన్నత్వము చెప్పఁగూడదు. కాఁబట్టి కాలముచేతను అపరిచ్ఛిన్నత్వ మనెడి రెండవవిశేషణమును కావలెను. అయితే, యీ రెండువిశేష ణములే చాలునని చెప్పెదమనిన; కాలము విభువై యున్నది. కనుక దేశముచేత నపరిచ్ఛిన్నమైయుండుటచేతను, తనచేత తనకు పరిచ్ఛేదము కూడకుండుటచేతను కాలముచేత నపరిచ్ఛిన్నమైయున్నది గనుక దాని కిని అఖండత్వము వచ్చును. కాఁబట్టి కాలమునకు అఖండత్వము నివ ర్తించుటకొఱకు వస్తువుచేతను అపరిచ్ఛిన్నత్వ మనెడి మూఁడవవిశే షణమును కావలెను. కాలమునకు వస్తువుచేత నపరిచ్ఛిన్నత్వము లేదా ? అనిన; కాలము ఆకాశము కాదు గనుక కాలమునకు వస్తువు చేత నపరిచ్ఛిన్నత్వము లేదు. కనుక ఆత్మ వినాగా నా కాలాకాశాదు లకు త్రివిధపరిచ్ఛేదశూన్యరూపమగు నఖండత్వము కూడదు. అయితే 'ఈ దేశమం దున్నాఁడ, నా దేశమందు లే'నని దేశముచేతను, నేను ప్రభవసంవత్సరమందుఁ బుట్టితిని; కొంతకాలమునకు లేకపోవుదు నని కాలముచేతను, నేను పృథివ్యాదులు కానని వస్తువుచేతను పరిచ్ఛి న్నుఁడై తోఁచునట్టి ఆత్మకు త్రివిధపరిచ్ఛేదశూన్యత్వ మెట్టుల కూడు ననిన; కూడును. నేనీ దేశమం దున్నాఁడను, నేనీ కాలమందుంటిని, ఈ వస్తువు-నేను గానని యీ త్రివిధపరిచ్ఛేదములు నధ్యాసముచేతను మూనము నపేక్షించుకొని వచ్చుచున్నది గనుక దేహవ్యతిరిక్తుఁడైన ఆత్మకు దేశకాలవస్తువులచేత నపరిచ్ఛిన్నత్వము కూడును. అయితే, ఆత్మకు దేశముచేత నపరిచ్ఛిన్నత్వ మెట్టులనిన; "ఘటస్సన్, పటస్సన్, కుడ్యం సత్, పృథివీ సతీ, ఆపస్సత్యః, తేజస్సత్, వాయుస్సన్, ఆకా శస్సన్" అని భూతభౌతికమైన సమస్తప్రపంచంబునందును సద్రూపుఁడైన ఆత్మకు అనువృత్తియున్నది గనుకను ఆత్మ వ్యాపకుఁడై యున్నాఁడు గనుకను యీ వ్యాపకుఁడైన ఆత్మకు దేశముచేతను అపరిచ్ఛిన్నత్వ మున్నది. కాలమువలన నపరిచ్ఛిన్నత్వ మెట్టులనిన; ఆత్మ యనాదియై

యున్నాఁడు గనుక, భూతకాలముచేతను నిత్యుఁడై యున్నాఁడు గనుక, భవిష్యత్కాలముచేతను దేహావ్యతిరిక్తుఁడై యున్నాఁడు గనుక, వర్తమానకాలముచేతను ఆత్మకు పరిచ్ఛిన్నత్వము లేదు. ఆత్మకు వస్తువుచేత నపరిచ్ఛిన్నత్వ మెటులనిన; ఆత్మ సర్వాత్మకుఁడై యున్నాఁడు. కనుక, వస్తువుచేతను ఆత్మకు పరిచ్ఛిన్నత్వము లేదు. వస్తువనఁగా; సజాతీయమని విజాతీయమని స్వగతమని మూఁడువిధములై యుండును. ఆ మూఁడువిధములగు సజాతీయ విజాతీయ స్వగతంబు లెవ్వి యనిన; దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నారము. వృక్షంబునకు వృక్షాంతరంబు సజాతీయంబు, శిలాదులు విజాతీయంబులు, పత్రపుష్పఫలాదులు స్వగతము. ఇవి యెటులో అటులే యాత్మకు సజాతీయ విజాతీయ స్వగతంబులు లేవు. ఈమూఁడు లేకుండుటవలన ఆత్మకు సజాతీయ విజాతీయ స్వగతంబులు లేవు. అయితే, "ఘటస్స్ఫుర్, పటస్స్ఫుర్, కుడ్యంసత్, కుసూలస్స్ఫుర్, దేవదత్తాత్మా, చైత్రాత్మా, మైత్రాత్మా" అని సజాతీయ భేదంబును, పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులని ఘటపటకుడ్యకుసూలంబులని విజాతీయభేదంబును, ఇచ్ఛాద్వేషసుఖదుఃఖసత్త్వరజస్తమంబులని స్వగతభేదంబును ఆత్మకు ఉండఁగా సజాతీయ విజాతీయ స్వగత భేదంబులును లేవని యెటుల చెప్పవచ్చుననఁగా; ఆత్మకు సజాతీయ స్వగతభేదంబు లుపాధిచేత వచ్చినవి కాని పరమార్థతః సజాతీయ విజాతీయ స్వగతభేదంబువలన లేవని చెప్పవచ్చును. ఆత్మకు సజాతీయ భేద మెటువలెననఁగా; ఒక ఆకాశమే ఘటమఠకుడ్యకుసూలవనవృక్షాద్యుపాధులచేతను ఘటాకాశమనియు, మఠాకాశమనియు, కుడ్యాకాశమనియు, కుసూలాకాశమనియు ననేకంబులుగా నెటువలె వ్యవహరింపఁబడుచున్నదో, అటువలెనే ఆత్మ ఉచ్చావచంబులైన శరీరోపాధుల చేతను దేవదత్తుఁడనియు, యజ్ఞదత్తుఁడనియు, విష్ణుదత్తుఁడనియు, కృష్ణుఁడనియు, రాముఁడనియు ననేకాత్మలుగాఁ దోఁచుచున్నాఁడు. పరమార్థమును విచారించునపుడు ఆ యాకాశంబునకు సజాతీయభేదంబు లేదు. విజాతీయభేదం బెటువలెననిన; సద్రూపుఁడగు ఆత్మకు విజాతీయంబగు నసత్ప్రపంచము తాను అసత్తై యున్నది గనుక ఆ యసత్తైన ప్రపంచంబువలన ఆత్మకు శశవిషాణవంధ్యాపుత్రగగనారవిందంబులవలె విజాతీయభేదంబు లేదు, స్వగతభేదం బెటువలెననిన; ఇచ్ఛాద్వేషసుఖ

దుఃఖంబులెల్లను అంతఃకరణవిషయమ్మై తోఁచుచున్నవి గావున నాత్మ గుణంబులు గావు. అట్లగుటవలన నాయిచ్ఛాద్వేషాదిగుణంబులచేత సచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మకు స్వగతభేదంబును లేదు.

అయితే భిన్నంబులగు సచ్చిదానందములచేత ఆత్మకు భేదంబు లేదాయనిన; సచ్చిదానందంబు లన్యోన్యభిన్నంబులయ్యేనేని భేదంబును గలదు. అవి యభిన్నము లగుటవలన నా సచ్చిదానందంబులచేత ఆత్మకు భేదంబు లేదు. సత్తనియును, చిత్తనియును, ఆనందమనియును, శబ్దభేదం బును, అర్థభేదంబు నున్నవి గనుకను, హస్తకరపాణి శబ్దంబులవలె పర్యాయశబ్దంబులు గావు గనుకను, మఱియును లోహితోష్ణప్రకాశం బులు దీపంబునకువలె స్వరూపంబులై యున్నవి గనుకను. ఈ లోహి తోష్ణప్రకాశంబు లెటుల పరస్పరభిన్నంబులు గావో, అటులే సచ్చిదా నందంబులు శబ్దార్థంబులవలన భిన్నంబులవలె వ్యవహరింపఁబడినప్పటి కిని ఆత్మకు స్వరూపంబై యున్నవి గనుక సచ్చిదానందంబులకు పరస్పర భేదంబు లేదు. ఈ సచ్చిదానందంబులకు భేదంబు లేదేని, శ్రుతి ఆత్మ సద్రూపుఁడనిమాత్రమే చెప్పవలెను. అటులు చెప్పక చిద్రూపుఁడనియు ఆనందరూపుఁడనియు నెందుకుఁ జెప్పెను? భేదము లేకున్న నటువలె చెప్పునా? యనిన; చెప్పును. అది యెటువలె ననఁగా; ఆత్మనిష్ఠంబగు నానందము దుఃఖరూపమైన పుత్త్రాదినిష్ఠముగాఁ దోఁచి, జగన్నిష్ఠంబగు నసద్రూపత్వంబును బుద్ధ్యాదినిష్ఠంబగు జడరూపత్వంబును పుత్త్రభార్యాది నిష్ఠంబగు దుఃఖరూపత్వంబును నేను చచ్చిపోవుచున్నాఁడను నేను దుఃఖి నని యాత్మనిష్ఠమై తోఁచుచున్నది. కాఁబట్టి ఆ విపరీతభ్రాంతిని పోఁ గొట్టుటకై ఆత్మ సద్రూపుఁడు చిద్రూపుఁడు ఆనందరూపుఁడని చెప్పు టయే కాని ఆత్మరూపంబులగు సచ్చిదానందంబుల కన్యోన్యభేదము చెప్పుటయందు శ్రుతికి తాత్పర్యము లేదు. ఇంతమాత్రమే కాదు. ఈ ముందు చెప్పఁబడిన విపరీతార్థవాదులైనవార లాత్మ జడస్వరూపుఁడని యంగీకరించి అతనికి సత్తు ధర్మమనియును చిత్సుఖంబులు గుణంబు లనియునుం జెప్పిరి గావున నా మతమునుంపోఁ ద్రోయుటకొఱకు ఆత్మ సచ్చిదానందస్వరూపుఁడని శ్రుతి చెప్పుచున్నది. ఇంతియకాని, వీనికి అన్యోన్యభేదమును జెప్పుటయందు తాత్పర్యము లేదు గనుక సత్తే చిత్తు, చిత్తే ఆనందమని శ్రుతితాత్పర్యాలోచనచేత సిద్ధించెను. అయితే

శ్రుతిమాత్రముచేతనే కదా సత్తే చిత్తు, చిత్తే ఆనందమనుట సిద్ధించెను. యుక్తిచేత సిద్ధింపలేదుగదాయనిన; సిద్ధించియున్నది.

అది యెట్లనిన; సత్తు తానే తోఁచుచున్నదో, లేక మఱి యొకటిచేత తోఁపింపఁబడి తోఁచుచున్నదో యనిన; తానే తోఁచుచున్నదని చెప్పవలయును. ఇటువలె చెప్పుటచేత సత్తే చిత్తనుట సిద్ధించుచున్నది. అన్యముచేత తోఁపింపఁబడుచున్నదని చెప్పుదమనిన; సద్విలక్షణంబువలనఁ దోఁపింపఁబడుచున్నదియో సదంతరంబువలన తోఁపింపఁబడుచున్నదియో యని శంకరాఁగా సద్విలక్షణంబుచేతనే తోఁపింపఁబడుచుండునని చెప్పుదమనిన; అటుల చెప్పఁగూడదు. చెప్పినట్లయితే సద్విలక్షణమనఁగా; నసత్తు గావున అసత్తైన సద్విలక్షణంబుచేత సత్తు తోఁపింపఁబడుచున్నదని చెప్పఁగూడదు. అటువలె చెప్పినట్లయితే అసత్తైన శశవిషాణాదులచేత సత్తయిన ఘటాదులు తోఁపింపఁబడవలెను. అటువలె తోఁపింపఁబడలేదు. కాఁబట్టి సద్విలక్షణంబగు నసత్తువలన సత్తు తోఁపింపఁబడుచున్నదని చెప్పఁగూడదు. అయితే సత్తు సదంతరంబుచేత తోఁపింపఁబడుచున్నదని చెప్పుదమనిన; ఆ సదంతరము తాను దోఁచుచుండి సత్తును తోఁపింపఁజేయుచున్నదో, లేక, తాను తోఁచకయే సత్తును తోఁపింపఁజేయుచున్నదో యనిన; తాను తోఁచకయే ఆ సత్తును తోఁపింపఁజేయనేరదు గనుక తాను దోఁచుచు సత్తునుం దోపింపఁజేయుచున్నదని చెప్పవలెను. ఆ సదంతరముఁచేత సత్తు తోఁచుచు ఆ సత్తును తోఁపించుచున్నదనిచెప్పిన నెందుచేత తోఁపింపఁబడుచున్నదని అనవస్థాదోషము వచ్చును. కాఁబట్టి ఆ సదంతరము తాను స్వతః తోఁచుచునుండి సత్తును తోపింపఁజేయుచున్నదని చెప్పవలెను గనుక వేదాంతమందుఁ సత్తాద్వయంబు లేదు గాన నేసత్తు తాను స్వతః తోఁచుచున్నదో ఆ సత్తునకే చిత్త్వము సిద్ధించెను. ఇట్లు చెప్పుటచేత సత్తుకే చిత్త్వము సిద్ధించినఁ జిత్తయిన సత్తునకు ఆనందత్వంబు సిద్ధింపలేదేయనిన; సిద్ధించియున్నది. అది యెటువలెననిన; ఆ చిత్తయిన సత్తున కద్వితీయత్వంబు సదంతరంబువలన వచ్చుచున్నదో, లేక సద్విలక్షణంబుచేత వచ్చుచున్నదో యనిన; ఆ సత్తునకు ఉపాధి వినాగా స్వతః సదంతరము లేదు గనుక సదంతరంబుచే నద్వితీయత్వంబు వచ్చెనని చెప్పఁగూడదు. అయితే సద్విలక్షణంబువలన నద్వితీయత్వంబు

వచ్చెనని చెప్పుదమనఁగా; సద్విలక్షణమనఁగా; రజ్జు సర్పములవలె నసత్తు గనుక దానివలనం జిత్తయిన సత్తున కద్వితీయత్వంబు చెప్పనే కూడదు. కాఁబట్టి అసత్తునకు సదంతరంబును సద్విలక్షణంబును వినాగా నద్వితీయత్వమును సంపాదించునట్టి పదార్థంబు లేదు గాన నా సత్తున కద్వితీయత్వంబు సిద్ధించెను. అద్వితీయత్వ మెప్పుడు సిద్ధించెనో అప్పుడే ఆనందరూపత్వంబు సిద్ధించెను. ఈ ప్రకారంబున యుక్తిచేతను సత్తే చిత్తు, చిత్తే ఆనందమని సిద్ధించెను. అయితే శ్రుతియుక్తులచేమాత్రము సత్తే చిత్తు, చిత్తే ఆనందమనుట సిద్ధించెను. అనుభవముచేత సిద్ధింపలేదు గదా! యనిన; అనుభవముచేతను సిద్ధించియున్నది.

అది యెటువలె ననిన; సుషుప్తియందు సర్వప్రాణులచేతను ఒక సుఖం బనుభవింపఁబడినదిగాఁ దోఁచుచున్నది. ఆ సుఖంబు జాగ్రత్స్వప్నంబులయందు తోఁచెడి సుఖమువలె నానారూపంబులై యుండక సర్వసుషుప్తులయందు నేకరూపంబై యున్నది గాన నా సుషుప్తిసుఖంబు నకు చిద్రూపత్వం బెటువలెననిన; తానునుం దోఁచుచు తనయం దారోపింపఁబడిన సర్వపదార్థంబులనుం దోఁపించుచున్నది గాన నా సుషుప్తిసుఖంబునకు చిద్రూపత్వంబున్నది. అది యెటువలె ననిన; సుషుప్తినొంది లేచిన పురుషునిచేత నేను సుఖంబుగ నిదురపోయితిని. ఏమియు నెఱుంగకుండితినని యొక్క సుఖంబు నజ్ఞానంబును స్మరింపఁబడు చున్నవి. ఆ స్మరణం బనుభవంబు లేక రానేరదు. కాఁబట్టి ఈ సుఖం బును అజ్ఞానంబును సుషుప్తికాలంబునం దనుభవింపఁబడినదై తోఁచు చుండుటవలన నా సుఖస్వరూపంబే సుఖంబు. అనుభవింపఁబడుచున్న దనెడి మోహం బజ్ఞానంబు. ఈ యనుభవింపఁబడిన అజ్ఞానం బెవరివలనఁ దోఁచుచున్నదనిన; సుషుప్త్యవస్థయందు ప్రకాశసాధనంబులగు నాదిత్య చంద్రనక్షత్రవిద్యుద్వహ్నిచక్షురాదులు లేకయే సుఖమాత్రంబున్నది గాన నా సుఖంబువలన నజ్ఞానంబు తోఁపింపఁబడుచున్నదని చెప్పవల యును. ఆ యజ్ఞానంబువలననే సుఖము తోఁపింపఁబడుచున్నదని చెప్పుద మనఁగా; అజ్ఞానంబు జడంబు గాన దానివలన సుఖంబు తోఁపింపఁబడు చున్నదని చెప్పఁగూడదు. అయితే సుషుప్తిసుఖము సత్తయ్యెను. సత్తయిన సుషుప్తిసుఖమును తోఁపకయే అజ్ఞానమును తోఁపింపనేరదు గనుక తాను తోఁచి అజ్ఞానంబును దోఁపింపుచున్నది. ఆ యజ్ఞానంబునందు

సమస్తప్రపంచంబును లీనంబైయున్నది గాన నా యజ్ఞానమును తోఁపించుటచేత నా సుఖంబునకు సకలపదార్థావభాసకత్వంబు సిద్ధించెను. ఇది ఆత్మకు సర్వజ్ఞత్వము. కాఁబట్టి సుషుప్త్యవస్థయందు సత్తయిన సుఖంబునకు చిద్రూపత్వము సిద్ధించెను. దీనికి ఆనందస్వరూపత్వ మెటువలె ననిన; నిరుపాధికనిరతిశయసుఖస్వరూపత్వము. ఈ సుఖమునకు నున్నది గనుక దీనికి ఆనంద స్వరూపత్వము సిద్ధించెను. కాఁబట్టి అనుభవముచేతను సత్తే చిత్తు చిత్తే ఆనందమనుట సిద్ధించెను. కాఁబట్టి సచ్చిదానందంబు లాత్మకు స్వరూపంబయ్యె. అట్లగుటవలన స్వకీయంబులగు సచ్చిదానందంబులవలన ఆత్మకు స్వగతభేదము లేదు. ఆత్మకు విజాతీయంబగు ననాత్మ అసత్తు గావున నా యనాత్మవలన ఆత్మకు విజాతీయ భేదంబు లేదు. ఆత్మకు ఆత్మాంతరము లేదు గావున సజాతీయభేదంబును లేదు. ఈ ప్రకారముగా నీ మూఁటిచేతను ఆత్మకు భేదము లేదు. ఆత్మ సర్వాత్మకుఁడై యున్నాఁడు గనుక సజాతీయ విజాతీయ స్వగతరూపంబగు వస్తువుచేతను విభువై యున్నాఁడు. కావున దేశముచేతను నిత్యుఁడై యున్నాఁడు గనుక కాలముచేతను పరిచ్ఛేదము లేదు. ఈ ప్రకారముగా ఆత్మ దేశకాలవస్తువులవలనం ద్రివిధపరిచ్ఛేదశూన్యుఁడై యున్నాఁడు. కాఁబట్టి సచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మకు అఖండత్వము సిద్ధించెను. అయితే యీ విచారంబునకు ఫలంబేమి యనిన; సమస్త ప్రాణులకును తమదేహమే తామనెడి దృఢనిశ్చయ మెటువలెనున్నదో అటువలెనే దేహము తానని దేహమం దాత్మబుద్ధి రాక అఖండసచ్చిదానందరూపుఁడగు నాత్మ తానని దృఢనిశ్చయము కలుగుటయే యీ విచారమునకు ఫలము. ఈ ప్రకారముగా విచారించి ఆత్మస్వరూపమే తానని యెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే సర్వసంసారవిముక్తుండును కృతకృత్యుండును పరిపూర్ణబ్రహ్మంబునని స్మృతీతిహాసపురాణాగమ శ్రుత్యాచార్యవచనంబులు ఘోషించుచున్నవి. ఈ యర్థంబునందు సంశయంబు లేదు. సిద్ధము.

శ్లో. భూతభౌతికభావేషు సర్వకార్యే సదాత్మనా,
వ్యాపీ దృష్టస్తతో హ్యాత్మా దేశాన్నాన్యపరిచ్ఛిత్తిః.
అదేహిత్వాదనాదిత్వా దబాధ్యత్వాన్న విద్యతే,
వర్తమానగతాగామికాలేభ్యోపి న పరిచ్ఛిత్తిః.

సర్వభిన్నస్వరూపేణ సర్వాత్మత్వాత్స్వదాత్మనః,
సర్వేభ్యో వస్తుజాతేభ్యః పరిచ్ఛిత్తిర్నవిద్యతే.
న వ్యాపిత్వాద్దేశతోఽంతో నిత్యత్వాన్నాపి కాలతః,
న వస్తుతోఽపి సర్వాత్మా భావత్వం బ్రహ్మణి త్రిధా.
అఖండాత్మానమేవాయమిత్యేవం యో విజిజ్ఞివాన్,
స సర్వసంసృతేర్ముక్తో బ్రహ్మానందం సమశ్నుతే.
కిమనేన బహూక్త్వేన నిర్జితాదౌ మహాత్మభిః,
అవిచారాద్ధి సంసారో విచారాన్మోక్ష ఇష్యతే.
ప్రమదాచ్చ ప్రమాదాద్వా యదజ్ఞానాన్మయేరితమ్,
తత్క్షామ్యంతు సమాలోక్య పండితాస్సమదర్శినః.

ఇది ద్వాదశవర్ణకము.

# త్రయోదశవర్ణకము

## అజ్ఞానస్వరూపనిరూపణప్రకరణము

శ్లో. యదజ్ఞానప్రభావేన దృశ్యతే సకలం జగత్,
యజ్జ్ఞానాచ్ఛ్రియ ఆప్నోతి తస్మై జ్ఞానాత్మనే నమః.

ఏ యజ్ఞానమువలన సమస్తప్రాణులును జన్మమరణదుఃఖపరంపరను బొందుచున్నారో, ఆ యజ్ఞానముయొక్క స్వరూపమును నిరూపించుచున్నారము. అజ్ఞానంబన నెయ్యది యనిన; తన్నుఁ దానెఱుఁగకుండుట అజ్ఞానము. ఎవరునుం దమ్ముఁ దామెఱుఁగరా యనిన; ఎఱుంగరు. ఎవ్వరును తమ్ముఁ దామెఱుఁగరని చెప్పవచ్చునా? యనిన; ఎఱుఁగకున్నారు గానఁ జెప్పవచ్చును. అయితే మఱియేమియెఱుఁగుదురనిన; నేను మనుష్యుఁడను, నేను స్త్రీని, నేను పురుషుఁడను అనియు, నేను బ్రాహ్మణుఁడను, క్షత్త్రియుఁడను, వైశ్యుఁడను, శూద్రుఁడను అనియు, నేను బ్రహ్మచారిని, గృహస్థుఁడను, వానప్రస్థుఁడను, సన్న్యాసిని అనియు; నేను ములికినాటివాఁడను, వెలనాటివాఁడను, వేగినాటివాఁడను, పాకనాటివాఁడను, కాసలనాటివాఁడను, నియోగపువాఁడను అనియు, నేను తెనుఁగువాఁడను, అరవవాఁడను, కర్నాటకుఁడను,

మహారాష్ట్రుఁడను అనియు, నేను తత్త్వవాదిని, వైష్ణవుఁడను, శైవుఁడను, భాగవతుఁడను, పౌరాణికుఁడను, శాస్త్రవాదిని అనియు, నేను కృష్ణుఁడను, రాముఁడను, నారాయణుఁడను అనియు, నేను వానితండ్రిని, వీనిపుత్త్రుఁడను అనియు నెఱుఁగుదురు. అయితే ముందు ఎవరును తమ్ము దా మెఱుఁగరనిచెప్పి యిప్పుడెఱుఁగుదురని చెప్పుటచేత ముందు చెప్పినందుకును నిప్పుడు చెప్పినందుకును విరోధము గదా! యనిన; విరోధము కాదు.

అది యెట్లులనిన; తాను మనుష్యుఁడు కాఁడు గనుక మనుష్యుఁడని యెఱుఁగుట యెఱుఁగుట కాదు. స్త్రీయును పురుషుండును కాకుండుటవలన స్త్రీయనియు, పురుషుండనియు నెఱుఁగుట యెఱుఁగుట కాదు. తాను బ్రాహ్మణుఁడు కాఁడు గాన బ్రాహ్మణుండని యెఱుఁగుట యెఱుఁగుట కాదు గనుక నెవరును తమ్ముఁ దా మెఱుఁగరని చెప్పవచ్చును అయితే, మనుష్యుఁడగు తన్ను మనుష్యునిగా నెఱుఁగుచున్నాఁడు గాని యెద్దుగా నెఱుఁగలేదు. స్త్రీయగు తన్ను స్త్రీ యని యెఱుఁగుచున్నదిగాని పురుషుఁడని యెఱుఁగలేదు. పురుషుఁడగు తన్ను పురుషుఁడని యెఱుఁగుచున్నాఁడు గాని పిశాచముగా నెఱుఁగలేదు. బ్రాహ్మణుండగు తన్ను బ్రాహ్మణుఁడని యెఱుఁగుచున్నాఁడు గాని శూద్రుఁడని యెఱుఁగలేదు. ఈ ప్రకారముగా సమస్తమైనవారలును తమ్ముఁ దామె యథార్థముగా నెఱిఁగియుండఁగా నెవరును తమ్ముఁ దా మెఱుఁగరని యెటుల చెప్పనగుననిన; చెప్పవచ్చును. అది యెటువలెననిన; తాను మనుష్యుఁడే అయినట్టయితే, పోయిన జన్మమందును మనుష్యుఁడై యుండవలయు నింకవచ్చెడి జన్మమందు మనుష్యుఁడుగానే పుట్టవలెను. పోయిన జన్మమందు తాను దేవుఁడో యక్షుఁడో గంధర్వుఁడో మనుష్యుఁడో స్థావరమో పిశాచమో యెద్దో యెనుపోతో కుక్కయో నక్కయో తెలియఁబడలేదు. తనకు మనుష్యత్వమే స్వతస్సిద్ధమైనట్టయితే మీఁదటి దేవాదిశరీరములు కావలయునని యీ జన్మమందెవరును యాగోపాసనాదిక్రియలను జేయక యుండవలయును. చేయుచున్నారు. కాఁబట్టి తన్ను మనుష్యుడని యెఱుఁగుట యెఱుఁగుట కాదు. ఈ ప్రకారముగానే బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రాదులును తమ్ముఁ దా మెఱుఁగుట యెఱుఁగుట కాదని తెలిసికొనఁదగినది.

అయితే, అందఱు నిటువలెనే యెఱుఁగుదురా? యనిన; కొందఱు పార లౌకికులైనవారలు జీవుఁడని యెఱుఁగుదురు. ఆ జీవునియొక్క స్వరూప మెయ్యదియని యడిగిన నుత్తరంబీయనేరరు గాన వారును ఎఱుఁగరు.

అది యెట్లనిన; మనుజుఁడుగాని తన్ను మనుజుఁడని యెఱిఁగినవాఁ డెటువలె నెఱిఁగినవాఁడు కాఁడో అటువలెనే జీవుఁడుగాని తన్ను జీవునిగా నెఱిఁగినవాఁడును ఎఱిఁగినవాఁడు కాఁడు. అయితే శాస్త్రజ్ఞులైనవారలును ఆత్మ నెఱుఁగరా? వారాత్మస్వరూప మిట్టువంటి దని నిశ్చయించుకొనియుండఁగా నెటువలె నెఱుఁగరని చెప్పవచ్చుననిన; శాస్త్రజ్ఞులలోపల చార్వాకుఁడైనవాఁ డనాత్మస్వరూపమైన స్థూలదేహ మును ఆత్మ యని యెఱిఁగినాఁడు గనుక వాఁడు శాస్త్రజ్ఞుఁడైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవాఁడు కాఁడు. మఱియును ప్రాణోపాసకులైన కొందఱు శాస్త్రజ్ఞులు అనాత్మ యగు ప్రాణుఁ డాత్మ యని యెఱిఁగిరి గావున వారు శాస్త్రజ్ఞులయ్యు నాత్మ నెఱిఁగినవారు కారు. మఱికొంద ఱనాత్మ స్వరూపమగు నింద్రియంబుల నాత్మగా నెఱిఁగిరి గాన వారు శాస్త్రజ్ఞు లైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవారు కారు. మానసోపాసకులగు మఱికొంద ఱనాత్మయగు మనస్సును ఆత్మ యని యెఱిఁగిరి గాన వారలు శాస్త్రజ్ఞు లైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవారలు కారు. ఇంతియగాక, బౌద్ధులలోపలఁ గొందఱు శాస్త్రజ్ఞు లాత్మకాక క్షణికమైన బుద్ధిని ఆత్మ యని యెఱిఁ గిరి గావున వారలు శాస్త్రజ్ఞులైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవారలు కారు. మఱియును బౌద్ధులమని పేరుపెట్టుకొనియుండెడి కొందఱు మూఢులు శశవిషాణతుల్యమైన శూన్యమును ఆత్మగా నెఱిఁగిరి గనుక వారు శాస్త్రజ్ఞులైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవారు కారు. అట్లయితే శాస్త్రజ్ఞు లైన మీమాంసకులును శైవులును రామానుజులును మధ్వులును ఆత్మ నెఱుఁగరా? యనిన; నెఱుఁగరు. అ దెటువలెననిన; మీమాంస కాదులు పరిపూర్ణుఁడగు ఆత్మ నణుపరిమాణుఁడని యెఱిఁగిరి గనుక వారలు శాస్త్రజ్ఞులైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవారలు కారు. అయితే శాస్త్రజ్ఞులైన తార్కికాదు లాత్మకు విభుత్వము నంగీకరించిరే వార లాత్మ నెఱుఁగరా? యనిన; ఎఱుఁగరు.

అది యెట్లనిన; తార్కికాదు లాత్మకు విభుత్వము నంగీకరించి నను ఆత్మకు నానాత్వంబును జడత్వంబును, ఆ జడుఁడగు ఆత్మకు చిత్తు

గుణంబనియును, నిర్గుణుఁడైన ఆత్మకు ఇచ్ఛాదిగుణంబులును, ద్రష్ట యుండునట్టి యాత్మకు దృశ్యత్వంబును నంగీకరించిరి గాన వారలు శాస్త్రజ్ఞులైనను ఆత్మ నెఱిఁగినవారు కారు. అయితే సాంఖ్యయోగు లును ఆత్మ నెఱుంగరా? యనిన; సాంఖ్యయోగు లాత్మకు విభుత్వ సచ్చిదానందత్వ స్వరూపాసంగత్వముల నంగీకరించినప్పటికిని ఆత్మకు నానాత్వంబును జగత్తుకు సత్యత్వంబును జీవేశ్వరులకు భేదంబును నంగీ కరించిరి గాన వారలు శాస్త్రజ్ఞులైనను ఆత్మ నెఱింగినవారు కారు. అయితే, యిందఱు శాస్త్రజ్ఞులు ఆత్మ నెఱుఁగకపోయినఁ బోనిమ్ము. వేదాంతశాస్త్రజ్ఞు లాత్మ నెఱుంగరా? యనిన; వేదాంతశాస్త్రజ్ఞులు ముముక్షువు లనియు, నముముక్షువు లనియును రెండువిధంబులు. ఈ రెండువిధములవారలలోన ముముక్షువులు నాలుగుతెగలై యుందురు. వార లెవ్వరనిన; ప్రయోజనమునకై చదివినవారలును, ప్రసిద్ధికొఱకై చదివినవారలును, పూజార్థులై చదివినవారలును, ఇతరమతప్రవిష్టులై యుండి వేదశాస్త్రధర్మము నెఱిఁగి పెద్దలను దూషింపవలెనని చదివిన వారలును, ఈ నాలుగు తెగలవారలును వేదాంతశాస్త్రజ్ఞులైనప్పటికిని ఆత్మ నెఱిఁగినవారలు కారు. ఈ నాలుగువిధములవారికిని గలిగెడి ఫలంబు లెవ్వి యనిన; వేదాంతమును దూషించుటకొఱకు చదివిన వారికి నరకంబును, తిర్యగాదియోనిప్రాప్తియుఁ గలుగును. తక్కిన మువ్వురకును వారివారి సత్కర్మాచరణానుసారముగ స్వర్గాదిలోకప్రాప్తి కలిగినను కలుగవచ్చును. ముముక్షువులై చదివినవారు రెండువిధము లుగా నుందురు. వారెవ్వరనిన; ప్రతిబంధసహితులు, ప్రతిబంధరహితు లును, ప్రతిబంధసహితులై వేదాంతము చదివినవారు కాలాంతరమునం దా ప్రతిబంధముచేత విడువఁబడి ఆత్మస్వరూపము నెఱింగి ముక్తులగు దురు. ప్రతిబంధరహితులై వేదాంతమును జదివినవారలు అప్పుడే ఆత్మస్వరూపంబు లెఱిఁగి ముక్తులగుదురు. ఓయీ! పూర్వ మెవరును తమ్ముఁ దా మెఱుఁగరని చెప్పి యిప్పుడు ప్రతిబంధరహితులైన వేదాంతు లాత్మ నెఱుఁగుదురని చెప్పెదవు. పూర్వము చెప్పినందుకును ఇప్పుడు చెప్పినందుకును విరోధము లేదా? లేదు. ప్రతిబంధరహితులై చదివి యాత్మ నెఱిఁగినవారలు ఆత్మయే కాన నెఱుగఁరని చెప్పినందుకు విరోధము లేదు. అయితే పూర్వము తమ్ముఁ దా మెఱుఁగరని చెప్పి

వెనుక నాత్మ నెఱుఁగరని చెప్పుట విరోధము గదా! యనిన; తానే ఆత్మ గనుక యెవరును తమ్ముఁ దా మెఱుఁగరని చెప్పినందుకు విరోధము లేదు. తన్నెఱుఁగని యీ యజ్ఞాన మెట్లు తొలఁగుననిన; ఆత్మజ్ఞానమువలనఁ దొలగును. ఆత్మజ్ఞానముచేపోవునని యేల చెప్పవలెను. కర్మముచేత పోవునని చెప్పుదమనిన; అటుల చెప్పఁగూడదు. అది యెట్లనఁగా; కర్మం బజ్ఞానంబునకు విరోధికాదు గాన కర్మం బాత్మజ్ఞానంబువలననే పోవును. మఱెందుచేతనుం బోదు. ఆత్మ జ్ఞానముచేతనే పోవునని యెందుకు చెప్పవలెను. కర్మం బజ్ఞానమువలనఁ దొలఁగునని చెప్పుదమనిన; అటుల చెప్పఁగూడదు. అది యెటులనఁగా; దృష్టాంతపూర్వకముగ నిరూపించుచున్నారము. ఘటము ఘటాంతరంబునకు విరోధి కాదు గాన ఘటమును ఘటాంతరం బెటువలె పోఁగొట్టనేరదో అటువలెనే కర్మము అజ్ఞానంబునకు విరోధి కాదు గనుక అజ్ఞానమును బోఁగొట్టనేరదు. ఇంతమాత్రమే కాను. కర్మ మజ్ఞానంబునకు వృద్ధి కలుగఁజేయును. అది యెట్టులనిన; అమావాస్యనిశియందు వచ్చిన మేఘావరణ మా యమావాస్యచీఁకటికి విరోధి గాక యా చీఁకటి నెటుల పోఁగొట్టనేరక మఱియును వృద్ధినొందించునో అటుల కర్మము అజ్ఞానంబును పోఁగొట్టనేరక అజ్ఞానంబును వృద్ధిచేయును. అది యెటువలె ననఁగా; అమావాస్యచీఁకటియందు మార్గమునుబట్టి పోవునట్టి పురుషునికి పసర మెదురయ్యెనేని అది వృషభమైనదియు, పశువైనదియు, నెనుమైనదియును దెలియక సామాన్యముగా మృగమని తోఁచుచున్నది. మనుష్యుఁ డెదురయ్యెనేని వాఁడు బ్రాహ్మణుఁడైనదియు శూద్రుఁడైనదియును దెలియఁబడక పురుషుఁడని సామాన్యముగాఁ దోఁచుచున్నాఁడు. ఆ చీఁకటియందు మేఘ మావరించినట్లయితే ఆ మేఘ మా యంధకారమును వృద్ధిఁజేసి సామాన్యముగఁ దోఁచిన ఆ మనుష్యాదులను గూడ సర్వాత్మనా యెటులఁ దోఁచనీయదో అటులనే కర్మమును అజ్ఞానమును వృద్ధిఁబొందించి ఆత్మను సర్వాత్మనా తోఁచనీయదు. అయితే దృష్టాంతమందు మేఘావరణ మహంకారమును వృద్ధిబొందించి మనుష్యాదులను సర్వాత్మనా తోఁచనీకుండుటను ప్రత్యక్షముగాఁ గనుచున్నారము. దార్ష్టాంతికమందు కర్మము అజ్ఞాన

మును వృద్ధిపొందించి నిత్యుఁడైన ఆత్మ నెటువలె తోఁచనీయ దనిన; మేఘముచేత నావరింపఁబడిన నిబిడాంధకారమందు మణిపుస్తకసాల గ్రామరుద్రాక్షాదులు చేతికి లబ్ధమైనపుడు ఈ మణి కాచమణియో, మంచిమణియో యనియు, నీ పుస్తకము వేదమో, శాస్త్రమో, పురాణమో యనియు, నీ సాలగ్రామము సీతారామమో, లక్ష్మీనారాయణమో, నారసింహమో యనియు, నీ రుద్రాక్ష షణ్ముఖియో, పంచముఖియో, భద్రాక్షియో యనియు, నా యంధకారగ మెటువలె స్పష్టముగాఁ దోఁచనీయదో అటువలెనే కర్మముచేత వృద్ధిపొందిన అజ్ఞానము ఆత్మను తోఁచనీయదు. అయితే యీ యంధకారమందు చేతికి లబ్ధమైన మణిపుస్తకాదులయొక్క యథార్థమైన జ్ఞాన మెప్పుడు కలుగు ననిన; సూర్యోదయమైనతర్వాత నా యంధకారము నశించిపోవుచుండఁగా చేతికి లబ్ధమైన మణిపుస్తకాదులయొక్క యథార్థజ్ఞాన మెటువలె వచ్చుచున్నదో అటువలెనే దార్ష్టాంతికమందును కర్మముచేత వృద్ధిఁబొందింపఁబడిన ఆత్మావరకమైన అజ్ఞానము బ్రహ్మాత్మజ్ఞానముచేత నశించిపోవుచుండఁగా తర్వాతను యథార్థము తోఁచును. ఈదృష్టాంతమందు సూర్యోదయముచేతను నివృత్తమైన దెయ్యది యుండెడి దెయ్యది యని శంకరాఁగా సూర్యోదయముచేతను మణిపుస్తకాదులయొక్క స్వరూపమును దెలియనీయని యంధకారము నశించి మేఘావరణ ముండెను. ఆ మేఘావరణ మేమిసేయుననినఁ; గొందరికి సుఖంబును కొందరికి దుఃఖంబును గలుగఁజేయుచుండును. అది యెట్టులనిన; మార్గమున నడిచిపోవునట్టివారికిని కృష్యాదులను చేయునట్టివారికిని సుఖంబును, వడ్లు మొదలయినవాని నెండఁబోసెడివారికిని స్నానము సేయునట్టివారికిని వాతశరీరముగలవారికిని దుఃఖంబునుం జేయును, అయితే దార్ష్టాంతికమందును పోవునట్టి దెయ్యది? ఉండెడి దెయ్యది? యనిన; జ్ఞానముచే నజ్ఞానము నశించిపోవును. అజ్ఞానకార్యములయిన దేహేంద్రియాదులుండును. అయితే యీ యుండెడి దేహేంద్రియాదులు జ్ఞానులకేమి సేయుననిన; సుఖదుఃఖములను జేయుచుండును. అయితే దృష్టాంతమందు మేఘావరణ మంధకారముయొక్క కార్యము కాదు కనుక ఆ యంధకారము నశించి మేఘావరణం బుండవచ్చును. దార్ష్టాంతిక

మందు దేహేంద్రియాదు లజ్ఞానముయొక్క కార్యములు. కనుక కార ణము నశించిపోయిన తర్వాత కార్యమయిన దేహేంద్రియము లెటు వలె నుండుననిన; దృష్టాంతపూర్వకముగ నిరూపించుచున్నారము.

కలబందయును, ధూమంబును, ఇషువేగంబును దృష్టాంతము.— అది యెట్టులనిన; కలబందకు కారణమయిన మూలము నశించిపోయి నప్పటికిని ఆ కలబంద యెటువలె నశింపకయున్నదో, ధూమమునకుఁ గారణమయిన యగ్ని నశించినప్పటికిని ఆ ధూమ మెటువలె నశింప కున్నదో, ఇషువేగమునకు కారణమయిన యాకర్షణముతోఁ గూడిన యన్లైత్రాటియొక్క ఇషుబాణసంయోగము నశించినప్పటికిని ఆ యిషు వేగ మెటులున్నదో అటువలెనే దార్ష్టాంతికమందును దేహేంద్రియ ములకుం గారణమయిన అజ్ఞానము నశించినప్పటికిని దేహేంద్రియాదు లుండవచ్చును. అయితే యీ దేహేంద్రియాదులకు నాశమెప్పుడనిన; దృష్టాంతమందు మేఘావరణాదులయొక్క నాశమున కెటువలె నియ మము లేదో అటువలెనే దేహేంద్రియాదులయొక్క నాశమునకు నియ మము లేదు, ప్రారబ్ధ మెప్పుడు నశించుచున్నదో అప్పుడే దేహేంద్రి యాదులకు నాశము. దృష్టాంతమందు మేఘావరణ మంధకారమును వృద్ధిచేయుట ప్రత్యక్షముగఁ గన్నారము. దార్ష్టాంతికమందైతే కర్మ జ్ఞానమును వృద్ధిచేయుట కానము గాన నీదృష్టాంత మెటువలె కూడు ననిన; త్రివిధకరణములచేత చేయఁబడిన కర్మ మకర్తయగు నాత్మను కర్తగాను, అభోక్తయగు నాత్మను భోక్తగాను, సుఖదుఃఖములు లేని ఆత్మను దుఃఖముగలవానిగాను జేయుచున్నది కాఁబట్టి ఇటువలెఁ జేయుటచే అజ్ఞానమునకు వృద్ధి యని యెఱుంగవలయు గావున నజ్ఞాన మునకు వృద్ధినిజేయుకర్మ మజ్ఞానమును దొలఁగఁజేయ నేరదు. అయితే; యీ అజ్ఞాన మెటుల నశించు ననిన; ఆత్మజ్ఞానముచేతనే నశించును. మరి యెందుచేతను నశింపనేరదు. జ్ఞాన మెటులవచ్చుననిన; విచారము చేతనే వచ్చును. విచారమువలన జ్ఞానము గలుగునని యెందుకు చెప్ప వలెను. కర్మమువలననే జ్ఞానము గలుగునని చెప్పుదమనిన; అటుల చెప్పఁగూడదు. అది యెటువలెననిన; అగ్నిచేత తుత్తు పోఁగొట్టఁబడక వృద్ధిపొందినప్పటికిని తండులమ్ములను ఆకారముగాఁ భరిణమింపఁజేసి

తుత్తు నెటువలె పోఁగొట్టుచున్నదో, అటువలెనే కర్మముచేత అజ్ఞానము పోఁగొట్టఁబడక వృద్ధిఁబొందినప్పటికి కర్మ జన్యజ్ఞాన మాత్రజ్ఞానముగాఁ బరిణమించి అజ్ఞానమును బోఁగొట్టుచున్నదని చెప్పుదమనిన; అటుల చెప్పఁగూడదు. దృష్టాంతమందు అగ్నితండులములను అన్నాకారముగాఁ బరిణమింపజేసి తుత్తును పోఁగొట్టుటను ప్రత్యక్షముగాఁ గన్నారము. కాఁబట్టి యీ యర్థము కూడదు.

అది యెటువలె ననఁగా; కర్మమజ్ఞానమును దొలఁగఁజేయునట్టి జ్ఞానమును బుట్టించి యా జ్ఞానముద్వారా అజ్ఞానమును పోఁగొట్టునని చెప్పుదమనిన; చెప్పఁగూడదు. మఱి యెట్టులనిన; జ్ఞానమనఁగా, చిత్త వృత్తికి అకర్త్రాద్యాకారముగాఁ బరిణామము కర్మమైతే కర్త్రాద్యాకార ముగాఁ బరిణమింపజేసెడిది గనుక అజ్ఞానమును దొలంగంజేయనేరదు. అందువలన కర్మముచేత జ్ఞానము రానేరదు. మఱి యెందువలన వచ్చు ననిన; విచారమువలననే రావలయును. ఏ విచారమువలన రావలయు ననిన; ఆత్మానాత్మవిచారమువలన రావలయును. అయితే ఆత్మజ్ఞానము విచారముద్వారా రావలసినదే కాని మఱియెందుచేతను రాదనుటకు దృష్టాంతము కలదా ? యనిన; కలదు. అది యెద్ది యనిన అర్థముతోఁ గూడుకొనియుండెడి గాయత్రి పురుషుని చేత పొందఁబడియున్నప్పటికిని ఆ గాయత్రియొక్క అర్థమును విచారింపకయే తెలియఁబడదు. ఆ గాయత్రియొక్క అర్థమును తెలియవలెననిన; సేతుస్నానము చేసినప్ప టికిని, గంగాసాగరసంగమంబునందు వేయేండ్లు తపస్సుచేసినప్పటికిని, అనేక శివవిష్ణుదేవోపాసనలు చేసినప్పటికిని, పంచాగ్నిమధ్యయందు పదివేలయేండ్లు తపస్సు చేసినప్పటికిని, నూ అశ్వమేధములు చేసినప్పటి కిని, లక్ష గాయత్రీ జపము చేసినప్పటికిని, గాయత్రియొక్క అర్థము తెలిసినవారియొద్ద తెలిసికొనుపర్యంతము తెలియక అర్థము తెలిసిన వారినడిగి వారు చెప్పిన యర్థమును మనస్సుచేత విచారించి ఆ గాయత్రి యొక్క అర్థము నెటువలె తెలిసికొనుచున్నాఁడో అటువలెనే దార్ష్టాం తికమందును మృత్తికాస్నానము మొదలైనవి చేసినందున జ్ఞానము రా నేరదు. ఆత్మానాత్మవిచారముచేతనే ఆత్మజ్ఞానము రావలెను. ఈ యర్థ మం దనుభవము గలదా యనిన; సర్వానుభవసిద్ధమైన అనుభవము

గలదు. అది యెట్టిదనిన; కర్మద్వారా చెప్పుచున్నారము. కర్మమనఁగా నెయ్యది యనిన; స్నానసంధ్యావందన జపోపాసనస్వాధ్యాయ దేవతార్చనాతిథిపూజనవైశ్వదేవతీర్థస్నానాదులు కర్మములని చెప్పఁబడుచున్నవి. ఈ కర్మములను మన మేమాత్రమైన జేసికొనుచువచ్చితిమిగదా! ఆ కర్మములయొక్క స్వరూపము మన కెఱుకపడలేదే. కాఁబట్టి కర్మములు చేసికొనుచు వచ్చినందుచేత నెవ్వరికిని ఆత్మజ్ఞానము రానేరదు. విచారము చేతనే ఆత్మజ్ఞానము రావలెను. మఱియును విచారముచేతనే బ్రహ్మజ్ఞానము రావలయు ననుటయందు సర్వానుభవములగు దృష్టాంతములను చెప్పెదము.

అవి యేవియనిన; ఒక పురుషుఁడు నేఁడు తిథివారనక్షత్రయోగ కరణంబు లేవి యని యడిగినట్టయితే విచారించి నేఁ డీతిథి, యీవార, మీనక్షత్ర, మీయోగ, మీకరణమని చెప్పుచున్నాఁడు. విచారింపక పోతే నేను విచారింపలేదు గనుక నెఱుఁగనని చెప్పుచున్నాఁడు. అటువలె నేను స్నానసంధ్యావందనాదులు చేయలేదు గనుక నెఱుఁగనని చెప్పలేదు. మఱియును గుడియందుండెడి దేవున కభిషేకపూజానైవేద్యము లాయెనా యని యడిగితే విచారించినట్లాయెనా కాలేదు అని చెప్పుచున్నాఁడు. విచారింపకున్న నాకు తెలియదని చెప్పుచున్నాఁడు గాని సంధ్యావందనాదులు చేయలేదు గనుక యెఱుఁగనని చెప్పఁడు. ఈ ప్రకారముగా లోకమందు సమస్తప్రాణులచేతను ఏయేవస్తువు విచారింపఁబడుచున్నదో ఆయా వస్తుజ్ఞాన మాప్రాణులకు యథార్థముగానే కలుగుచున్నది. ఈ కర్మాదులచేతను వారలకు ఆయా వస్తుజ్ఞానము రానేరదు. అటువలెనే దార్ష్టాంతికమందును సమస్తప్రాణులకును ఆత్మజ్ఞానము విచారణచేతనే రావలెను గాని కర్మోపాసనచేతను రానేరదు. కర్మచేత జ్ఞానము వచ్చునని శ్రుతులయందుఁ జెప్పఁబడియుండఁగా రాదని చెప్పుటచేత శ్రుతులకు వైయర్థ్యము వచ్చునంటివేని వైయర్థ్యము రాకుండఁ జెప్పెదను. అది యెటులనఁగా; కర్మైకదేశమే జ్ఞానమునకు పరంపరాసాధనముగాని నానావిధకర్మములును జ్ఞానమునకు సాధనములు కావు కనుక శ్రుతికి విరోధము కాదు. అట్లయితే కర్మలెన్నివిధంబులనిన; లౌకికమనియు వైదికమనియు రెండువిధములు. ఈ రెంటి

లోపలను సగము లౌకికకర్మ, లౌకికకర్మ జీవనమునకు హేతు వాయెను. అందువలన జ్ఞానము పుట్టనేరదు. కడమ సగమైన వైదికకర్మ నిత్యమనియు, నైమిత్తికమనియు, కామ్యమనియు, నిషిద్ధమనియు, ప్రాయశ్చిత్తమనియు నైదువిధములు. వానియందు కామ్యకర్మచేత జ్ఞానము రానేరదు. స్వర్గాదులు వచ్చును. నిషిద్ధకర్మచేత కాలసూత్రాదినరకములు వచ్చును. ప్రాయశ్చిత్తకర్మ పురుషున కధికారత్వమును సంపాదించి ప్రత్యవాయమును బోఁగొట్టును. ఈ త్రివిధకర్మములును రాజసతామస కర్మములని చెప్పఁబడును. ఇవి జన్మ సుఖదుఃఖముల నిచ్చుచుండును. ఈ రాజసతామసకర్మలచేత జ్ఞానము రానేరదు. శేషించిన సాత్వికకర్మలయందైతే చిత్తశుద్ధి కలుగును. ఆ చిత్తశుద్ధి జ్ఞానమునకు పరంపరాసాధనమని చెప్పఁబడును.

అది యెటు లనగా; ఈ నిత్యనైమిత్తికరూపమయిన సాత్వికకర్మ వలన చిత్తశుద్ధి. చిత్తశుద్ధిద్వారా నిత్యానిత్యవస్తువివేకము, నిత్యానిత్యవస్తువివేకద్వారా ఇహాముత్రార్థఫలభోగవిరాగము, ఇహాముత్రార్థఫలభోగవిరాగద్వారా శమాదిషట్కసంపత్తి, శమాదిషట్కసంపత్తిద్వారా ముముక్షుత్వము, మోక్షేచ్ఛద్వారా సద్గురులాభము, సద్గురులాభద్వారా శ్రవణము, శ్రవణద్వారా మననము, మననద్వారా నిదిధ్యాసనము కలిగి, నిదిధ్యాసనద్వారా జ్ఞానము వచ్చును. ఈ ప్రకారముగా కర్మైకదేశము జ్ఞానమునుగూర్చి పరంపరాసాధనము. విచారమో సాక్షాత్సాధనము. ఈ యర్థమందు దృష్టాంతము.— ఆఁకలిగొన్నవాని కయాఁకలి పోవుటకు పక్వమయిన అన్నమెటుల సాక్షాత్సాధనమో ఆ యన్నమునకై దున్నుట విత్తుట మొదలయినవి యెటుల పరంపరాసాధనములో అటులనే విచారము జ్ఞానమునకు సాక్షాత్సాధనము. కర్మైకదేశము పరంపరాసాధనము. ఈ యర్థమందు సందేహము లేదు. ఈ ప్రకారముగా అజ్ఞానముయొక్కస్వరూపంబును ఆత్మయొక్క స్వరూపంబును లెస్సగా విచారించి ఆయాత్మ నేనని యెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే జీవన్ముక్తుఁడు, వాఁడే విద్వాంసుఁడు, వాఁడే యోగి, వాఁడే సచ్చిదానందస్వరూపమయిన బ్రహ్మమని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది త్రయోదశ వర్ణకము.

---

# చతుర్దశవర్ణకము

## జ్ఞానాజ్ఞానస్వరూపవివేచనము

శ్లో. జ్ఞానాజ్ఞానే విచార్యేతే కారణే బంధమోక్షయోః,
అనుగ్రహార్థం లోకానాం మయా శాస్త్రం ప్రవక్ష్యతే.

జ్ఞానస్వరూపంబును నజ్ఞానస్వరూపంబును విచారించుచున్నారము. జ్ఞానంబన నెయ్యది? అజ్ఞానంబన నెద్ది? యనిన; నేను బ్రహ్మమని యెఱుఁగుట జ్ఞానము. నేను మనుష్యుఁడనని యెఱుఁగుట అజ్ఞానము. మఱియు జ్ఞానంబన నెయ్యది? యజ్ఞానంబన నెయ్యది? యని సవిశేషముగా విచారింతము. అజ్ఞానమనఁగా; అద్వితీయుఁడగు ఆత్మను సద్వితీయుఁడనియు, అపరిచ్ఛిన్నమయిన యాత్మను పరిచ్ఛిన్నుఁడనియు, అసంగుఁడయిన యాత్మను సంగి యనియు, అకర్తయయిన యాత్మను కర్త యనియుఁ, అభోక్త యగు నాత్మను భోక్త యనియుఁ దలంపించునట్టి దెయ్యదియో అయ్యదియే అజ్ఞానము. జ్ఞానమనఁగా; అద్వితీయుఁడయిన ఆత్మను అద్వితీయుఁడనియు, అపరిచ్ఛిన్నుఁడైన ఆత్మను అపరిచ్ఛిన్నుఁడనియు, అసంగుఁడయిన ఆత్మను అసంగుఁడనియు, అకర్త యగు ఆత్మను అకర్త యనియు, అభోక్త యగు ఆత్మను అభోక్త యనియు నేది తలంపించుచున్నదో అదియే జ్ఞానము. ఓయీ! అద్వితీయుండగు ఆత్మ నద్వితీయుఁడుగా దోఁచుట యజ్ఞానమని చెప్పితిరి. ప్రత్యక్షమందు సద్వితీయుఁడుగాఁ దోఁచుచున్నాఁడే యనిన; నీవు నేను వీఁడు వాఁడు దేవదత్తుఁడు యజ్ఞదత్తుఁడు అని యనేకవిధములుగాఁ దోఁచుటయే అజ్ఞానము. అపరిచ్ఛిన్నుఁడగు ఆత్మ పరిచ్ఛిన్నుఁడుగాఁ దోఁచుట యజ్ఞానమని చెప్పితిరి. ప్రత్యక్షమందు పరిచ్ఛిన్నుఁడుగానే తోఁచుచున్నాఁడే యనిన; ఈ యింటియం దుంటిని, ఈ యింటియం దుండలేదు. ఈదేశమం దుంటిని. ఈదేశమం దుండలేదని పరిచ్ఛిన్నుఁడుగాఁ దోఁచుటయే అజ్ఞానము. అసంగుఁడయిన ఆత్మను సంగుఁడుగాఁ దోఁచుట యజ్ఞాన మని చెప్పితిరి. ప్రత్యక్షమందు సంగిగాఁ దోఁచుచున్నాఁడే యనిన; వారితోడఁ గూడుకొనియుంటిని. వీరితోడఁ గూడుకొని యుంటిని అన్నదమ్ములతోఁ గూడు

కొలిచియుంటిని అని సంగిగాఁ దోఁచుటయే అజ్ఞానము. అకర్తయయిన ఆత్మ కర్తగాఁ దోఁచుట యజ్ఞానమని చెప్పితిరి. ప్రత్యక్షమందు కర్తగాఁ దోఁచుచున్నాఁడే యనిన; నేను స్నానము చేసితిని. సంధ్యావందనము జేసితిని. ఔపాసనముఁ జేసితిని. అని కర్తగాఁ దోఁచుటయే అజ్ఞానము. అభోక్తయైన యాత్మ భోక్తగాఁ దోఁచుట యజ్ఞానమని చెప్పితిరి. ప్రత్యక్షమందు భోక్తగాఁ దోఁచుచున్నాఁడే యనిన; నేను భోజనము చేసితిని. ఫలాహారము చేసితిని. అవుపాలు త్రాగితిని అని భోక్తగా దోఁచుటయే అజ్ఞానము. అయితే అద్వితీయుఁడగు నాత్మ అద్వితీయుఁడు గానే తోఁపించెడిది జ్ఞానమని చెప్పితిరి. అట్లు అద్వితీయుఁడై తోఁచు చున్నాఁడా ? యనిన ; తోఁచుచున్నాఁడు. అది యెటులనఁగా; ఆత్మకు అద్వితీయత్వము నెఱిఁగించి యద్వితీయుఁడై తోఁచుచున్నాఁడని చెప్పవలెను. కాఁబట్టి ఆత్మకు అద్వితీయత్వ మన నెయ్యది యనిన ; సజాతీయ విజాతీయ స్వగత భేదరహితత్వము.

అదెట్లనిన; దృష్టాంతపూర్వకంబుగ నిరూపించుచున్నారము. ఆ దృష్టాంత మెయ్యదియనిన; వృక్షంబునకు వృక్షాంతరము. ఆ దృష్టాంత మైన వృక్షమందు సజాతీయ విజాతీయ స్వగతంబులును వానియొక్క భేదంబును కలదనుట చెప్పిచూపి దార్ష్టాంతికమైన యాత్మయందు సజాతీయ విజాతీయ స్వగతభేదము లేదని శ్రుతులు చెప్పుచున్నవి. ఆత్మ యందు సజాతీయ విజాతీయ స్వగతంబులును వానియొక్క భేదంబును ప్రసక్తమయినఁ గదా ! ఆత్మకు సజాతీయ విజాతీయ స్వగతంబులును వానియొక్క భేదంబును లేదనెడి శ్రుతి తోఁచవలెను. ప్రసక్తమయినదా యనిన; ప్రసక్తమయినది. ఎట్లు ప్రసక్తమయిన దనిన; వస్తుత్వసమానముచేత, వస్తుత్వసమాన మనఁగా నెయ్యది ? ఆత్మ యొక వస్తువు, అనాత్మ యొకవస్తువు నని తోఁచుట వస్తుత్వసమానము. అనాత్మయైన వస్తువునందు సజాతీయ విజాతీయ స్వగతములును వానియొక్క భేదంబు నున్నది గావున ఆత్మయు నొకవస్తువగుటచేత ఆ యాత్మయందు సజాతీయ స్వగతత్వంబును వానియొక్క భేదంబును ప్రసక్తమాయెను. కాఁబట్టి ఆత్మయందు సజాతీయ విజాతీయ స్వగతత్వంబులును వాని యొక్క భేదమును లేదని శ్రుతి చెప్పినమాత్రముచేత నీ యర్థము మనకు బుద్ధియం దెటువలె నెక్కుననిన; విచారించినచో నెక్కును.

అది యెటులనఁగా; ఆత్మయనఁగా; సద్రూపుఁడు కదా! సద్రూపుఁడైన యాత్మకు స్వతంత్రము లేదు. కాఁబట్టి సజాతీయంబును సజాతీయభేదంబును లేదు. అట్లయితే నీవున్నాఁడవు, నేనున్నాఁడను, నీడున్నాఁడు, వాఁడున్నాఁడు, దేవదత్తుఁడున్నాఁడు, యజ్ఞదత్తుఁడున్నాఁడు, కృష్ణుఁడున్నాఁడు, రాముఁడున్నాఁడు అనియును 'పృథివీసతీ, ఆపస్సత్యాః, తేజస్సత్, వాయుస్సత్' అనియును సత్తుక నేక భేదములు కానఁబడుచున్నవి గనుకను ఆత్మకు సజాతీయభేదము లేదని యెట్లు చెప్పవచ్చునని; అంతటను 'సత్ సత్ సత్' అనే సత్తు యేకరూపమైయున్నది గనుక ఆత్మకు సజాతీయంబును భేదంబును లేదని చెప్పవచ్చును. సత్తు ఏకరూపమైయున్నది. దానికి భేదము లేదని చెప్పితిరి. 'ఘటః ఘటః ఘటః' అనునదియును నేకరూపంబుగా నున్నది. కాఁబట్టి అక్కడను భేదము లేకపోవలెను, ఉన్నది గనుక సత్తుకు నేకరూపత్వము చేతను సజాతీయంబును సజాతీయభేదంబును లేదని చెప్పఁగూడదని యంటివేని, ఆ ఘటాదులయందు ఆకారవైలక్షణ్యం బుండుటవలనను సత్తునం దయ్యాకారవైలక్షణ్యంబు లేకుండుటవలనను సద్రూపుఁడైన ఆత్మకు సజాతీయంబును సజాతీయభేదంబును లేదు. అయితే ఆత్మకు విజాతీయంబును విజాతీయభేదంబును గలదా? లేదా? యనిన, ఆత్మయనఁగా; సద్రూపుఁడగుటవలన నయ్యాత్మకు విజాతీయ మసత్తు. అసత్తనఁగా; ప్రపంచము. ఆ ప్రపంచము లేకయుండెడిది గావున అసత్తనఁబడియెను. ఆ యసత్తయిన ప్రపంచము సత్తయిన ఆత్మకు సద్వితీయత్వమును సంపాదింపనేరదు. అది యెటులనఁగా; అసత్తయిన వంధ్యాపుత్రుఁడు తల్లిని పుత్రవతి యని యెటుల ననిపింపలేఁడో, అటుల అసత్తయిన ప్రపంచమాత్మకు సద్వితీయత్వమును సంపాదింపనేరదు. కాఁబట్టి సత్తయిన ఆత్మకు విజాతీయంబును విజాతీయభేదంబును లేదు. అయితే దృష్టాంతమయిన వృక్షమందు పత్రపుష్పఫలాదులచేతను స్వగతంబును స్వగతభేదంబును బ్రత్యక్షంబుగఁ దోఁచినటువలె ఆత్మకు సచ్చిదానందములచేతను స్వగతంబును స్వగతభేదంబు నున్నదంటివేని దార్ష్టాంతికమైన ఆత్మకైతే సచ్చిదానందములు స్వరూపమాయెను గనుక శబ్దమాత్రము చేత భేదము తోఁచినను ఆ సచ్చిదానందములచేతను ప్రత్యక్షముగా

భేదము తోఁచలేదు గనుకను ఆత్మ కా సచ్చిదానందములచేత స్వగతంబును స్వగతభేదంబును లేదు. సచ్చిదానందములు శబ్దమాత్ర భేదముచేతను హస్తకరపాణిశబ్దములవలె పర్యాయపదములు కాకుండుటవలనను శబ్దభేదములవలె పర్యాయపదములు కాకుండుటవలనను శబ్దభేదమువలన నర్థభేదంబును గలిగియుండుటవలనను సచ్చిదానందములకు భేదము కలదు. కాఁబట్టి సచ్చిదానందములవలన నాత్మకు స్వగతభేదంబునుం గలదని చెప్పితివేని సచ్చిదానందములకు శబ్దభేదంబు నర్థభేదంబున్నను, ఆ సచ్చిదానందములచేత నాత్మకు భేదము లేదనుట దృష్టాంతపూర్వకముగ వివరించెదము.

అగ్నియందు లోహితమనియు, నుష్ణమనియుఁ, బ్రకాశమనియు మూఁడువిధంబులున్నవి. ఈ మూఁడువిధంబులైన లోహితోష్ణప్రకాశంబులు ఆ శబ్దభిన్నంబులైనప్పటికిని యీ శబ్దంబులయం దర్థభేదము తోఁచినప్పటికిని హస్తకరపాణిశబ్దములవలె పర్యాయశబ్దములు గాకపోయినప్పటికిని యీ సచ్చిదానందము లాత్మకు స్వరూపమే. సందేహము లేదు. ఇంతేకాదు; దృష్టాంతమయిన అగ్నికి స్వరూపమయిన లోహితోష్ణప్రకాశములు లోకసమయమందు ప్రత్యక్షంబుగఁ బ్రతిబంధము కానఁబడును గనుక వానికి ధర్మత్వగుణత్వంబులు చెప్పినఁ జెప్పవచ్చును. దార్ష్టాంతికమయిన ఆత్మయం దన్ననో సచ్చిదానందంబులకు సర్వాత్మనా భేదము చెప్పఁగూడదు. ఎందుచేత చెప్పఁగూడదనిన; శ్రుతికి విరోధమగుటవలనను ఆత్మ నిరవయవుఁడగుటవలనను చెప్పఁగూడదు. కాఁబట్టి సచ్చిదానందంబు లఖండములు. అందువలన సద్వితీయత్వము. అదెట్లనిన; సత్తే స్వయముగాఁ దోఁచుచున్నది గనుక చిత్తాయెను. ఆ చిత్తైన సత్తు రెండువస్తువులు గలిగినది గాకపోయెను గనుక అదియే ఆనందమాయెను. కావున సచ్చిదానందంబులకు భేదంబు లేదు. అయితే ఆత్మకు నద్వితీయత్వము యుక్తియుక్తమయిన యనుభవము లేక యీ చెప్పినమాటమాత్రముచేతనే ఆత్మ యద్వితీయుం డని బుద్ధియం దెటుల యెక్కు ననిన; విచారింపఁగా బుద్ధియం దెక్కును. ఎటులయనిన; లేనివస్తు వున్నదని చెప్పఁగూడదు గనుక సత్తున్నదనుటకు సందేహము లేదు, ఆ సత్తు తోఁచుచున్నదా? యనిన; తోఁచని

వస్తువు కలదనుటకు వ్యవహారంబునకు విషయంబు గాదు గావున సత్తు తోఁచుచున్నదని చెప్పవలయును. ఆ తోఁచునట్టి సత్తు స్వయముగాఁ దానే తోఁచుచున్నదో మఱియొక దానివలన తోఁపింపఁబడుచున్నదో యనిన; తానే యని చెప్పవలెను. కాఁబట్టి ఆసత్తే చిత్తై సిద్ధించుచున్నది. అటుగాక యన్యముచేతఁ దోఁచుచున్నదని చెప్పినట్లయితే ఆ సత్తును తోఁపించునదియే అన్యము. అది సదంతరమో సద్విలక్షణమో యనిన; సదంతర మని చెప్పవలయును. తాను నికృష్టమై యుండి సత్తును తోఁపించుచున్నదో లేక సామ్యమయి యుండి తోఁపించుచున్నదో యనిన; ఆ యాత్మస్వరూపమయిన సత్తును తోఁపించుచునుండు సదంతర మంతకన్న నికృష్టమయియుండి ఆసత్తును తోపించుచున్నదని చెప్పినపక్షమందు సూర్యునికన్న నికృష్టమయిన దీపము సూర్యుని తోఁపింపవలయును. అటువలె తోఁపించలేదు. కాఁబట్టి సదంతరము సత్తుకంటె నికృష్టమయియుండి ఆ సత్తును దోఁపించుచున్నదని చెప్పఁగూడదు.

అయితే, ఆసదంతరము సత్తుకు సమానమయి యుండి ఆసత్తును తోఁపింపఁ జేయుచున్నదని చెప్పుటకు దీపమునకు సమానమయిన దీపాంతర మాదీపంబుతోఁపింపవలెను. కావున ఆసదంతరంబునకు ప్రకాశాతిశయంబును సంపాదించెడి వస్తువు సత్తనియు నిరూపింపరాదు. కనుక అసి సత్తని చెప్పరాదమనిన; అది సప్రకాశమో అప్రకాశమో యని నిరూపింపఁగూడదు. కనుక సప్రకాశమైన సత్తే చిత్తాయెను. సత్తుకు సప్రకాశత్వమును, అద్వితీయత్వంబును వేదాంతులకన్న నన్యులచేత నంగీకరింపఁ బడలేదు. కనుక ఆయాత్మస్వరూపమయిన సత్తును తోఁపించెడి సదంతరంబునకు ప్రకాశాతిశయంబును సంపాదించెడి సప్రకాశమని చెప్పఁగూడదు. చెప్పరాద మనిన; అప్రకాశ మయిన వస్తువు ప్రమాణవస్తువునకు ప్రకాశాతిశయమును సంపాదించుట కానము గనుక అప్రకాశ మని చెప్పఁగూడదు. అయితే, అన్యవస్తువు చేత నతిశయమును బొంది సదంతర మాత్మ యని యతనితోఁ జెప్పు చున్నదని చెప్పినచో అన్య వస్తు వనఁగా; నసత్తు గావున నటులనుం జెప్పఁగూడదు. అట్లయితే ఆత్మస్వరూపమయిన సత్తుకు ప్రకాశాతిశయమును సంపాదించెడి సదంతరమునకు ప్రకాశాతిశయమును సంపా

దించునట్టి సత్తు మఱియొకటి యని చెప్పవలెను. అటుల చెప్పినట్టయితే ఆసత్తుకు ప్రకాశాతిశయమును సంపాదించెడి సత్తు ఒకటి, ఆసత్తుకు ప్రకాశత్వమును సంపాదించెడి సత్తు మఱియొకటి యని ఈప్రకారముగా ననవస్థాదోషంబును ఆప్రకాశత్వంబును వచ్చి అద్వితీయత్వమును చెప్పెడివారికి పరిహారంబుగా పిడుగు పడినట్లగును. లోకంబునం దొకవస్తువున కతిశయమును సంపాదించు వస్తువు తా నతిశయముగ నుండగ మఱియొక వస్తువున కతిశయమును సంపాదించుచున్న దనుట అజ్ఞులయందు కన్నారము గనుక పక్షత్రయంబును గూడదు. సత్తు తోఁపించెడి సదంతరము తానే ప్రకాశమయి యుండి ఆ సద్వస్తువును తోఁపించుచున్నది యని చెప్పవలయును. ఇటువలె చెప్పినట్లయితే సత్ప్రకాశ మయిన సదంతరము చిత్తె సిద్ధించును. అట్లయితే లోకంబునం దాకాశమువలె నుపాధి వినాగా సత్తాద్వయంబు నిరూపింపఁగూడదు గనుకను నిరుపాధికమయిన సత్తే అద్వితీయ మని శ్రుత్యాదులచేత నిరూపింపఁబడినది గనుక అప్రకాశమయిన సదంతరముచేతను ఆత్మయైన సత్తు తోఁపింపఁబడుచున్న దని చెప్పఁగూడదు.

మఱి యెటు లనఁగా; ఆత్మస్వరూపమయిన సత్తు తానే ప్రకాశమయి యున్నది గనుక అదే చిత్తనిపించుకొనును. ఇటుల చెప్పక ఘటాదులకు విలక్షణమయిన దీపాదులచేతను ఘటాదులకువలె సత్తుకు విలక్షణమైన వస్తువుచేతను సత్తు తోఁపించుచున్నదని చెప్పెద మన; దృష్టాంతమందు ఘటాదులును దీపాదులును సమానసత్తాకంబులై యున్నవి గాన ఆఘటాదులకంటె దీపాదుల కపేక్షించిన ప్రకాశత్వము ప్రత్యక్షముగఁ గానఁబడుచున్నది గనుక దీపాదులచేతను ఘటాదులు తోఁపింపవచ్చును. దార్ష్టాంతికమం దయితే సద్విలక్షణ మయిన వస్తువు అసత్తు గనుక దానికి వస్తుత్వము చెప్పఁగూడదు. సద్విలక్షణమగు నసత్తుచేత సత్తు తోఁపింపఁబడుచున్న దని చెప్పఁగూడదు. లోకమందు వనము కాదు వీనియందు లేని దీపాదులచేత నైనఁగాని భ్రాంతిచేత తోఁచునట్టి యుపాధ్యనేకములచేత నైనఁగాని, ఘటాదులు తోఁచుచున్నవని చెప్పఁగూడదు. కాఁబట్టి లోకమందు సత్తును తోఁపించెడి పదార్థ మొకటియైన లేకుండుటవలనను సమస్తపదార్థంబులును

సత్తునం దారోపింపఁబడుటవలనను ఆ పదార్థంబులు సత్తును ఉపజీవించు కొని తోఁచుటవలనను సత్తు స్వప్రకాశ్యమయినది. ఆ స్వప్రకాశ్యమయిన సత్తే చిత్తు. ఆ చిత్తయిన సత్తుకు విలక్షణమైయుండు వస్తువు అసత్తయియున్నది గనుక ఆ సత్తే రెండువస్తువులు గలిగినది గాకపోయెను గనుక ఆ సత్తే చిత్తయి యానందస్వరూపమాయెను. లోకంబునందు రెండువస్తువులు గలిగినది గాకపోయిన వస్తువే యానందమై యుండుట కలదా ? యనిన; కలదు.

అది యెటు లనఁగా ; సుషుప్తియందు రెండవవస్తువు లేనందున నదియే యానందమాయెను. జాగ్రత్స్వప్నంబులయందు రెండవవస్తువు కలిగియుండుటవలన దుఃఖమే తోఁచుచున్నది. జాగ్రతయందు నేకాంతమై (కార్యాలోచన, మోహాము మున్నగు విషయములందు మనస్సు ఏకాగ్రత నొంది పారవశ్యమున) యున్నసమయంబున రెండవవస్తువు ననుసంధానము చేయకుండుటవలన సమస్తమయినవారికి నానందమే తోఁచుచున్నది. ఏకాంతమం దుండెడి పురుషుఁడు రెండవవస్తువును స్మరింపక సుఖముగ నున్నప్పటికిని, అవశ్యముగ రెండవవస్తువును స్మరింపఁజేయునట్టి యొకశబ్దశ్రవణంబేనియు నొకరూపదర్శనంబేనియుఁ దోఁచుచుండఁగా నుభయరూపకమైన దుఃఖమే తోఁచుచున్నది. వస్త్వంతర మగపడెనేని భయముఁ కలుగునని శ్రుతి చెప్పుచున్నది గనుక సుషుప్తియందు వస్త్వంతరము తోఁచలేదు గావున ఆనంద మాయెను. ఆ సుషుప్తి యానందమందుఁ గల్పింపఁబడిన దగుటవలన రజ్జ్వాదులయందు కల్పింపఁబడిన సర్పాదులవలె నానందవ్యతిరిక్తము గాకపోయెను. అందువలన నానందమని చెప్పఁబడుచున్నది. కాఁబట్టి సద్రూపుఁడయిన యాత్మకు సదంతరము లేదు. కనుక సజాతీయంబును సజాతీయభేదంబును విజాతీయమును నసత్తయి యున్నవి గనుక విజాతీయంబును విజాతీయభేదంబును లేదు. సత్తే చిత్తు, చిత్తే ఆనందంబు నయ్యెఁగాన స్వగతంబును స్వగతభేదంబును లేదు. కాఁబట్టి ఆత్మకు సజాతీయ స్వగతభేదములు లేవు. అందువలననే ఆత్మ యద్వితీయుం డని శ్రుతి చెప్పెను. యుక్త్యనుభవముల చేతను సిద్ధమే. అద్వితీయుఁడైన యాత్మ నేనని ముముక్షువులైనవార లెఱుఁగఁదగినది, ఆత్మ యద్వితీయుఁ డని

శ్రుతి యెట్లు చెప్పుచున్నదో అటులే ఆత్మ పరిపూర్ణుఁడని శ్రుతి చెప్పుచున్నది. కనుక ఆత్మకు పరిపూర్ణత్వమెటువలెనని విచారించుచున్నాము. పరిపూర్ణత్వమనఁగా—వ్యాపకత్వమా? లేక విభుత్వమా? లేక అపరిచ్ఛిన్నత్వమా? యనిన; అపరిచ్ఛిన్నత్వమే పరిపూర్ణత్వమని చెప్పవలెను. వ్యాపకత్వమే పరిపూర్ణత్వమని చెప్పఁగూడదా? యనిన; వ్యాపకత్వము స్వకార్యమైనందున నాకార్యము పృథివ్యాదులకు నున్నది గనుక వ్యాపకత్వము పరిపూర్ణత్వమని చెప్పఁగూడదు. అయితే విభుత్వమే పరిపూర్ణత్వమని చెప్పరాదమనిన; విభుత్వము సర్వమూర్తద్రవ్యసంయోగమగుటవలన నది యాకాశాదులకు నున్నది. కనుక విభుత్వము పరిపూర్ణత్వమని చెప్పఁగూడదు. కనుక అపరిచ్ఛిన్నత్వమే పరిపూర్ణత్వమని చెప్పవలెను. ఈ యపరిచ్ఛిన్నత్వము పరిచ్ఛిన్నమైన పృథివ్యాకాశాదులకు లేదు. ఆత్మకైతే వ్యాపకత్వవిభుత్వాపరిచ్ఛిన్నత్వములు కలవు. ఎటులనఁగా—పృథివ్యాదులకు స్వకార్యములైన చతుర్విధభూతగ్రామాదులయందు ననున్యూతత్వ మెటువలెనున్నదో అటువలెనే ఆత్మకును స్వకార్యమైన ప్రపంచమం దనున్యూతత్వం బుండుటవలన వ్యాపకత్వంబున్న యది. ఆకాశాదులకు సర్వమూర్తద్రవ్యసంయోగిత్వమెట్టులున్నదో అటులే ఆత్మకును సర్వమూర్తద్రవ్యసంయోగిత్వమున్నది. కనుక విభుత్వంబు నున్నది. అట్లగుటవలన వ్యాపకుండు విభుండు నగువాఁడే యాత్మయని చెప్పవలయును. అటుల చెప్పినట్లయితే ఆత్మకు అద్వితీయత్వము తోఁచుచున్నది. గనుక అపరిచ్ఛిన్నత్వమే పరిపూర్ణత్వమని చెప్పవలెను. అటుల చెప్పుటవలన పూర్వము చెప్పఁబడిన అద్వితీయత్వమే యపరిచ్ఛిన్నత్వముగ సిద్ధించెను. ఆ యద్వితీయత్వమే యపరిచ్ఛిన్నమైనప్పటికిని మఱియును విశేషముగ విచారించుచున్నారము. అది యెట్టులనిన; త్రివిధపరిచ్ఛేదశూన్యత్వమే యపరిచ్ఛిన్నత్వము. పరిచ్ఛిన్నత్వమందుఁ బ్రసక్తమాయెనా? యనిన; అనాదిగా భ్రాంతిచేతను బ్రసక్తమైయున్నది. ఎటుల ప్రసక్తమాయెననిన; ఈదేశమం దుంటి, ఈదేశమం దుండలేదని దేశముచేతను, ఈ సంవత్సరంబునందుఁ బుట్టితిని. ఇఁకమీఁద లేకపోవుచున్నానని కాలముచేతను, ఈ వస్తువు నేను గానని వస్తువుచేతను, పరిచ్ఛిన్నుఁడై దోఁచుచున్నాఁడు. భ్రాంతిచేతఁ దోఁచునట్టి ఈ పరిచ్ఛిన్నత్వము విచారింపఁగా లేకపోవుచున్నది.

అది యెట్లు లనిన; ఆత్మ యంతటను వ్యాపకుఁడై యుండుటవలన దేశముచేతను, నిత్యుఁడై యుండుటవలన కాలముచేతను, సర్వాత్ముఁడై యుండుటవలన వస్తువుచేతను పరిచ్ఛిన్నత్వము లేదు. ఆత్మకు త్రివిధ పరిచ్ఛేదశూన్యత్వమే యపరిచ్ఛిన్నత్వమని యెందుకు చెప్పవలెను. దేశముచేత పరిచ్ఛేదము లేకుండుటయే యపరిచ్ఛిన్నత్వమని చెప్పుద మనఁగా; ఆకాశమునకును దేశముచేత పరిచ్ఛేదము లేదు. కనుక దానికి అపరిచ్ఛిన్నత్వము వచ్చును. ఆ యాకాశమునకు అపరిచ్ఛిన్నత్వమును త్రోయుటకొఱకు కాలముచేతను ఆత్మ పరిచ్ఛేదరహితుఁ డని యంగీకరింపవలెను. అయితే ఆకాశమునకు కాలముచేత పరిచ్ఛిన్నత్వము కలదా? యనిన; శ్రుతియం దాకాశమునకు నుత్పత్తినాశములు చెప్పఁబడెను. కనుక కాలముచేతను ఆకాశమునకు పరిచ్ఛిన్నత్వము కలదు. అయితే ఆత్మకు దేశకాలములచేత పరిచ్ఛేదరాహిత్యమే యపరిచ్ఛిన్నత్వమని చెప్పుదమనిన; కాలమునకు దేశముచేతను తనచేతను పరిచ్ఛేదరాహిత్యమున్నది. కనుక దానికి పరిచ్ఛిన్నత్వము వచ్చును. దానికి అపరిచ్ఛిన్నత్వమును త్రోయుటకొఱకు వస్తువుచేత పరిచ్ఛేదరాహిత్యమే యపరిచ్ఛిన్నత్వమని యంగీకరింపవలయును. అయితే కాలమునకు వస్తువుచేత పరిచ్ఛిన్నత్వము కలదా యనిన; కాల మాకాశాది వస్తువు కాదు. కనుక వస్తువుచేత కాలమునకు పరిచ్ఛిన్నత్వము కలదు. ఇటుల చెప్పుటచేత ఆత్మకు వస్తువుచేత పరిచ్ఛిన్నత్వము తోఁచుచున్నది.

అది యెటులనిన; ఆత్మ వ్యాపకుఁడై యున్నాఁడు. కనుక ఆత్మకు దేశకాలములచేత పరిచ్ఛేదరాహిత్యము కలిగియున్నప్పటికిని ఆత్మ యాకాశాదివస్తువు కాదు. కనుక వస్తువుచేత పరిచ్ఛేదముతోఁచుచున్నదంటివేని ఆత్మకు వస్తువుచేతను పరిచ్ఛిన్నత్వము లేదు. ఆకాశము, వాయువు, తేజస్సు, అప్పు, పృథివి వీనికి కాలమనెడి వ్యవహారము లేదు గావునను, కాలము నుపజీవించుకొని యాకాశాదులు ఉండలేదు గనుకను, వానివలెనే కాలమవిద్యాపరిణామము గనుకను, వ్యవహారంబునందు ఆకాశాదులును కాలంబును భిన్నసత్తాకంబులై తోఁచుచున్నవి గనుకను ఘటాదులచేత ఘటాదులకు పరిచ్ఛిన్నత్వ మెటుల ప్రత్యక్షమో అటులే ఆకాశాదులచేత కాలమునకు పరిచ్ఛిన్నత్వము ప్రత్యక్షముగా తోఁచుచున్నది. కనుక వస్తువుచేత కాలమునకు పరిచ్ఛిన్నత్వము

యుక్తము. ఆత్మయైతే ఆకాశాదులుగాని వానివలెఁ దోఁచినప్పటికిని సత్తై యున్నాఁడు గనుకను ఆ యాత్మస్వరూపమైన సత్తును ఉపజీవించు కొని ఆకాశాదు లున్నవి గనుకను రజ్జ్వాదులయం దారోపింపఁబడిన సర్పాదులు రజ్జ్వాదులకంటెఁ బరిచ్ఛిన్నము లెటుల కావో మృత్తునందుఁ దోఁచెడి ఘటాదులు మృత్పరిచ్ఛిన్నము లెటువలెఁ గావో అటువలెనే ఆత్మస్వరూపమైన సత్తుకంటె వేఱుగా లేదు గాన ఆత్మకు పరిచ్ఛేదకములు కావు గనుక ఆత్మకు వస్తువువలనను బరిచ్ఛిన్నత్వము లేదనెడిది యుక్తమే. అట్లైతే దేశంబును కాలంబును వస్తువులై యున్నవి గాన వస్తువుచేతను పరచ్ఛేదరాహిత్యమే ఆత్మకు అపరిచ్ఛిన్నత్వ మని చెప్పినఁ జాలదా యనినఁ; జాలును. అయినను దేశకాలంబులకు ఆకాశాదులకువలె వస్తుత్వప్రసిద్ధి లేదు గనుక ఆత్మకు స్వతస్సిద్ధమయిన వ్యాపకత్వంబును నిత్యత్వంబును సర్వాత్మకత్వంబును, అనాది యగు నజ్ఞానమువలన వచ్చిన దేహేంద్రియాద్యధ్యాసవలన తోఁచదయ్యెఁ గాన నా భ్రాంతిని దొలఁగఁజేయుటకొఱకు త్రివిధపరిచ్ఛేదశూన్యత్వ మపరిచ్ఛిన్నత్వమని చెప్పవలసివచ్చెను. అదే యఖండత్వము. అదే యద్వితీయత్వము అని శ్రుత్యాదులచేతఁ జెప్పఁబడినది. ఈ చొప్పున విచారించి పరిపూర్ణుఁడయినయాత్మ నేనని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము. అసంగత్వమును విచారింపుదము. ఆత్మకు సంగిత్వము ప్రసక్తమైనఁగదా అసంగత్వ మెటులని విచారింపవలెను, ఆత్మకు సంగిత్వము గలదా ? యనినఁ; గలదు. ఎటువలెఁ గలదనిన; భ్రాంతిజన్యమయిన దేహేంద్రియాధ్యాసవలన సంగిత్వము తోఁచుచున్నది. ఇంతేకాదు. వారితోఁగూడియుంటిని. వీరితోఁ గూడియుంటిని అని సంగిత్వము తోఁచుచున్నది. విచారించి ఆత్మ యద్వితీయుఁడని యెప్పు డెఱుఁగుచున్నాఁడో, అప్పుడు రెండవవస్తువు లేదు గనుక ఆత్మకు సంగిత్వము దొలఁగును. పరమార్థతః ఆత్మ యద్వితీయుఁడు గనుక అసంగుఁడై యున్నప్పటికిని వ్యవహారకాలమందు సంగివలెనే తోఁచునట్టి యాత్మకు నసంగత్వ మెటువలె కూడుననిన; రజ్జ్వాదులయం దారోపింపఁబడిన సర్పాదులతోడ నారజ్జ్వాదులకు కాలత్రయమందును నెటువలె సంగము లేదో అటువలెనే ఆత్మయం దారోపింపఁబడి తోఁచునట్టి దేహేంద్రియాదిప్రపంచముతోడను ఆత్మకు కాల

త్రయమందును సంగము లేదు. ఇంతమాత్రమే కాదు. లోకమందు సావయవములై యుండెడి పదార్థములను అన్యోన్యసంగము గన్నా రము. నిరవయవములై యుండెడి పదార్థములకు సావయవము లగు పదార్థములతో కాలత్రయమందును సంగము గానమే యనిన; చెప్పి చూపుచున్నారము. పరమార్థమందు నిరవయవము లని సమ్మతమై యుండెడి ఆకాశాదులకు పృథివ్యాదులతోడి సంగము చెప్పఁగానము. సంగము చెప్పినట్టయితే జలాదులసంగమువలన వస్త్రాదులకు ఆర్ద్రత్వాదికము లెటువలె వచ్చుచున్నవో అటువలెనే ఆకాశాదులకు పృథివ్యాదులతోడి సంగమువలన నాయాపృథివ్యాదివికారములు రావలెను. అటువలె వచ్చినది కానము గనుక ఆయాకాశాదులకు పృథివ్యాదుల తోడ నెటువలె సంగము లేదో అటువలెనే ఆత్మయును భ్రాంతివలన దేహేంద్రియాది ప్రపంచముతోఁ గూడుకొనియుండునట్టి వానివలెఁ దోఁచినప్పటికిని ఆత్మ యసంగుఁడే. వ్యవహారకాలమందు పరమార్థము ననుసరించి ఆకాశాదులకు నిరవయవత్వము నంగీకరించి ఈ మేరకు చెప్పితిమి. పరమార్థతః విచారించునపుడు ఆకాశాది సర్వపదార్థంబులు భ్రాంతి వలన నాత్మయం దారోపితములై యున్నవి గాన నాయారోపితము లగు పదార్థములకు రజ్జ్వాదులయందుఁ దోఁచెడి సర్పాదులవలెనే అధిష్ఠానాత్మ సత్తే స్వరూపమై యున్నది గనుక కాలత్రయంబునందు నద్వితీయుండు గాన నసంగుఁడు. ఈ మేరకు విచారించి యసంగుఁడగు నాత్మ నే నని ముముక్షువు తెలియఁగవచ్చును. ఇటువలె నెవఁ డెఱుఁగు చున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము. ఇటుల చెప్పుట వలన ఆత్మకు కర్తృత్వము ప్రసక్తమాయె గదా యనిన; ప్రసక్తి మాయెను. అదెట్లనిన; దేహేంద్రియాద్యధ్యాసమువలన నేను స్నానము చేయఁబోవుచున్నాఁడను, జపము చేసితి. జపము చేయఁబోవు చున్నాఁడను. అగ్నిహోత్రముఁ జేసితిని, అగ్నిహోత్రముఁ జేయఁబోవు చున్నాఁడ. యజ్ఞముఁ జేసితిని, యజ్ఞము చేయఁబోవుచున్నాఁడను అనే కర్తృత్వము అధ్యాసచేత ఆత్మనిష్ఠముగాఁ దోఁచుచున్నది గనుక అకర్తృత్వము లేదని తెలియుటకొఱకు విచారింపవలసివచ్చెను. కర్తృత్వ మనఁగా; క్రియాశ్రయత్వము గనుక అకర్తృత్వము పరిచ్ఛిన్నమై సంగియై సావయవమయి వికారియయిన వస్తువు నాశ్రయించు

కొనియుండుట గన్నారము. ఆత్మయైతే అపరిచ్ఛిన్నుఁడు, నసంగుఁడు, నిర్వికారుఁడు, నిరవయవుఁడు గనుక ఆత్మకర్తృత్వము చెప్పఁగూడదు గనుక ఆత్మ యకర్త యని చెప్పవచ్చును. ఆత్మకు అద్వితీయత్వజ్ఞానము చేతనే అకర్తృత్వము సిద్ధము. అయినప్పటికిని స్పష్టముగా నెఱుంగ వలసి విశేషముగాఁ జెప్పితిమి. వ్యవహారమందు స్నానాదిక్రియాశ్రయత్వము దేహాదులకే కాని వ్యాపకమయిన ఆకాశాదులకుఁ గానము. అపరిచ్ఛిన్నమయిన యాత్మకు లేదనెడివి చెప్పవలసినది లేదు. భ్రాంతి వలన వచ్చినది లేదు. దేహేంద్రియాద్యధ్యాసవలన నాత్మ కర్తవలెనే తోఁచినప్పటికి నవి విచారించునప్పు డాత్మ యపరిచ్ఛిన్నుఁడై యున్నాఁడు గనుక ఆత్మ యకర్త యనుటకు సందేహము లేదు. ఆయకర్తయే నేనని ముముక్షువు తెలియఁదగినది. ఆత్మకు భోక్తృత్వ మెటువలె నని విచారింపుదము. ఆత్మకు భోక్తృత్వము ప్రసక్తమయినఁగదా ఆత్మకు అభోక్తృత్వ మెటువలెనని విచారింపవలెను. ఆ దేవదత్తాదులు తమకు తామే భోజ్యములు యుండుట యెక్కడను కానము. ఆ భోజ్యవస్తువు లేకనే భోక్తృత్వ మెందును గానము గనుక అద్వితీయుఁడయిన ఆత్మకు అభోక్తృత్వము సిద్ధమే. ఈ మేరకు విచారించి యద్వితీయుఁడై యసంగుఁడయి యపరిచ్ఛిన్నుఁడయి యకర్తయై యభోక్తయైన ఆత్మ నేనని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే కృతార్థుఁడు, విద్వాంసుఁడు, సమస్తమైన వారలకును పూజ్యుఁడు, జీవన్ముక్తుఁడునని వేదాంతసిద్ధాంతము. ఈ యర్థమందు సంశయము లేదు.

ఇది చతుర్దశవర్ణకము.

---

# పంచదశవర్ణకము

## ప్రతిబంధత్రయవివేచనము

శ్లో. మాతామహమహాశైలం మహస్తదపితామహమ్,
కారణం జగతాం వందే కంఠాదుపరివారణమ్.

శరీరత్రయనిరూపణము—ప్రాణుల కెన్ని శరీరంబు లని విచారించుచున్నారము. ఈవిచారంబునకు ప్రసక్తి యెయ్యది? ప్రయోజనం

చెద్ది? యనిన; చెప్పెదము. స్థూలశరీరముమాత్ర మందఱికిని ప్రత్యక్షుంబుగఁ దోఁచుచున్నది. మఱి యెద్దియునుం దోఁచలేదు గనుక ఈ విచారంబునకు ప్రసక్తి కలదు. ఇంతియ కాదు, వేదాంతులకంటె నన్యులయిన వారలందఱును దేహేంద్రియంబులు తోఁచినప్పటికిని ప్రత్యక్షుంబుగఁ దోఁచునట్టి శరీర మొకటితప్ప వేఱు శరీరంబు లేదని వచించుచున్నారు. కాఁబట్టి విచారంబునకుఁ బ్రసక్తి కలదు. ఈ విచారంబువలననే సమస్తదేహంబులును దేహాదినిష్ఠమయిన వికారంబులును ఆత్మను కాలత్రయంబునను స్పృశింపలేవని తోఁచుచున్నది. ఇటులఁ దోఁచుటయే యీ విచారంబునకు ఫలము గనుక ఈ విచారంబునకు ప్రసక్తియుఁ బ్రయోజనంబును గలిగెను. ఇందువలన ప్రాణుల కెన్ని శరీరంబు లని విచారింపవలయును. అయితే ప్రాణుల కెన్ని దేహంబు లనిన; స్థూలంబనియు, సూక్ష్మంబనియు, కారణంబనియు మూఁడు దేహంబులు. అందు స్థూలంబునకు శరీరలక్షణంబుండుటవలన స్థూలశరీరమునకు శరీరత్వము వచ్చుట సరియే. సూక్ష్మకారణంబులకు శరీరత్వ మెటు లనిన; వానికి; 'శీర్యత ఇతి శరీరం' అనెడి లక్షణం బున్నది గాన శరీరత్వం బున్నది. జీర్ణత్వము వాని కెచట కనఁబడియె ననిన; సుషుప్తియందును ముముక్షులయందును గనంబడియెం గావున వానికి శరీరత్వము గలదు. ఈ సూక్ష్మకారణశరీరంబులు స్థూలంబు చందంబున ప్రత్యక్షుంబుగఁ గానఁబడకుండుటవలన సూక్ష్మకారణశరీరంబులు లేవని చెప్పవదమనిన; ఈ రెండు శరీరంబులును కలవని శాస్త్రంబులయందుఁ బ్రసిద్ధంబుగఁ జెప్పబడియున్నది. మఱియు పెద్దలవలన నంగీకరింపఁబడి యున్నది. కాఁబట్టి సూక్ష్మకారణశరీరములు లేవని చెప్పఁగూడదు.

అట్లయినచో ఒక ప్రాణికి స్థూలశరీరంబు లెన్ని? సూక్ష్మశరీరంబు లెన్ని? ఒకటొకటి మూఁడుశరీరంబులు శరీరత్వతుల్యంబులై యుండఁగా ప్రాణికి స్థూలశరీరంబు లనంతంబులై సూక్ష్మకారణశరీరంబు లొక్కటొక్కటిగా నేల యనిన; స్థూలశరీరము కర్మజన్యమగుటచేత దానికి సాంఖ్యము కలిగెను. సూక్ష్మకారణశరీరంబులు కర్మజన్యంబులు గాకుండుటవలన నొకటొకటియయ్యెను. సూక్ష్మ కారణశరీరంబులు కర్మజన్యంబులు గావని చెప్పినందున సూక్ష్మశరీరంబునకు ప్రకారాంతరముచేత

జన్యత్వంబును కారణశరీరంబునకు నెటువలెఁ గూడునని తోఁచుచున్నది. తోఁచినం దోఁచ నిమ్మనిన; కారణశరీరంబునకు జన్యత్వంబు నంగీకరించినందున శరీరత్వమే లేకపోవుచున్నది. పోయినం బోనిమ్మనిన; ప్రాణులకు మూఁడుశరీరంబులని చెప్పినది అసమంజసమగును. ఇఁకను సూక్ష్మశరీరంబునకు ప్రకారాంతరంబువలన నుత్పత్తి నంగీకరించినచో జీవున కనాదిత్వము పోవుచున్నది. జీవున కనాదిత్వ మెందుకొఱకు పోవుచున్న దనఁగా; ఆత్మకు జీవత్వము సూక్ష్మశరీరమను నుపాధిచేత వచ్చిన దని చెప్పుచున్నారు గనుక జీవుని యుపాధియైన సూక్ష్మశరీరమునకు నుత్పత్తిని జెప్పుటచే జీవున కనాదిత్వము పోవుచున్నది. జీవునకు ననాదిత్వంబు సిద్ధించుటకొఱకు సూక్ష్మశరీరంబున కుత్పత్తి నంగీకరింపక యుండుద మనిన; సూక్ష్మశరీరంబునకు నుత్పత్తిని చెప్పుటచేత శ్రుత్యాదులకు విరోధంబు వచ్చుచున్నది. ఇంతమాత్రమే కాదు; సూక్ష్మశరీరంబునకు జన్యత్వంబు నంగీకరింపకపోయినచో సూక్ష్మశరీరంబునకు నిత్యత్వంబు వచ్చి అద్వితీయత్వంబై పోవుచున్నది. కావున శ్రుత్యాదులయందలి యర్థము సిద్ధించుటకొఱకును ఆత్మ కద్వితీయత్వము సిద్ధించుటకొఱకును సూక్ష్మశరీరంబున కుత్పత్తి నంగీకరించినచో ఆ జీవున కనాదిత్వము పోయినది.

ఇదిగాక లోకంబునం దెయ్యవి జన్యంబులయి యున్నవో అవి యన్నియును కర్మజన్యంబులుగానే యున్నవి. కాఁబట్టి సూక్ష్మశరీరంబునకు జన్యత్వంబు నంగీకరించునపుడు కర్మజన్యం బనియే యంగీకరింపవలెను. అట్లు గానియెడల ద్రష్టృవిరోధము వచ్చుచున్నది. వచ్చెనేని రానిమ్మనిన; అది యుక్తము గాదు. ఈ విరోధమును పరిహరించుటకై సూక్ష్మశరీరమునకు కర్మజన్యత్వము నంగీకరించినచో కర్మజన్యమగు స్థూలశరీరమునకువలె ననేకత్వము రావలెను. అటుల నేకత్వంబు నంగీకరించినపక్షమం దొక ప్రాణి కొక సూక్ష్మశరీరమని చెప్పినది వ్యర్థమగుచున్నది. వ్యర్థమయినం గానిమ్మనిన; పూర్వ మొకటియనియుఁ గర్మజన్యము కాదనియును చెప్పి యిప్పుడు అనేకమనియుఁ గర్మజన్య మనియును జెప్పుటవలన పరస్పరవిరోధము సంభవించుచున్నది. ఈ ప్రకారముగా నొక దోషమును పరిహరించినపుడు మఱియొకదోషము సంప్రాప్తమగుచున్నది గాన నీ విచారమును వదలి మఱియొకవిచారము

నారంభించుదమనిన; మఱియొకటిని చెప్పుటకు వీలు లేదు గనుక ఇప్పుడి సూక్ష్మశరీరము కర్మజన్యమని చెప్పినందుచే జీవుని అనాదిత్వంబున కును సూక్ష్మశరీరం బొకటి యనుటకును పూర్వము సూక్ష్మశరీరము కర్మజన్యము కాదని చెప్పినందుకు విరోధము రాకుండునటుల ముందఱఁ జెప్పుచున్నారము. ఇప్పుడు కారణశరీరమునకు జన్యత్వమును చెప్పకయే శరీరత్వలక్షణమును జెప్పుచున్నారము.

అది యెటు లనఁగా; సూక్ష్మశరీరంబునకు జన్యత్వంబు నంగీకరించికదా వానికి శరీరత్వ మంగీకరింపవలెను. కారణశరీరంబునకు జన్యత్వంబు నంగీకరింపకయే శరీరత్వ మెటుల చెప్పఁబడునంటి వేవి దానికిని 'శీర్యతే'అనెడి శరీరలక్షణం బున్నయది గావున చెప్పవచ్చును. అయితే అనాదియగు వస్తువునకు నాశము గలదా యనిన; కలదు. అది యెటు లనఁగా; ఘటాదిప్రాగ్భావ మనాదియై యున్నప్పటికిని, దానికి ఘటోద్యుత్పత్తిచేతను నాశంబును, ప్రకృతిపురుషసంయోగ మనాదియయి యున్నప్పటికిని ఆ ప్రకృతిపురుషులయొక్క వివేకముచేత నా సంయోగమునకు నాశం బెటులనో అటులనే అనాదియైన అజ్ఞానమనెడి కారణ శరీరంబునకును బ్రహ్మాత్మైకజ్ఞానమువలన నాశము వచ్చుచున్నది గనుక దానికి శరీరత్వంబు నంగీకరించుట విరుద్ధంబుగాదు. ఈ చొప్పున సూక్ష్మశరీరంబునకు నుత్పత్తి నంగీకరించినయెడల నొకవిరుద్ధంబును లేదు. ఆ సూక్ష్మశరీరం బాత్మకార్యంబై యున్నది గావున కారణంబగు నాత్మకంటె వ్యతిరిక్తంబుగ లేకుండుటవలనఁగారణంబైన యాత్మకంటె వ్యతిరిక్తము కాదు. ఆత్మ కద్వితీయత్వహానియును లేదు. ప్రళయంబు నందును సూక్ష్మశరీరంబు కారణాత్మకంబుగ నున్నది గనుకను ఆ సూక్ష్మశరీరమున కుపాధిగాఁ గలిగిన జీవసంస్కార మున్నది గనుకను జీవున కనాదిత్వభంగమును లేదు. అయితే సూక్ష్మశరీరంబు ప్రళయంబునం దుండె నేని దానికి నుత్పత్తి చెప్పఁగూడదు. అది యెటులనఁగా; మృదాదులయందు లేని ఘటాదులకు మాత్ర ముత్పత్తిని గంటిమి. మృదాదులకు ఉత్పత్తిని కానమే యనియెద వేని, వస్తువనఁగా, నసత్తు, ఆయసత్తునకు ఉత్పత్తిని చెప్పునపుడు శశవిషాణాదులకును ఉత్పత్తిని చెప్పవలసివచ్చును. అవి పుట్టలేదు గనుక అసత్తుకు ఉత్పత్తిని చెప్పఁగూడదు. మఱి యెటులనఁగా; ఉంపునట్టి వస్తువు సత్తు. ఆ సత్తునకు

ఉత్పత్తిని చెప్పవలెననుట లోకమందుఁ గన్నారము అది యెట్లనిన; ఘటము చేయవలెనని ప్రవర్తించునట్టి పురుషుఁడు మృత్తికను గొని వచ్చును. కోక నేయవలయునని ప్రవర్తించునట్టి పురుషుఁడు తంతువులను గొనివచ్చును. పెరుగు వెన్న సంపాదింపఁ గోరునట్టి పురుషుఁడు పాలు సంపాదించును. నూనియ గావలసినట్టి నరుఁడు నువ్వులను సంపాదించును గనుక ఈ మృదాదులయందు ఘటాదులు లేకున్న నా కులాలాదులు మృదాదులను నియతంబుగ నెందుకొఱకు సంపాదింతురు? సంపాదించుచున్నారు గాన ఉండునట్టి వస్తువునకే ఉత్పత్తిని చెప్పవలెను. అటుగాక లేనివస్తువునకు ఉత్పత్తిని చెప్పినచో ఈ కార్యమునకిది కారణమను నియమము లేకపోవుచున్నది ఆ నియమము లేకపోవునపుడు తంతువులవలన ఘటంబును, మృత్తువలనఁ బటంబును, నీళ్లవలనఁ బెరుఁగును, ఇసుకవలన నూనెయును పుట్టవలెను. అటుల పుట్టుట గానము గనుక ఆయావస్తువులకు నియతమైన కారణము లుండుట కన్నారము. కాఁబట్టి ఉండెడి వస్తువే పుట్టుచున్నదని చెప్పవలెను. అయితే ఆయా కార్యంబులకు కారణంబులైన వస్తువులు నుండు నవి యగుటవలన నవియు నిటువలెనే పుట్టుచున్న వని చెప్పఁగూడదు. ఆ మృదాదులకు ఉత్పత్తి ప్రత్యక్షముగాఁ గనఁబడలేదు గాన నీ ఘటాదులకువలె వీటికి కారణములైన మృదాదులకు నుత్పత్తి చెప్పఁగూడదు. ఇదియునుగాక; యీ కారణములగు మృదాదుల కొక్కొక్క దిక్కున నుత్పత్తి గనఁబడినప్పటికిని, శ్రుత్యాదులచేత పృథివ్యాదులకును జన్యత్వము వినఁబడినప్పటికిని, సర్వకారణ మగు ఆత్మకు ఉత్పత్తి కల దని యొక ప్రమాణమేనియు లేదు గనుకను అవస్థావిదోషములు వచ్చుచున్నవి గనుకను సర్వకారణమయిన ఆత్మకు ఉత్పత్తిని చెప్పఁగూడదు. ఉండెడి వస్తువునకు ఉత్పత్తిని జెప్పుట యుక్తియుక్తము గాదని చెప్పఁగూడదు. అది యెటువలె ననిన; ఈ చెప్పిన యుక్తులచేత నసత్తునకు ఉత్పత్తి చెప్పఁగూడకపోయెను గనుక సత్తునకు ఉత్పత్తిని చెప్పవలెను. సత్తనఁగా నుండెడి వస్తువు. దానికి ఉత్పత్తి నెటువలెఁ జెప్పఁగూడుననిన; పూర్వము తోఁచక నామరూపాంతరమైన కారణాత్మకముగా బీజములయం దుండెడివృక్షముల కెటు లుత్పత్తియో, అటులే ప్రళయమందును తోఁచక నామరూపాంతరమయి యుండెడి సూక్ష్మశరీరాదులు

నామరూపాత్మకముగఁ దోఁచుటయే యుత్పత్తి. అట్లయితే అనభివ్యక్త రూపమైయుండెడి కారణము. అభివ్యక్తనామరూపమైయుండెడి కార్యము వీటికి భేదము కలదా యనిన; కార్యము కాలత్రయమందును కారణాత్మకమై యున్నప్పటికిని ఘటాదులు కులాలాదివ్యాపారము నపేక్షించుట యుక్తమే. పూర్వము చెప్పిన కాలత్రయమందును కార్యము కారణాత్మకముగా నున్నది గనుక ప్రళయమందును ఆత్మకు జీవత్వమందు ఉపాధిభూతమైన సూక్ష్మశరీరము కారణాత్మకముగా నున్నది. కనుక ప్రళయమందును ఆత్మకు జీవత్వము సంస్కారాత్మకముగా నున్నది. కనుక జీవున కనాదిత్వభంగము లేదు. ఆ సూక్ష్మశరీరము నామరూపాత్మకముగాఁ దోఁచుటయే యుత్పత్తి యని యంగీకరింపఁబడియె. కాన శ్రుత్యాదులకును విరోధము లేదు. ఈ దోష మెటుల పరిహరించినప్పటికిని లోకమందు జన్యములగు వస్తువులకు కర్మజన్యత్వంబును అనేకత్వంబును కన్నారము. కనుక సూక్ష్మశరీరంబు జన్యమగునపుడు దానికి కర్మజన్యత్వంబును అనేకత్వంబును వచ్చునట్టి దోషంబు పరిహరింపఁబడ లేదంటివేని, వానికిని పరిహారము చెప్పెదము. అది యెటువలె ననిన; ఆ సూక్ష్మశరీరమునకు కర్మజన్యత్వంబును అనేకత్వంబును అంగీకరింపక దోషంబులు పరిహరింపవలెను. ఇటువలె నంగీకరించునపుడు పూర్వము సూక్ష్మశరీరము కర్మజన్యంబు గాదనియును, అది యొకటియనియును జెప్పినందున విరోధంబు దోఁచుచున్నదే యనిన ; ఈ విరోధంబు లేకుండునటుల దోషపరిహారంబుఁ జేసెదము. అది యెట్టు లనిన; జన్యమంతయుం గర్మజన్యంబే యని గ్రహింపవలయును గాన నా జన్యంబు సామాన్యకర్మజన్యంబనియు, విశేషకర్మజన్యంబనియు రెండువిధంబులు. ఈ ద్వివిధంబునందు సూక్ష్మశరీరంబునకు సామాన్యకర్మజన్యత్వ మంగీకరింపఁబడియెం గావున జన్యమాత్రంబునకు కర్మజన్యనియమభంగంబు లేదు. ఈ సూక్ష్మశరీరంబునకు సామాన్యకర్మజన్యత్వ మంగీకరించినప్పటికిని విశేషకర్మజన్యత్వ మంగీకరింపఁబడును గనుక పూర్వము సూక్ష్మశరీరము కర్మజన్యము కాదని చెప్పినందుకు విరోధము లేదు. సామాన్యకర్మజన్యమైన వస్తువున కేకత్వంబును విశేషకర్మజన్యంబగు వస్తువున కనేకత్వంబును వ్యవహా

రమునందుఁ గన్పారము. కాఁబట్టి సూక్ష్మశరీరంబు సామాన్యకర్మజన్యం బైనను విశేషకర్మజన్యము గాకపోయెను గనుక సూక్ష్మశరీర మొకటి యని చెప్పినందుకు విరోధంబు లేదు. ఇటుల సామాన్యకర్మజన్యమైన వస్తువున కేకత్వంబును విశేషకర్మజన్యమైన వస్తువున కనేకత్వంబును నెక్కడనైననుం గలదా యనిన; లోకమందుఁ గన్పారము. ఎం దనిన; పృథివ్యాదులయందుఁ గన్పారము. వానికి కర్మజన్యత్వము గానమే యనిన; జగత్తంతయుం జన్యంబ కావునను జీవులకు భోగ్యము కావునను జగత్తు కర్మజన్యమనే చెప్పవలయును. జీవులకు భోగ్యమైతే జగత్తు కర్మజన్యము కావలెనా? యనిన; కర్మములకు సుఖదుఃఖములు. ఆ సుఖదుఃఖము లానుకూల్యప్రాతికూల్యవస్తువు లవలంబించుకొని వచ్చు చున్నవి గనుక జగన్నిష్ఠపదార్థంబులలోఁ గొన్నిపదార్థంబులు కొందఱి కనుకూలంబులును సుఖకరంబులునునై యున్నవి. మఱికొందఱికి ప్రతి కూలంబులును దుఃఖకరంబులునై యున్నవి గనుక ఆ జీవులయొక్క కర్మములు తమకు ఫలంబులైన సుఖదుఃఖములకు సాధనంబులైన ఆకా శాదులకు ఉత్పత్తిని సంపాదించుకొని అయ్యైజీవులకు సుఖదుఃఖముల నిచ్చుచున్నవి. కాఁబట్టి జగత్తంతయుఁ గర్మజన్యంబే యని చెప్పవల యును. స్థితికాలంబునందుఁ గదా జీవులును వారి కర్మంబులును కనఁ బడుట, ప్రళయంబునందైతే జీవులును జీవులయొక్క కర్మంబులును గానము. ఇట్లుండఁగా జీవులయొక్క కర్మములచేత నాకాశాదిజగత్తు పుట్టు ననునది యెట్టు లనిన; ప్రళయకాలమందును జీవులందఱు తమ తమ యుపాధులతోఁ గూడుకొని సుషుప్తియందు సంస్కారాత్మక ముగా నున్నారు. కాన వారలయొక్క కర్మంబులును సంస్కారాత్మ కంబులై యున్నవి గనుక అటువంటి కర్మముచేత నాకాశాదిజగత్తు పుట్టె ననుట కూడును. ఇటు లంగీకరింపనియెడల, పూర్వకల్పంబునందు జీవులచేఁ జేయఁబడిన కర్మంబులకు ఫలము లేకపోవలయును. పూర్వ కల్పంబునందుఁ జేయని కర్మంబులకీ కల్పంబునందు ఫలములు రావల యును. ఇంతమాత్రమే కాదు; శ్రుత్యాదులకు వైయర్థ్యంబును వచ్చును. ఒక కారణంబును లేకయే జగత్తు పుట్టునని చెప్పునపుడు ముక్తపురు షులకును ఉత్పత్తి కలుగవలెను. జగత్తునందు మనుష్యులు దేవతలు

తిర్యక్కులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అనునట్టి వ్యవహార వ్యవస్థలు లేకపోవలయును. ఈ దోషంబులు వచ్చెనేనియు రానిమ్మనుట యుచితంబు కాదు, కావున ప్రళయంబునందును సంస్కారాత్మకమైన జీవులయొక్క కర్మంబులవలననే ఆకాశాదిజగత్తులు పుట్టు ననుటయందు సందేహంబు లేదు. ఇటులే యాకాశాదులు కర్మవలనఁబుట్టినను స్వగత వికారములున్నను ప్రళయంబులయందు లయించియుండి ఆయా సృష్టి యందాకాశ మాకాశంబుగ వాయువు వాయువుగ తేజస్సు తేజస్సుగ జలంబు జలంబుగ పృథ్వి పృథివిగ నెటుల పుట్టుచున్నవో, అటులే సూక్ష్మశరీరమును ప్రళయంబులయందు లయించియున్నప్పటికిని ఆ జీవులయొక్క కర్మముచేత పూర్వకల్పంబునం దెటులుండునో అటుల ప్రతికల్పంబునందునుఁ బుట్టుచున్నది ఇటుల పుట్టి స్వగతవికారవత్తై యుండినను సూక్ష్మశరీశంబు ముక్తిపర్యంతంబు నొకటియే. ఈచొప్పునఁ జెప్పుటవలన ముక్త్యనంతరము సూక్ష్మశరీరంబు లనేకంబులై యుండునని తోఁచుచున్న దంటివేని, ముక్త్యనంతరంబున సూక్ష్మశరీరము లేనేలేదు. అటువలె ననేకంబులని తోఁచుట కవకాశంబు లేదు. ఈ మేఱకు సూక్ష్మశరీర మాకాశాదులవలె సామాన్యకర్మమువలనఁ బుట్టియున్నది గనుక నొక ప్రాణికి నొక సూక్ష్మశరీరమనిచెప్పినది యుక్తమే. అయితే యిటులు చెప్పుట విరోధముగాఁ దోఁచుచున్నది. ఆ విరోధ మేది యనిన; ఆకాశాదులు సమస్తప్రాణికర్మజన్యములు గాన నయ్యాకాశాదులకు సామాన్యకర్మజన్యత్వంబును ప్రళయపర్యంతంబు నొకటియై యుండుటయును ప్రతికల్పమందును అటువలెనే పుట్టుటయును యుక్తము. ఆయా ప్రాణులయొక్క సూక్ష్మశరీరములైతే సమస్తప్రాణికర్మజన్యములు కావు గనుక వాటికి సామాన్యకర్మజన్యంబును ఒకప్రాణికొకటి యనుటయును ప్రతికల్పమందును పుట్టుచున్న వనుటయును ముక్తిపర్యంతము నిత్యమనుటయును నెటుల చెప్పవచ్చు ననిన; చెప్పవచ్చును. అది యెటువలె ననిన; ఆకాశాదులవలె నాయా ప్రాణులయొక్క సూక్ష్మశరీరములు సమస్తప్రాణులయొక్క కర్మములచేత పుట్టకున్నప్పటికిని ఆయా ప్రాణులకు సృష్టిమొదలుకొని ప్రళయపర్యంతంబును స్థూలశరీరద్వారా సుఖదుఃఖముల నిచ్చునట్టి కర్మములచేతను ఆయా ప్రాణులయొక్క సూక్ష్మశరీరములు పుట్టుచున్నవి గనుకను, ఆ సూక్ష్మశరీరము

లకు సామాన్యకర్మజన్యత్వంబును నొకప్రాణి నొకసూక్ష్మశరీరం బనుటయు ప్రతికల్పమందు నటులే పుట్టుచున్నదనుటయును ముక్తిపర్యంతము నిత్యమనుటయును చెప్పవచ్చును. లీనమైన వస్తువు కర్మము నపేక్షించి పుట్టుచున్నదనుటకును సామాన్యకర్మములవలనఁ బుట్టిన వస్తువు ఒకటియైయుండుననుటకును విశేషకర్మములవలనఁ బుట్టిన వస్తువు నానారూపములు కలిగియుండుననుటకును దృష్టాంతము కలదా యనిన; కాష్ఠపాషాణాదులయందు లీనమై యుండెడి అగ్నికి మథనాదిరూపమయిన కర్మములచే నెట్లు లుత్పత్తియో యటులే కారణరూపమయిన సూక్ష్మశరీరమునకు కార్యకారణములుగాఁ దోఁచెడి కర్మముచేతనే యుత్పత్తి కలుగుచున్నదనుట చెప్పవచ్చును. ఇటుల చెప్పినందున కార్య మసత్తనుటయును దోఁచెను. సామాన్యకర్మమువలనఁ బుట్టిన వస్తు వొకటి యనుటకును విశేషకర్మమువలనఁ బుట్టిన వస్తువు అనేకమనుటకును దృష్టాంతము చెప్పెదము. కులాలునిచేతను నానావిధములయిన భాండములును చేయవలెనని సంపాదింపఁబడిన మృత్పిండ మొకటియే. అది యనేక కర్మలచేత చేయఁబడినను ఆ కులాలుని మృత్పిండమువలనఁ బుట్టిన భాండములన్నియును సమానములైయున్నవి. ఆ మృత్పిండము సామాన్యకర్మ కార్యము గనుక నేకము. దానివలనఁ జేయఁబడిన భాండములలో నొక భాండమును జేసిన కర్మ వలన మరియొక భాండమును జేయలేదు గనుక నా భాండములు విశేషకర్మజన్యములు. అవి నానారూపములు ననేకములు నై యున్న వనుట సర్వానుభవసిద్ధము. ఇటువలె సూక్ష్మశరీరము సామాన్యకర్మజన్యంబయ్యెఁ గాన నది యొక్కొక్కశరీరమనుటయు స్థూలశరీరంబు విశేషకర్మజన్యం బయ్యెఁ గాన నది యొక్కొక్కప్రాణి కనంతంబు లనుటయును గూడదు. మఱియు నీ యర్థమందు విశేషదృష్టాంతంబు గలదా యనిన; కలదు. అది యెటువలె ననిన; లోకమందు దేవదత్తునకే కర్మవశంబున నానావిధములగు వస్త్రంబులు వచ్చుచున్నవి. ఆ వస్త్రంబు లొకటిగా నుండలేదు గనుక అది యెటువలె విశేషకర్మవలన వచ్చుచున్నదో అటువలెనే స్థూలశరీరంబులును చిత్రంబులై యొక్కొకప్రాణికి అనంతంబులై వచ్చుచున్నవి గనుక ఆ స్థూలశరీరంబులును విశేషకర్మజన్యంబులే యని తెలుసుకోఁదగినది. ఆ దేవదత్తునికే ఆయా విశేషకర్మలచేత వస్త్రములు వచ్చి ఆ

వస్త్రములచేత వచ్చెడి సుఖదుఃఖంబులకు సాధనభూతంబగు స్థూలశరీర మొకటిగయి యున్నది. కాబట్టి ఆ వస్త్రంబుల నపేక్షించి స్థూలశరీర మెటువలె సామాన్యకర్మ జన్యమాయెనో, అటువలెనే సూక్ష్మశరీర మొకొ్కకప్రాణికి నొకొ్కకటైయున్నది గనుక అదియును సామాన్య కర్మజన్యమని తెలుసుకోదగినది. ఇట్లు చెప్పుటవలన సిద్ధించుట యేమి యనిన; సూక్ష్మశరీరమునకే స్థూలశరీరముయొక్క గ్రహణంబును వాటి యొక్క త్యాగంబునని తెలుసుకోదగినది. దృష్టాంతమందు స్థూలశరీ రంబుకే వస్త్రాదులయొక్క గ్రహణంబులును వాటియొక్క త్యాగంబును ప్రత్యక్షంబుగ నెటుల కన్పారమో యట్టులే సూక్ష్మశరీరమునకు స్థూల శరీరమును పరిగ్రహించుట జన్మము. దానితోడ నికమీద సంబం ధము లేనియటుల విడుచుట మరణంబని సిద్ధించుచున్నది. ఈవిధంబున జన్మమరణంబులుగల సూక్ష్మశరీరమునకే జన్మమరణములు లేవని తోచు చుండగా ఆత్మకు జన్మమరణముల ప్రసక్తి లేదని చెప్పవలసిన దేమి? ఇటువలె జెప్పినప్పు డాసూక్ష్మశరీరంబు లనంతంబులని చెప్పబడినట్టు తోచుచున్నది. తోచినం దోచనిమ్మని యంటివేని పూర్వము ప్రాణు లకు స్థూలశరీరము లనంతము లని చెప్పి యిప్పుడు సూక్ష్మశరీరమునకు స్థూలశరీరము లనంతము లని చెప్పినందున పూర్వము చెప్పినందుకు నిపుడు చెప్పినందుకు విరోధము వచ్చుచున్నది గనుక సూక్ష్మశరీరమే ప్రాణిశబ్దమున కర్థమని చెప్పుదమనిన; అట్లు చెప్పగూడదు. ఎందుచేత ననిన; పూర్వము ప్రాణులకు సూక్ష్మశరీరలొక మొకటి యని చెప్పి ఇప్పు డాసూక్ష్మశరీరమే ప్రాణిశబ్దమున కర్థమని చెప్పినచో ఇప్పుడే రెండువిధములుగా దోచుచున్నది గనుక అటువలె చెప్పగూడదు. అయితే మఱియెటుల చెప్పవలె ననిన; ఇచ్చట ప్రాణిశబ్దమునకు ఆత్మ యని యర్థము. ఆ యాత్మకే కారణశరీరమనెడి పేరుకల అజ్ఞానముచేత వచ్చిన సూక్ష్మశరీరాధ్యాసద్వారా అనంతములైన స్థూలశరీరములు వచ్చుచును బోవుచును ఆ స్థూలశరీరనిష్ఠమైన జన్మమరణములు ప్రసక్త మైనటుల తోచుచున్నది. ఎప్పుడు తోచుచున్నదనిన; దృష్టాంతమందు దేవదత్తునిచేత నానావిధములయిన వస్త్రములు గ్రహింపబడుటయును విడువబడుటయును ప్రత్యక్షముగా గనబడినప్పటికిని, స్థూలశరీరవ్యతి రిక్తుడై యా స్థూలశరీరమం దధ్యాసచేత దేవదత్తు డనే పేరు గల

జీవునికి స్థూలశరీరద్వారా వస్త్రగ్రహణత్వాగాదు లెటువలెఁ దోఁచు చున్నవో, అటువలెనే అజ్ఞానముచేత వచ్చిన సూక్ష్మశరీరద్వారా ఆత్మకు ననంతములయిన స్థూలశరీరములు వచ్చుచుఁ బోవుచున్నట్టు మోహముచేత తోఁచుచున్నయది. విచారించినపుడు స్థూలశరీరమునకు జన్మమరణములు ప్రత్యక్షంబుగాఁ గనఁబడలేదు. కనుక సూక్ష్మశరీరము నకు స్థూలశరీరంబుతోడ నధ్యాస వినాగా జన్మమరణంబులు లేవు. సూక్ష్మశరీరంబునకే జన్మమరణంబులు లేకపోయెఁగాన ఆత్మకు మోహ మాత్రము వినాగా జన్మమరణంబులు లేవని చెప్పవలసినదే లేదు. ఈ చెప్పినచొప్పున ప్రాణులకు స్థూలశరీరంబు లనంతంబులు. సూక్ష్మకారణ శరీరంబు లొకటొకటి యనియుం జెప్పినది యుక్తమే. ఇందువలన సిద్ధించునవి ఏవి యనిన; శరీరత్రయంబును ప్రాణిశబ్దముచేతఁ జెప్పఁ బడిన ఆత్మ కాదనుటయే. అది యెటులనిన; లోకంబునందు ఒకఁడు మఱియొకనిని నీకు రుద్రాక్ష పేరు లెన్ని యని అడిగిన మూఁడనియును, జందెము లెన్ని యని అడిగిన మూఁడనియును, మఱియు నీకు దోవతు లెన్ని యని అడిగిన మూఁడనియును యెటువలె చెప్పుచున్నాఁడో అటు వలెనే ప్రాణుల కెన్ని శరీరములని విచారించునపుడు మూఁడుశరీరము లని తోఁచుచున్నది. ఇటుల దోఁచుటవలన దృష్టాంతమందు రుద్రాక్ష పేరులు మొదలయినవి వాటి ధరించినవారల నెటుల స్పృశింపలేదో అటువలెనే దార్ష్టాంతికమందును స్థూలసూక్ష్మకారణశరీరములు ప్రాణి శబ్దముచేతఁ జెప్పఁబడిన ఆత్మ కాదనియును, శరీరత్రయనిష్ఠమయిన వికారము లాప్రాణిశబ్దవాచ్యుఁడైన ఆత్మను స్పృశింప లేవనియును దోఁచుచున్నది. లోకమందు దేవదత్తాదులకు గృహి యనియు క్షేత్రి యనియు పుత్రి యనియు ధని యనియు కుండలియనియు వ్యవహారము కన్నారము. ఇటువలెనే ఆత్మకు శరీరి యనియు దేహి యనియు ప్రాణి యనియు ననెడి వ్యవహారము లోకమందును వేదములయందును తోఁచుచున్నది. దృష్టాంతమందు గృహి క్షేత్రి పుత్రి ధని కుండలి అని తోఁచునట్టి దేవదత్తాదులు ఆ గృహాదు లెటువలె కారో ఆ గృహాది నిష్ఠమయిన వికారములు వారి నెటువలె స్పృశింపలేవో అటువలెనే శరీరి యనియు దేహి యనియు ప్రాణి యనియు నుపాధివలనం దోఁచెడి

ఆత్మయును శరీరాదులు కాదు. ఆశరీరాదినిష్ఠవికారము లాత్మను కాలత్రయమందును స్పృశింపలేవు. ఈప్రకారమున శరీరత్రయంబును ఆత్మ కాదనియు శరీరత్రయనిష్ఠవికారము లాత్మకు లేని వయినను సామాన్యముగఁ దోఁచుచున్నవి గనుకను విశేషముగా స్థూలశరీరమువలె సూక్ష్మకారణశరీరములు రెండును దోఁచలేదు గనుకను పలుమారు విచారించినప్పటికిని యీశరీరములు మూఁడును ఆత్మ కాదు. ఈ శరీరత్రయనిష్ఠమైన వికారంబులు ఆత్మను స్పృశింపలేవు. ఇందు కొక విశేషయుక్తికలదు. ఆయుక్తి యేదియనిన; స్థూలశరీరము సమస్త ప్రాణులకు ప్రత్యక్షము గనుక అది కలదో లేదో యని యెవరికిని సందేహము కలుగదు. చార్వాకపామరులకన్న నితరులయిన స్థూలశరీరమాత్మ కాదనుకొనుటకు సందేహము లేదు. ఆచార్వాక పామరులకును స్థూలశరీరమే ఆత్మ యని తలఁచుట యుచితము కాదు. ఎందుచేత ననిన; సూక్ష్మశరీరమందలి అధ్యాసచేత జీవస్వరూపుఁడగు ఆత్మ సూక్ష్మశరీరద్వారా స్థూలశరీరాధ్యాసచేత వచ్చిన పుత్రాద్యపేక్షవలన పిత్రాదిశబ్దములచేఁ జెప్పఁబడుచున్నాఁడు. ఇటువలె పిత్రాదిశబ్దములచేతఁ జెప్పఁబడినవానివలెనే తోఁచునట్టి ఆత్మ స్థూలశరీరమునకంటె భిన్నుఁడయి పిత్రాదిశబ్దములచేత నీస్థూలశరీరమే చెప్పఁబడెనేని ఆ పిత్రాదులు చచ్చిపోయిరని చెప్పక యుండవలయును. అటు లుండక చచ్చిపోయి రని చెప్పుచున్నారు గాన స్థూలశరీరవ్యతిరిక్తుఁడే ఆత్మ యని చార్వాకపామరులును అంగీకరింపవలెను. మఱియును యుక్త్యంతరముచేతను స్థూలశరీరవ్యతిరిక్తుఁడే ఆత్మ యని తోఁచుచున్నది.

అది యెటువలె ననిన; ఆపిత్రాదిశబ్దంబులకు అర్థమని తోఁచెడి ఆపిత్రాదిస్థూలశరీరములు చచ్చిపడియుండఁగా దానిం గౌఁగిలించుకొని యేడ్చెడిపుత్రాదులు మమ్ము నవాంతరమున విడిచి అప్పు ఇచ్చినచో టిది. పుచ్చుకొనినచో టిది యది చెప్పక మానోట మన్నుఁ గొట్టి మా తండ్రి మొదలయినవారు చచ్చి పోయి రని చెప్పుచున్నారు. ఇంతే కాదు. బంధువులు స్నేహితులు మొదలైనవారు ఆపిత్రాదులను మీ తండ్రి మొదలైనవారు చచ్చిపోయిరి గదా యని విచారించునపుడు ఆ వచ్చినవారితో పుత్రులైనవారు అయ్యా! మాతండ్రిపోయెను; మాతల్లి పోయెను; మమ్ముఁ జెఱచిపోయిరి. ఇఁక మాకు దిక్కెవరును లేరుగదా

అనియును; తోడఁబుట్టువులైనవారలు మాతోడు పోయెను. మాయన్న పోయెను, మాతమ్ముడు పోయెను, మమ్ము గతిమాలినవారినిగాఁ జేసి పోయెను అనియును;భార్యలైనవారు నా దేవుఁడు నన్నుఁ జెఱచిపోయెను. సర్వవిధములచేతను చెడితిని, చీమలపుట్టలో చిచ్చుపెట్టినట్టు మమ్ము బట్ట బయలున విడిచి కంచంతకాపురమును కాటిలోఁ బెట్టిపోయెను. ఇఁక నీ కనుగందలకుదిక్కెవ్వరు.ఈదుఃఖమును జూడలేను.నన్ను దేవుఁడు కొంచు పోకపోయెను అనియును; తల్లిదండ్రులైనవారు అన్నా మా చిన్నవాఁడు పోయెను, మా యెన్నికలన్నియు మన్నుగలసిపోయెను. అన్నా మాట్లాడరా, అప్పా మాట్లాడరా, నాతండ్రీ పలుకవేమిరా, నన్నుఁగూడఁ దోడు కొనిపోరా, ఒకపోడిమియుఁ గానకపోయితివి గదరా అనియును; ఆపిత్రాదులు బహువిధముగా దుఃఖపడుచుండఁగా నప్పుడు విచారించుటకు వచ్చినవారు అమ్మా మీ రెందుకు దుఃఖపడుచున్నారు. ఈ దుఃఖపడుట వలన పోయినవారు రాఁబోరు, దుఃఖమును మానుఁడని యాశ్వాసించు నపుడు అయ్యా! యేడుగురు చిన్నవారిని యేటిలో కలిపితిని.ఒకముహూర్తముననే పోయిరి. ఈ దుఃఖమును సహింపలేను. మమ్ము దేవుఁడు శోధించెను. మావారలందఱు నాకన్న దఃఖమును పొందియున్నారు గనుక మేమందఱము నొకతేపనే విషముఁ బుచ్చుకొని చితిమీఁదఁ బండుకొనెదము. ఈదుఃఖమును తరించుటకు నింతకన్న వేరుగతి లేదని మొత్తుకొని మొత్తుకొని యేడ్చుచున్నారు. ఇంతమాత్రమే కాదు. విద్వాంసుఁడైన వాఁడు తనభార్య చచ్చిపోయినపుడు తనవారినిజూచి, అయ్యా నాప్రాణపదమైన పెండ్లాము పోయెను. ఈ దుఃఖమును సహింప నాకు వశము గాదు. లోకములోని యిల్లాండ్రవలెఁ గాదు. మహాపతివ్రత. మిగుల సుగుణములు గలది. అయ్యో ప్రాణనాయకీ! మాటలాడవేమే. నాకు దిక్కెవ్వరే. ప్రాణపదమైన నిన్నెడఁబాసి యుండలేనుగదవే. వేళ తప్పక నన్నాదరించి అన్నముఁ బెట్టువా రెవ్వరే. నీసుగుణములు వర్ణింప వశముగాదు కదవే. నేనును నీవెంట వచ్చెదనే యని యేడ్చుచున్నాఁడు. కాఁబట్టి యీ చెప్పినవి యెటుల నున్న వనిన; మీమామ మొదలైన వారు వచ్చియుండిరిగదా వారు పోయిరా యని యొకఁడడిగితే అందుకు మరియొకఁడు మాతో చెప్పకయే కట్టుకొనునట్టి బట్టలతో విడిచి పెట్టి పోయినట్టున్న దని చెప్పిన ట్టున్నది. కాఁబట్టి దృష్టాంతమం దా

మామ మొదలయినవారల కెటువలె నర్థమో అటువలెనే ఈ స్థూల శరీరమును విడిచిపెట్టి కర్మానుసారముగా లోకాంతరమునకు పోయిన వారే పిత్రాదిశబ్దముల కర్థము గాని వెళ్లిపోకమును పిక్కడ నుండెడి స్థూలశరీర మా పిత్రాదిశబ్దముల కర్థము కాదు గనుక అటుల చెప్పఁ గూడదు. అటుల చెప్పినచో దోవతులు విడిచిపెట్టి పోయిన మామ మొదలయినవారు ఆ దోవతులు పెట్టిపోకమునుపు ఆ దోవతులే కావలెను. ఇంతమాత్రమే కాదు. ఒకగృహమందుండి వెడలిన పురుషుఁడు ఆ గృహమునందుండి వెడలకమునుపు గృహమే కావలయును. అట్లు కాలేదు గనుక దోవతులు మొదలయినవానితోఁ గూడుకొనియుండెడి మామ మొదలయినవారు ఆ దోవతులు గృహము నెటువలె కారో అటువలెనే పిత్రాదులు స్థూలశరీరముతోఁ గూడుకొనియున్నప్పటికిని కూడియుండకున్నప్పటికిని ఆ పిత్రాదిశబ్దములకు స్థూలశరీరమును విడిచి పెట్టిపోయినవారే అర్థముగాని స్థూలశరీరము అర్థము కాదు. ఏ పిత్రాది శబ్దములు మరణమునకు మునుపు స్థూలశరీరమున కర్థమని యెంచుకొని ఆ శరీరముఁగూర్చి యొక యుదాసీనత చేసినప్పటికిని అట్టివానికి అనేక నరకములు సంప్రాప్తము లగునని శాస్త్రము చెప్పుచున్నదో ఆ శరీరమునే పుత్రాదులు కాలవేయుచున్నారు. ఆ పిత్రాదిశబ్దములకు స్థూల శరీర మే అర్థమైనట్టయితే ఆ శరీరములను కాలవేసిన పుత్రాదులకు పితృహత్యాదిదోషములు రావలెను. ఆ దోషములు వచ్చునెడల నా పుత్రాదుల కనంతకోటినరకములును గలుగవలెను. ఇదియెగాక లోకులా పిత్రాదిదేహంబులను దహించినవారిని పితృహత్యాపరులు మాతృహత్యాపరులు అని దూషించి వారితో మాటలాడక యుండవలయును. అటుల గానము గనుకను వారలకు పిత్రాదిదేహములను కాలవేసినందున నరకాదులు సంప్రాప్తమగునని శాస్త్రంబులయందు లేదు గనుకను ఈ స్థూలశరీర మా పిత్రాదిశబ్దంబుల కర్థంబు గాదు కనుకను, ఏ శరీరంబు పిత్రాదిశబ్దంబుల కర్థంబని యెంచి సకలోపచారంబులచేతను బూజించుచున్నారో ఆ శరీరంబులను మరణాంతరంబున దహింపక పోయిరేని ఆ పుత్రాదులకు ప్రత్యవాయదోషంబును శాస్త్రంబుల యందు విధించియున్నది గనుక ఆ పిత్రాదులకు దహనాదిక్రియలు చేసి స్థూలశరీరంబునందుండి లోకాంతరంబునకు వెళ్లిన పిత్రాదులకు ప్రేతత్వ

విమోచనరూపమయిన యతిశయత్వంబును ఆ శరీరంబులను దహింపఁ జేసిన పుత్రాదులకు ప్రత్యవాయదోషము లేదనియు శాస్త్రంబుల యందు విధించియున్నది. కనుకను పట్టణంబునం దుండిన రాజు బైట వెళ్లెనేని ఆ పట్టణంబున కేకీడును రాకుండునటుల వాని భృత్యు లెటుల కాపాడుచుందురో, ఆ భృత్యు లటులఁ గాపాడకున్న రాజు వారి నెటుల శిక్షించుచున్నాఁడో అటులనే చచ్చిపడియుండెడి పిత్రాదిశరీరంబులకు పుత్రాదులును సంస్కారాదులు చేసిరేని యా పిత్రాదుల కతిశయత్వంబును దహించినవారలకు ప్రత్యవాయదోష రాహిత్యంబును కలుగునని తెలుసుకొనఁదగినది.

మఱియును లోకములోని జనులు చచ్చియుండెడి పిత్రాదిశరీరంబులను సంస్కరించిన పుత్రాదులకు మీరు పిత్రాదులకు మంచి గతిని సంపాదించిరని కొనియాడుచున్నారు. సంస్కారాదులు చేయనివారిని దూషించుచున్నారు. కాఁబట్టి ఆ పిత్రాదిశబ్దంబులకు నీ స్థూలశరీరంబునందుండి వెడలి లోకాంతరంబునకుఁ బోయినవారే అర్థమని తోఁచుచున్నది. అటుగాకపోయినపక్షమందు ఈ స్థూలశరీరమునే పిత్రాదులని యెంచి యెల్లరును శుశ్రూష చేయుటకు కారణమేమియనిన; ఈ స్థూలశరీరమం దుండెడివానికి ప్రీతికొఱకు శుశ్రూష చేయుచున్నారు గాని స్థూలశరీరమునకు ప్రీతికొఱకుఁ గాదు. అది యెటు లనఁగా; నగరులో రాజుండఁగా నతనికి ప్రీతికొఱకు మేలుకట్టు మొదలైన యలంకారము లెటుల చేయుచున్నారో, ఆ నగరుకు ప్రీతికొఱకు నెటువలెఁ జేయలేదో అటువలెనే స్థూలశరీరంబునకు శుశ్రూష చేసెడివారు మోహామువలన నా శరీరములే పిత్రాదిశబ్దముల కర్థమని యెంచుకొని యున్నప్పటికిని, ఆ స్థూలశరీరమున నుండెడివారికిని ప్రీతికొఱకే శుశ్రూష చేయుచున్నారు గనుక ఆ స్థూలశరీరంబులయం దుండెడివాఁడే పిత్రాదిశబ్దంబుల కర్థము.

ఇంతమాత్రమే కాదు. లోకమందు గ్రామాంతరమునకుఁ బోయిన వాని దోవతులు దొంగలు దోఁచుకొనిపోయిరేని వాని పుత్రాదులామాట వినినవారై వేరు దోవతు లిచ్చి పంపునటుల లోకాంతరమునకు పోయిన పిత్రాదులు నగ్నులై పోవుచున్నారు. వారలకు నగ్న

ప్రచ్ఛాదనార్థంబుగా నిక్కడ బ్రాహ్మణునికి వస్త్రమిచ్చినచో, ఆ వస్త్రము వారికి చెందుచున్నదని శాస్త్రంబులు చెప్పఁగా విని వారియొక్కపుత్రాదులు ఇక్కడ బ్రాహ్మణునికి వస్త్ర మిచ్చుచున్నారు. ఇందుచేతను ఈ స్థూలశరీరము పిత్రాదిశబ్దములకు అర్థము కాదని తోఁచుచున్నది. ఇంతే కాదు. మడిలో పనిచేసెడివాఁ డెండచేతఁ గొట్టువడి దాహతాపాదుల చేత బాధపడుచున్నాఁడని విని గృహమం దుండెడివాఁడు వానికి అన్నపానీయాదులను కొనిపోయినటుల చచ్చి లోకాంతరమును బొందిన పిత్రాదులకు ఆఁకలిదప్పు లిక్కడ నిచ్చెడి పిండతిలోదకములచేత పోవునని శాస్త్రములచేత విని వారలయొక్క పుత్రాదులు వారలకు పిండతిలోదకంబుల నిచ్చుచున్నారు. మఱియు దేశాంతరము పోవలెనని పరస్థానము చేసినవానికి నింటివారు కట్టువంటకము నిచ్చిపంపునటుల చచ్చి లోకాంతరమున కుపవాసులయి పోవునట్టి పిత్రాదుల కిక్కడ స్వర్గపాథేయంబు నిచ్చిరేని వారి యాఁకలి పోవునని శాస్త్రముఖంబున విని వారలయొక్క పుత్రాదులు స్వర్గపాథేయంబు నిచ్చుచున్నారు. ఇంతియెగాక పొరుగూరికి పోవుటకై యనుపఁబడి పోయిన పురుషుఁడు ఏటివెల్లువ వచ్చినం బోవఁజాలక యేటిగట్టున నున్నాఁడని విని యింట నుండెడివా రొక తెప్పఁ బంపినటువలె చచ్చి లోకాంతరంబు నొందిన పిత్రాదులకు స్వర్గప్రాప్తి కలుగుట కాటంకముగా వైతరణి యను నది యొకటి ఉన్నదని శాస్త్రముచే విని వారు దాఁటిపోవుటకై వారి యొక్క పుత్రాదు లిక్కడ వైతరణీగోదానంబు నిచ్చుచున్నారు. ఉండియుఁ జచ్చి లోకాంతరవాసులయిన పిత్రాదులనుగూర్చి వారు చచ్చినదిమొదలు సంవత్సరపర్యంతంబు ప్రతిమాసంబున మాసికంబును తరువాత వారివారిపుత్రాదు లెంతకాలము జీవించియుందురో అంత పర్యంతంబును ప్రతిసంవత్సరంబును వారలనుద్దేశించి శ్రాద్ధంబులును మధ్యేమధ్యే అష్టకాదిశ్రాద్ధంబులును పుణ్యక్షేత్రంబులయందు తీర్థశ్రాద్ధాదులును చేయుచున్నారు. కాఁబట్టి ఈ చెప్పఁబడిన దృష్టాంతముల చేతను ఈ స్థూలశరీరము పిత్రాదిశబ్దంబుల కర్థంబు గాదని స్పష్టముగాఁ దోఁచుచున్నది. అటువలెఁగాక భస్మమైపోయిన స్థూలశరీరమే పిత్రాది శబ్దంబుల కర్థమనుట కూడదు. ఈ స్థూలశరీరంబునందుండి లోకాంతర గమనంబు బొందినవారే ఆ పిత్రాదిశబ్దంబుల కర్థమనుట కూడును.

కాఁబట్టి ఈ స్థూలశరీరము పిత్రాదిశబ్దంబులకు అర్థంబు కాదు. ఈ చెప్పిన యుక్తులచేత నీ స్థూలశరీరంబు పిత్రాదిశబ్దంబులకు అర్థము గాకపోయినను, ఇందుచేత సూక్ష్మశరీరసిద్ధి కలిగెనా ? యనిన; కలిగెను.

అది యెటు లనిన; ఈ స్థూలశరీరమును విడిచి లోకాంతరగమనంబు నొందునది యేదియో అదియే సూక్ష్మశరీరంబు. ఇటువలెఁ జెప్పునపుడు ఆపిత్రాదిశబ్దంబులకు ఈ సూక్ష్మశరీరమే అర్థమని చెప్పినట్లాయెను గదా యనిన; అటులఁ గాదు. పిత్రాదిశబ్దంబులకు సూక్ష్మశరీరద్వారా చేతన మని యర్థము. సూక్ష్మశరీరముచేతఁగదా పిత్రాదిశబ్దంబులకు చేతన మను నర్థంబు సిద్ధించె. అచేతనమయిన సూక్ష్మశరీరంబు పిత్రాదిశబ్దంబుల కెటువలె నర్థమగు ననిన; చేతన మనఁగా ఆత్మ. ఆ యాత్మ యాకాశమువలె వ్యాపకుఁడు గాన నితనికి లోకాంతరగమనాగమనములు కూడదు. నిరవయవుఁడు గనుక కర్త్రాదిసంస్కారాశ్రయత్వము కూడదు. కర్త్రాదిసంస్కారాశ్రయము నంగీకరింపకపోయినచో కృతనాశకృతాభ్యాగమాదిదోషంబులు వచ్చుచున్నవి. కాఁబట్టి కర్త్రాదిసంస్కారంబున కాశ్రయంబయిన సూక్ష్మశరీరమే లోకాంతరగమనంబు నొందునది యని యంగీకరింపవలెను. అట్లయితే చావుపుట్టువులును లోకాంతరగమనాగమనంబులును పుణ్యపాపంబులును చేతనకర్మంబులై యెట్లు తోఁచుచున్నవనిన; వ్యాపకుఁడైన ఆత్మ సూక్ష్మశరీరంబునకు పదియాఱవ యవయవమై అంతఃకరణంబునందలి ప్రతిబింబద్వారా ఆ సూక్ష్మశరీరంబుతోడ సధ్యాస నచ్చినందున నగ్నితోడ తాదాత్మ్యంబువలన నయఃపిండం బెటులఁ దోఁచుచున్నదో యటుల నీ సూక్ష్మశరీరంబుతోడి తాదాత్మ్యంబువలన స్థూలశరీరంబును మోహంబుననే చేతనంబుచందంబునఁ దోఁచుచున్నది కాన చావుపుట్టువులు మొదలయిన ధర్మంబులు మోహముచేత నధర్మంబులచందంబునఁ దోఁచుచున్నవి గనుక స్థూలసూక్ష్మకారణశరీరంబులును అంతఃకరణంబునందలి ఆత్మ ప్రతిబింబంబును వీనికి అధిష్ఠానభూతం బయిన చైతన్యంబును గూడి మోహముచేత పిత్రాదిశబ్దంబులకు అర్థమై తోఁచుచున్నది. విచారించునపుడు వానివానికి వాచకంబులయిన శబ్దంబులవలనఁ జెప్పఁబడియెను గనుక వీనిలోపల నొకటియును అర్థమని తోఁచలేదు. జన్మమరణంబు లీ స్థూలశరీరంబునకే యని ప్రత్యక్షంబుగఁ గను

పమచున్నది. కనుక ద్రష్టయై నిత్యుఁడై వ్యాపకుఁడై చైతన్యస్వరూపుఁడయిన యాత్మకే చెప్పిన ధర్మంబులలో నొకటియును లేదని తోఁచుచున్నది. ఇట్టిస్వరూపముగల ఆత్మకు మోహముచేత వచ్చిన జీవత్వంబున లోకాంతరగమనాగమనంబులును పిత్రాదిశబ్దవాచ్యత్వంబును దేనియందు నధ్యాసద్వారా వచ్చినదియో అదియే స్థూలశరీరవ్యతిరిక్తమయిన సూక్ష్మశరీర మని యెఱుఁగఁదగినది.

మఱియును యుక్త్యంతరముచేతను స్థూలశరీరముకంటె సూక్ష్మశరీరంబు భిన్నం బని తోఁచుచున్నది. ఆయుక్త్యంతరం బెయ్యది యనిన; చిత్రంబులయి నానావిధంబులగు వ్యాపారంబులు దేనివలనఁ జేయఁబడుచున్నవియో అదియే సూక్ష్మశరీరంబు. ఈవ్యాపారంబులన్నియు స్థూలశరీరమువలననే చేయఁబడుచున్న వని చెప్పెద మనిన; ప్రేతశరీరంబువలననుం జేయఁబడవలయు. అట్లు గానము గనుక స్థూలశరీరంబునకంటె నన్యమగు సూక్ష్మశరీరముచేతనే చేయఁబడినట్లు తోఁచుచున్నది. ఇటుల చెప్పవలసినదేమి? ఆత్మ తానే సకలకర్మంబులను జేయుచున్నాఁడని చెప్పెదమనిన; ఆయాత్మ వ్యాపకుఁడయియున్నాఁడు గనుక ఆకాశాదులయం దుండెడి ఆత్మయు నటువలె చేయవలయును. చేయ లేదు గనుక ఆత్మ కర్మముచేయుచున్నాఁడని చెప్పఁగూడదు. ఆకాశాదులయం దుండునట్టి యాత్మ కర్మము సేయకున్నను స్థూలశరీరముతోఁ గూడుకొనియుండెడి ఆత్మ కర్మము చేయుచున్నాఁడని చెప్పెద మనిన; ప్రేతశరీరముతోఁ గూడుకొనిన యాత్మయును కర్మము చేయవలెను. అటుల చేయలేదు గనుక స్థూలశరీరముతోఁ గూడుకొనిన ఆత్మ కర్మలను జేయుచున్నాఁడని చెప్పఁగూడదు. అయితే ఆత్మతోఁ గూడుకొనియుండెడి స్థూలశరీరము గదా కర్మంబులఁ జేయుచున్నదని చెప్పవలెను. అటుల చెప్పినపుడు వ్యాపకుఁడయిన ఆత్మతోఁ గూడుకొనియుండెడి ప్రేతశరీరము వలననుం గర్మం బొనర్పఁబడవలయును. అటు లొనర్పఁబడుట లేదు గనుక ఆత్మతోఁ గూడుకొనియుండెడి స్థూలశరీరంబు కర్మ మొనర్చుచున్నదని చెప్పఁగూడదు. ఇటుల విచారింపఁగా స్థూలశరీరంబు కర్మ సేయుట లేదు. సద్రూపుఁడైన కేవలమైన ఆత్మయును స్థూలశరీరముతోఁ గూడుకొనియుండెడి ఆత్మయును ఆత్మతోఁ గూడుకొనియుండెడి స్థూలశరీరంబును కర్మము సేయుట గానము. ఇట్లున్నప్పటికిని

చిత్రంబులయి నానావిధములయిన కర్మంబులు చేయఁబడుట కనుపడు చున్నయది. ఇవియన్నియు దేనివలనఁ జేయఁబడుచున్నవియో అదియే సూక్ష్మశరీరము. సద్రూపుఁడైన ఆత్మ వ్యాపకుఁడై నిరవయవుఁడై నిర్వికారుఁడై అద్వితీయుఁడై యున్నాఁడు గనుక దేనితోడనుఁ గూడియుండలేదు. ఆయాత్మకంటె నన్యమైన వస్తువు లేదు. కాఁబట్టి మఱియొకటియు నాత్మతోఁ గూడుకొనియుండలేదు. సకలకర్మలును కారకసాపేక్షంబులై యుండినను ఆత్మ యొక కర్మ యేనియుం జేయకుండినను, ఆత్మయం దనాదియై అవిద్య యను నజ్ఞానంబు కల్పితంబయి యుండుట చేత, దానివలనఁ గల్పింపఁబడిన అపంచీకృత పంచమహాభూతద్వారా కల్పితంబయి ఆత్మసత్తవలన సత్తునలెఁ దోఁచెడి సూక్ష్మశరీరంబు స్థూలశరీరంబును గూడుకొని సమస్తకర్మంబులను జేయుచున్నది. అటుల చెప్పుటచేత సూక్ష్మశరీరము స్థూలశరీరమువలె ప్రత్యక్షముగఁ గనఁబడక స్థూలశరీరముతోఁ గూడుకొని కర్మమును చేసినప్పటికిని, ఆ కర్మము సూక్ష్మశరీరముచేతనే చేయఁబడుచున్నదని అర్థమగుచున్నది.

సూక్ష్మశరీరము స్థూలశరీరముతోఁ గూడుకొని కర్మలు చేసినప్పటికిని, సూక్ష్మశరీరముచేతనే చేయ బడుచున్నవని యెటు లెఱుఁగ వచ్చు ననిన; సూక్ష్మశరీరము సూక్ష్మమే. కాఁబట్టి స్థూలమువలెఁ దోఁచ లేదు. లోకంబునం దేవస్తువు కర్మంబునకుఁ గర్తగా నున్నదో ఆవస్తువు మఱియొక దాని నాశ్రయించుకొని కర్మము చేయుచున్నది గాన ఆ కర్మమును చేసినను నేవస్తువు నాశ్రయించుకొని చేయుచున్నదో, ఆశ్రయమయిన దానిచేతనే చేయఁబడినట్టు అజ్ఞానులకు తోఁచుచున్నది గనుక అటులే సూక్ష్మశరీరము స్థూలశరీరము నాశ్రయించుకొని సకల కర్మములను చేసినప్పటికిని ఆ కర్మలన్నియు నాశ్రితమైన సూక్ష్మశరీరము యొక్క కర్మలే యని యీకర్మద్వారా స్థూలశరీరమువలెనే సూక్ష్మ శరీరమును యీస్థూలశరీరముకంటె భిన్నముగ విచారించునట్టి పురుషునికిఁ దోఁచును. నాచక్షుస్సు నాశ్రోత్రము నావాక్కు నాప్రాణము నా యంతఃకరణము నాబుద్ధి అనెడి యనుభవముచేతను స్థూలశరీరము కంటె భిన్నముగ సూక్ష్మశరీర మొకటి తోఁచుచున్నది. ఇటుల కార్యములయిన స్థూలశరీరంబువలన వీనికి కారణంబయిన ఆత్మకు జీవత్వేశ్వరత్వజగత్కారణత్వంబులయందు ఉపాధియైన అవయవములచేత నని

ర్వచనీయమై ప్రకృతి యనియు మాయయనియు నవిద్యయనియుఁ జెప్పఁబడిన కారణశరీర మొకటికలదని శ్రుత్యాదులచేతఁ జెప్పఁబడుచున్నది. ఇంతేకాదు; నేను అజ్ఞుఁడను, జడుఁడను, ఏమియు నెఱుఁగనివాఁడ ననెడి అనుభవమువలన ఉన్నాఁడు గనుక సద్రూపుఁడనియును కారణశరీర మొకటి కలదనియును తోఁచుచున్నది.

ఈ ప్రకారముగా సమస్తప్రాణులకును మూఁడుశరీరములయొక్క కూడిక గలిగియున్నప్పటికిని ఆకాశమువలె నా శరీరములతోఁడను గూడనివాఁడై కాలత్రయమందు నున్నాఁడు గాన సద్రూపుఁడై సమష్టివ్యష్టిరూపమై శరీరత్రయాత్మకమయిన ప్రపంచనిష్ఠపదార్థములలో నే పదార్థములచేతనుం దెలియఁబడక నానాపదార్థముల నెఱుఁగుచున్నాఁడు గనుక చిద్రూపుఁడై పరమప్రేమాస్పదుఁడగుటవలన నానందరూపుఁడై తోఁచుచున్నాఁడు. ఇటువంటి ఆత్మ నేనని ముముక్షువు లెఱుఁగఁదగినది. కార్యమైన శరీరత్రయంబును కారణమైన పృథివ్యాదులును ప్రత్యక్షముగఁ దోఁచుచుండఁగా శ్రుత్యాదులచేతఁ జెప్పఁబడిన అద్వితీయత్వ పరిపూర్ణత్వము లాత్మ కెటుల కూడు ననిన; సమష్టివ్యష్ట్యాత్మకమయిన శరీరత్రయమనెడి ప్రపంచ మాత్మయం దారోపితమై యున్నది. కనుక రజ్జ్వాదులయం దారోపింపఁబడిన సర్పాదులకు రజ్జుమాత్రస్వరూప మెటువలెనో అటుల ఆత్మయం దారోపితమైన ప్రపంచమునకు ఆత్మ వినాగా వస్త్వంతరంబు లేదు గాన ఆత్మకు సద్వితీయత్వాపాదకమైన వస్త్వంతరము లేదు. కాఁబట్టి ఆత్మ యద్వితీయుఁడనుటకు సందేహము లేదు. ఎప్పుడు ఆత్మకు అద్వితీయత్వము సిద్ధించెనో అప్పుడే పరిపూర్ణత్వంబును సిద్ధించెను. అదెటులనిన; ఆత్మకు భ్రాంతిచేత పరిచ్ఛిన్నముల వలెనే తోఁచెడి దేశకాలవస్తువు లాత్మ వ్యతిరిక్తముగా లేకపోయెను. కనుక త్రివిధపరిచ్ఛేదశూన్యస్వరూపమైన పరిపూర్ణత్వము సిద్ధించెను. ఇటువంటి ఆత్మ నేనని ముముక్షువు లెఱుంగవచ్చును. ఈ ప్రకారముగ నెవ్వఁడెఱుఁగుచున్నాఁడో వానికి కాలత్రయమందును ప్రపంచము లేదు. అయినప్పటికిని ప్రారబ్ధ మెంతపర్యంత మున్నదో, అంతపర్యంతంబును ఈ దేహేంద్రియాదిప్రపంచము మిథ్యాభూతమై తోఁచవచ్చును. అటువలెఁ దోఁచినందున జీవన్ముక్తికి మిథ్యాభూతమై ఆభాసరూపమైన సుఖదుఃఖప్రతీతిచేత బాధ లేదు. మిథ్య యనఁగా నెయ్యది యనిన;

రజ్జుసర్పాదులవలె స్వాధిష్ఠానాజ్ఞానముచేత బాధింపఁబడునది యనియు స్వప్నమనోరాజ్యములవలె చూచుచుండఁగానే నశించిపోవునదియనియు మరుమరీచికాజలములవలె ననిర్వచనీయమనియు దగ్ధపటాదులవలె సత్తారహితమై తోఁచునదియనియు శాస్త్రమందుఁ జెప్పఁబడిన మిథ్యాత్వలక్షణ మీ సమష్టివ్యష్ట్యాత్మకమైన దేహేంద్రియాదిప్రపంచమందున్నది గనుక పరమార్థస్వరూపుఁడైన ఆత్మయే పరతత్త్వము. ఆత్మకంటె భిన్నమువలె భ్రాంతిచేతఁ దోఁచెడి జగత్తు మిథ్యయని నిశ్చయించుటకు సందేహము లేదు. ఎవ్వఁడేనియు శాస్త్రోక్తసాధనసంపత్తికలిగి పరమార్థాద్వితీయ పరిపూర్ణసచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మ నేను, నన్ను వినాగా జగత్తు లేదని తోఁచెనేనియు నీ మిథ్యాభూతమయిన జగత్తుచేతను నాకు శరీరము లేదని సంశయభావనావిపరీతభావనలులేక యొకఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే జీవన్ముక్తుఁడు, విద్వాంసుఁడు, సకలశాస్త్రవేది, సమస్తమైనవారలకును బూజ్యుఁడునని శాస్త్రసిద్ధాంతము. ఈ యర్థమందు సంశయము లేదు.

ఇది పంచదశవర్ణకము.

---

# షోడశవర్ణకము

## తాపత్రయనిరూపణము

తాపత్రయముయొక్క స్వరూపము నిరూపింపుచున్నారము. తాపత్రయ మనఁగా; ఆధ్యాత్మికతాపమనియు, ఆధిభౌతికతాపమనియు, ఆధిదైవికతాపమనియు మూఁడువిధములు. అందు శరీరము నధిష్ఠించివచ్చునట్టి క్షయరోగము శీతజ్వరము సన్నిపాతము తలనొప్పి కడుపునొప్పి మొదలయిన రోగములచేత వచ్చెడి దుఃఖమునకు ఆధ్యాత్మికతాపమని పేరు. ఇట ఆత్మయన శరీరమని తెలియవలెను. పశువులు, ఏనుఁగులు, గుఱ్ఱములు, పెద్దపులులు, సర్పములు, వృశ్చికములు, మశకములు, మక్షికములు, మత్కుణములు మొదలయిన జంతువులవలన వచ్చెడి దుఃఖమునకు ఆధిభౌతికతాప మని పేరు. మంచు, ఎండ, జలము, వర్షము, పిడుగు, వాయువు, గుడి, గోపురములు, ప్రాకారమంటపములు మొదలైన అచేతనములవలన దైవవశమున వచ్చెడి దుఃఖమునకు ఆధి

దైవికతాప మని పేరు. ఈతాపత్రయములయొక్క స్వరూప మిట్టి దని తెలిసి ఈ తాపత్రయము శరీరంబునకును, దేహేంద్రియాదులకును గాని వీనికి సాక్షియైన నాకు (ఆత్మకు) లే దని యెవఁ డెఱుఁగు చున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది షోడశవర్ణకము.

---

# సప్తదశవర్ణకము

## ప్రతిబంధత్రయనిరూపణము

జ్ఞానమునకు ప్రతిబంధకమైన ప్రతిబంధత్రయంబును, వానికి నివృత్తియును నిరూపించుచున్నారము. ప్రతిబంధము-భూతప్రతిబంధ మనియు, వర్తమానప్రతిబంధమనియు, భావిప్రతిబంధమనియు మూఁడు విధంబులు. అందు భూతప్రతిబంధలక్షణం బెట్టి దనిన; బహుకుటుంబి యగు బ్రాహ్మణుఁ డొకఁడు జీవనార్థమై యొక యెనుమును సంపాదించి దానివలనఁ గలిగిన పాలు పెరుగు నెయ్యి విక్రయించి ఆ ద్రవ్యముచేత పుత్రకళత్రాదులను రక్షించును, ఎనుమును కసవు ప్రత్తిగింజలు మొద లైనవానివలన తుష్టిగా మేపుచు తదేకనిష్ఠుఁడై యుండఁగా కొంతకాలం బునకు కర్మవశంబువలన నతని పుత్రకళత్రాదులు నశించిరి. ఎనుమునుం జచ్చెను. అప్పు డతం డేకాంగియై సంసారము సత్య మని నమ్మి బహు శ్రమలు పడితిని. ఇప్పుడది స్వప్నంబువలె నసత్యంబయ్యె. సంసారాపేక్ష కలిగినవానికన్న మూర్ఖుం డొరుం డెవ్వండును గాఁడు. అని వానికి సంసారమునందు తుచ్ఛత్వబుద్ధి పుట్టి విరాగియై సన్యసించి సద్గురు సాన్నిధ్యంబు సంపాదించుకొని శ్రవణాదులను చేసెను. అంత నొక సమయంబున గురువు లతనిఁ జేరఁబిలిచి నీవు బహుదినంబులనుండి శ్రవ ణాదులను చేసితివే కృతకృత్యత నీకుం దోఁచియున్నదా? యనిన; నుతఁడిట్లనుఁ గాన. పూర్వాశ్రమంబునం దొకయెనుము గలిగి యుం డెను. ఆ యెనుము నాఁడే మృతమై పోయెను. అయినప్పటికిని శ్రవణ మనననిదిధ్యాసనకాలంబులయందును ఆ యెనుమే సాక్షాత్కారమయి యున్నది యని యథార్థంబుగా విజ్ఞాపనము చేసెను, అంతట గురువు

లిక భూతప్రతిబంధ మని నిశ్చయించి దానిం బో నడచుటకై ఆ యెనుమునందలి స్నేహంబు ననుసరించి తత్త్వము నుపదేశించిరి.

అది యెటువలె ననిన; గురువులు శిష్యునిఁ జూచి నీకు సాక్షాత్కారమైన యెనుము అస్తి భాతి ప్రియనామరూపము లనెడిదానిలో తుది రెం డవయవములను త్రోచి అస్తి భాతి ప్రియములను నేనని చింతింపుమని యుపదేశించిరి. ఆయుపదేశప్రకార మతఁడు చింతించుచు రాఁగా ఆనామరూపములు తోఁచక సచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మ నే ననే నిశ్చయము తోఁచి కృతకృత్యుఁ డాయెను. ఇది లోకమందు ప్రసిద్ధము. విద్యారణ్యస్వాములవారు ప్రతిబంధత్రయంబును దానికి నివృత్తిని పంచదశ ప్రకరణమందు ఈ ప్రకారముగానే నిరూపించి నారు. వర్తమానప్రతిబంధము - విషయాసక్తిలక్షణము ప్రజ్ఞామాంద్యము, కుతర్కము, విపర్యయదురాగ్రహము అని నాలుగువిధంబులు. అందు విషయాసక్తిలక్షణం బనఁగా; విషయంబులయందు గాఢమయిన ఆసక్తి కలిగియుండుట. ప్రజ్ఞామాంద్య మనఁగా; గురువులు చెప్పిన యర్థము బుద్ధియం దెక్కకపోవుట. కుతర్క మనఁగా; గురువులానతిచ్చిన అర్థంబునకు విపరీతార్థంబు తోఁచుట. విపర్యయదురాగ్రహ మనఁగా; నేను శ్రోత్రియుఁడను, పండితుఁడను, విరక్తుఁడ నని దేహేంద్రియాదుల యం దాత్మత్వబుద్ధి కలుగుట. ఇవి నాలుగును వర్తమానప్రతిబంధము లనఁబడును. వీనికి నివృత్తి యెటులనిన; శమదమోపరతితితిక్షలవలన విషయాసక్తిలక్షణంబును, పునఃపునః శ్రవణము చేయుటవలన ప్రజ్ఞామాంద్యంబును, మననమువలనఁగుతర్కంబును, నిదిధ్యాసనమువలన విపర్యాసదురాగ్రహంబును పోవును. ఈప్రకారంబున ప్రతిబంధంబునకు నాశము వచ్చుచుండఁగా ముముక్షువులయినవారికి తానే ఆత్మస్వరూప మను నిశ్చయంబు బుద్ధియందు కలుగును. ఆగామిప్రతిబంధంబు పాప కర్మంబువలన నెపుడు వచ్చుటయును తెలియఁబడక వచ్చునట్టిది. దాని నెటువలె నెఱుఁగ నగు ననిన; ఉపస్థితమయిన పాపకర్మంబు ముముక్షువున కొకవిధంబునం దూఢమయి దయారూపమయిన యాసక్తి పుట్టించునది భావిప్రతిబంధ మని తెలియవలెను. ముముక్షువైనవాఁ డయ్యాసక్తిని భావిప్రతిబంధ మని తెలియఁజాలక అకర్తయు నసంగుఁడు నైన; నన్ను ఈ యాసక్తి యేమి సేయఁగల దని దానికి అనడ్డసేయ

కున్నట్టయితే అవి వానికి కొన్ని జన్మంబుల నీయక పోదు. ఆ భావిప్రతిబంధంబు జన్మంబుల నిచ్చు ననుటకు ప్రమాణం బేమి యనిన; వాసుదేవుల కొక జన్మంబు గలిగెననియు, భరతునకు మూఁడుజన్మంబులు గలిగెననియు, మఱికొందఱి కనేకజన్మంబులు గలిగెననియు శ్రుతిస్మృతిపురాణంబులయందుఁ జెప్పఁబడియున్నది. కాఁబట్టి ముముక్షువైనవాఁ డీచెప్పఁబడిన ప్రతిబంధత్రయంబును విచారించి ప్రతిబంధంబులు తన్నంటకుండునటుల తొలఁగఁజేసికొనవలయును. అట్లొనర్పకున్న, వానికి కొన్ని జన్మంబులు కలుగుట సిద్ధంబు. సందేహంబు లేదు. ఈ ప్రతిబంధత్రయం బెవ్వని కేజన్మమందు నశించిపోవుచున్నదో, వానికాజన్మమందు ముక్తి సిద్ధము.

ఇది సప్తదశవర్ణకము.

---

# అష్టాదశవర్ణకము

## షడ్విధలింగప్రమేయము

లింగమనఁగా అంతరార్థము:—1. ఉపక్రమోపసంహారములు, 2. అభ్యాసము, 3. అపూర్వత్వము, 4. ఫలము, 5. అర్థవాదము, 6. ఉపపత్తి యను నాఱును తాత్పర్యనిర్ణయమునందు లింగములు.

1. ప్రపంచోత్పత్తికిఁ బూర్వము నామరూపరహితమై సత్తామాత్రమగు పరబ్రహ్మముమాత్రమే యుండెను. అది అద్వితీయము అని ఉపక్రమించి, ఈ దృశ్యప్రపంచమంతయు ఆ యాత్మయే. అదియే సత్యము అని ఉపసంహరించుట ఉపక్రమోపసంహారము.

2. 'తత్త్వమసి' యను వాక్యమును తొమ్మిదిమార్లుచ్చరించి దాని నభ్యసించుట అభ్యాసము.

3. అఖండైకరసస్వరూపుఁడగు బ్రహ్మము ప్రత్యక్షాదిప్రమాణగోచరుఁడు కాఁడు అనెడి వివేకము అపూర్వత్వము.

4. అఖండైకరసానుభవము గలిగి ప్రారబ్ధభోగానంతరము విదేహముక్తినిఁ బొందుట ఫలము;

5. ప్రకరణప్రతిపాద్యమగు దానివిషయమై ప్రశంసించుట అర్థవాదము.

6. మట్టివలనఁగలిగిన ఘటాదులు మట్టికంటె వేఱుకానియట్లు కారణమువలనఁ గలిగిన జగత్తు కారణముకంటె వేఱుకాదనెడి యుక్తి ఉపపత్తి.

లోకమందుఁగల శ్రుతిస్మృతీతిహాసపురాణాగమాంభియుక్తవచనంబులు నీవే, ఆత్మ నీవే బ్రహ్మమని చెప్పినప్పటికిని గురువులు నీవే ఆత్మ, నీవే బ్రహ్మమని శ్రుతియుక్త్యనుభవంబులవలన బహుప్రకారంబులుగా నుపదేశించినప్పటికిని ఈశ్వరకటాక్షంబును పెద్దలకటాక్షంబును సంపాదింపలేని పాపాత్మునియొక్క దుర్మార్గబుద్ధి సచ్చిదానంద స్వరూపుఁడైన ఆత్మ నే నని గ్రహింపఁజాలక జడమైన దేహేంద్రియాదులే తానని పరిభ్రమించును. ఇందుకు దృష్టాంతమయిన కథ యొకటి కలదు. ఆకథ యెట్లనిన; ఈలోకమందు ధర్మగుప్తుఁడనురాజొకఁడు కలఁడు. వాఁడు మిక్కిలి ధర్మంబు కలిగి సకల ప్రాణులను రక్షించుచుండ, కొంతకాలంబునకు వంచకుఁడును పాపాత్ముఁడు నైన భర్జు వను పేరుగలవాఁ డొకఁ డారాజునకు ప్రధానియై అధర్మంబులు మెండుగా నతనికి బోధింపసాగెను.

అది యెటులనఁగా—ఈ విద్వాంసులను చుట్టు కూర్చుండఁ బెట్టుకొని జీతములిచ్చుటవలన వీరు మనకుఁ గలుగఁజేసెడి లాభమేమి? సేనాపతులు సంప్రతులు వాఁకిటికావలివాండ్లు మొదలయిన ప్రజలకు విశేషంబుగ జీతము లియ్యనేల? కొంచెపుజీతంబుదీసుకొని మనకుఁ బ్రీతికరంబులైనపనులు సేయుచుండునట్టి నలుగురు సేవకుల నుంచుకొనినఁ జాలదా అని ఈరీతిగా నాయాసమయంబులయందు రాజునకు బోధించి సకలమైనవారిని జీవనంబు లేనివారినిగాఁజేసి యందఱికిని ద్వేషియై రాజు తనవాఁడై యుండఁగా నితరులవలనఁ బనియేమి యని గర్వించి యెట్టివారినైన నవమానించుచు సడ్డలేక మెలఁగుచుండఁగా నా పట్టణంబునందలిజనులందఱు నేకీభవించి వాని నెట్టులేనియు రాజసన్నిధిఁ జేరకుండున ట్లొనర్పవలయునని నిశ్చయించుకొని యొకనాఁడు సంఘీభవించి రాజద్వారమందు నిలిచి వాఁడు రాజదర్శనమునకై వచ్చుచుండ, నెదురుగాఁ బోయి చుట్టుముట్టి బడియలతోఁ గొట్టి తఱిమిరి.

వాఁడును పౌరులవలన దెబ్బలు పడఁజాలక యాపట్టణంబును విడిచి పాఱిపోయెను.

తర్వాత రాజు భర్జువు కొలువునకు రానికారణ మేమియనివిచారింపఁగా సన్నిధానమందున్నవారు వానికి జ్వరంబు వచ్చినందున రాలేదని విన్నవించిరి. ఆమాట విని రాజు వానికి మంచి ఔషధంబు లిచ్చి వ్యాధిరహితునిగాఁ జేయుం డని వైద్యుల కాజ్ఞాపించెను. వైద్యులు చెప్పినప్రకార మొనర్చుచున్నా మని చెప్పి మరుసటిదినంబున రాజ సభకు వచ్చి యో రాజేంద్రా! భర్జువునకు సమస్తౌషధంబులును నిచ్చి బహు శ్రమలు పడితిమిగాని వానికి కలిగియుండెడి దోషగుణంబులును జూడఁగా బ్రతుకు నని తోఁచలేదని చెప్పిరి. రాజు ఆమాట విని మిక్కిలి దుఃఖితుఁడై వానియింటికిఁ బోయి చూచి రావలయు నని ప్రయాణమయి పోవుచుండఁగా కొందఱు బ్రాహ్మణు లారాజున కెదురుగ వచ్చి మీ రేలపోయెదరు. భర్జువు చచ్చినాఁడు, రాజ్యాధిపతులగు మీబోటివారు శవంబు నవలోకించిన రాజ్యంబునకు కీడు సంభవించును. తిరుగా నగరు ప్రవేశించుట మంచిది. రండని పిలుచుకొని వచ్చి భర్జువును గూర్చి దుఃఖించుచున్న రాజునకు తగినమాటలు చెప్పి దుఃఖంబుం దొలఁగించిరి. తర్వాత భర్జువు ఈవృత్తాంతంబు దెలిసికొని యాగ్రహించి యెవ్విధంబుననైన రాజసాన్నిధ్యంబు నొంది వీరి నందఱిం దగిన దండనంబులకు పాత్రులనుగాఁ జేయుదు ననుదీక్ష వహించి తలవెండ్రుకలు పెంచి రాజదర్శన మెప్పు డగునో యని యెదురు చూచుచుండెను.

ఇవ్విధంబునఁ గొంత కాలంబు గడిచెను. అంత నొకనాఁడు రాజు స్వారి తరలిపోవుచుండఁగా నామార్గమం దొకరావిమ్రానిమీఁద నెక్కి యెవరికిని కనుపడకుండ ఆకులనడుమ నొదిగియుండి రా జాచెట్టుసమీపంబునకు రాఁగా 'జయ విజయీ భవ' యని కూఁతలు పెట్టుచు నేను భర్జువును నన్ను మీసన్నిధికిఁ జేరకుండఁ జేయవలఁయు నని పురజను లందఱును సంకేతం బొనర్చికొని నన్నుఁ గొట్టితఱిమి మీకు దూరస్థునిగాఁ జేసిరి అని కూఁతలు పెట్ట నారంభించెను. అప్పుడు రాజు అశ్వత్థంబు మీఁదనున్న భర్జువునుజూచి యాశ్చర్యపడి దగ్గఱనున్న ఉద్యోగస్థులను

చూడఁగానే వారు మహాప్రభూ! చచ్చిపోయిన భర్తవు బ్రహ్మరక్షస్సై యీరావిచెట్టుమీఁద చేరియున్నాఁడు. వానిదృష్టి మీపై నిసోఁకరాదు. ఇచట నిలువవలదు. పదండని వేగిరించుచు నయ్యువనిపాలకునికి వస్త్రంబులు కప్పి విభూతి నుదుటఁబెట్టి బాలాబగళాదిమహామంత్రంబులు జపించుచు భయహరంబు లగు మాటలవలన నతనిజడుపుఁ దీర్చుచు పట్టణంబునకుఁ దోడ్కొనిపోయిరి. తర్వాత కొందఱు భర్తవును చబుకులతోఁ గొట్టి తఱిమిరి. ఆరాజు దోషరహితంబు లయిన చక్షుస్సుల వలన భర్తవును జూచినవాఁడయ్యును సమీపమున నుండినవారియొక్క మాటలవలన భ్రమించి వానిని బ్రహ్మరక్షస్సని యెటుల నిశ్చయించెనో అటులే శ్రుతిస్మృతీతిహాసపురాణాగమాభియుక్తవచనంబులు నీవే ఆత్మ, నీవే బ్రహ్మ మని చెప్పినప్పటికిని గురువులు బహువిధంబులుగా నుపదేశించినప్పటికిని ప్రబంధంబు గలవారు విఫలంబులయిన దేహేంద్రియాదులే నే నని గ్రహించుచున్నారు. ఈయర్థంబు నెవ రెచ్చట నిరూపించి రనిన; సంక్షేపశాచార్యులవారు పురాణంబు లన్నియు శోధించి ఆపురాణార్థంబు సంక్షేపరూపంబుగ శారీరంబునందు నిరూపించియున్నారు. ఆవాక్య మెయ్యది యనిన;

శ్లో. పురుషాపరాధవతీ నారీ ఫణినిరవద్యచక్షురుదయాపి యథా,
విఫలాయ భర్తవిషయా భవతి శ్రుతిసంభవాపి తథాత్మవిదః.

ఇది అష్టాదశవర్ణకము.

---

# ఏకోనవింశతివర్ణకము

## తార్కికప్రకరణము

వేదాంతశాస్త్రవ్యతిరిక్తమయిన కావ్యనాటకశబ్ద శాస్త్రతర్కశాస్త్రాదులను చదివినవారలును కేవలకర్మఠులై నవారలును ముముక్షువుసు నానోపాయంబులను బన్ని బెదరు పుట్టించి చెరుతు రనుట దృష్టాంతపూర్వకంబుగ నిరూపించుచున్నారము. అది యెటు లనిన; ఈలోకంబునందు మండలేశ్వరుం డనురాజు గలఁ డతఁడు తన పురోహితునిఁ బిలిచి యజ్ఞము సేయు మని యాజ్ఞాపించి సకలపదార్థంబుల

నిచ్చెను. తరువాత పశువు దొరకక పశుపరీక్షకుఁడైన బ్రాహ్మణునిఁ బిలిచి కొంత ద్రవ్య మిచ్చి పశువును విలిచి తెమ్మని పంపించెను. అటు తర్వాత ఆ బ్రాహ్మణుఁడు గ్రామాంతరంబునకుఁ బోయి పశువును తీసికొని వచ్చుచుండఁగా సుంకముతీయువారు సుంక మిమ్మని యడ్డగించిన ఈ పశువు నగరికి పోవునది యని చెప్పఁగా వాండ్లు నగరికి వెఱచి సుంకంబు తీయక విడిచిరి. అంతట నక్కడనుండి బయలుదేరి పశువు తీసికొని వచ్చుచుండెను. అప్పుడు ఆ సుంకరులలో నొకఁడు మఱి యొకని చూచి వానిని భ్రమింపఁజేసి యుపాయముచే ఆ పశువును గ్రహింతమని చెప్పఁగా వాఁడు విని యీ యుపాయ మెటువంటిదనిన; నందుకు రెండవవాఁడు చెప్పుచున్నాఁడు.

మనము నలుగురముగాఁపోయి యీ పశువును గొనిపోవుచుండెడి మార్గమునకు నాలుగు ప్రక్కలయందుఁజేరి వానికి చిత్తవైకల్యంబు కలుగునట్టి మాటలాడి పశువు నపహారింపవచ్చు నని చెప్పెను. అంతట నా యిరువురును మఱియు నిద్దఱు మనుష్యులను సహాయముగాఁ బిలుచుకొనిపోయి యీ బ్రాహ్మణుఁడు పోవునట్టి త్రోవకు నాలుగుదిక్కుల యందును గనిపెట్టియుండిరి. బ్రాహ్మణుండును ఆ పశువును గట్టిన రజ్జువును చేతఁబట్టుకొని పోవుచుండెను. అప్పుడు మొదట నున్నవాఁడు అయ్యా! బ్రాహ్మణునికి కుక్కను పెంచుట యుచితమా? లేక పెంచి నప్పటికిని వెఱ్ఱికుక్కనా పెంచవలె; మంచికుక్క దొరకకపోయెనా? నీయొక్క అదృష్టము మంచిది కాకపోయిన నిదివరకే నిన్ను చంపదా? ఇది మనుష్యులను చంపును గనుక దూరముగాఁ బట్టుము. మాయొద్దకు తేవలదు. అని చెప్పి దానికి భయపడినవానివలెనే పరుగెత్తిపోవసాగెను. బ్రాహ్మణుఁడు వానిమాటలును వాఁడు పరుగెత్తుటయును జూచి వీఁడు వెఱ్ఱివాఁడుగా నున్నాఁడు. కాకుండిన ఈ పశువును చూచి యిటువలె చెప్పి పరుగెత్తునా యని వానిమాటలు సడ్డసేయకపోవుచుండెను. మఱి కొంతదూరముపోఁగానే రెండవవాఁడును ఆ బ్రాహ్మణుంజూచి అదే ప్రకారము చెప్పెను. అప్పుడు బ్రాహ్మణుఁడు, వాఁడు చెప్పినట్లె వీఁడును జెప్పుచున్నాఁడు. వెఱ్ఱికుక్కను జూచి పశువని భ్రమసి తెచ్చితినేమో యని సంశయించి యది తన్ను చంపునేమో యని చేతిరజ్జువును పొడుగుగాఁ బట్టుకొని భయపడి తిరిగి తిరిగి చూచుచు పోవుచుండెను. మఱి

కొంతదూరము పోయినతర్వాత మూఁడవవాఁడు ఆ బ్రాహ్మణునిఁజూచి ఓహో యయ్యా! వెఱ్ఱికుక్కను మాయొద్దకు తేవలదు. దూరముగాఁ బొమ్మని కూఁతలుపెట్టుచుఁ బాఱిపోయెను. అంతట నా బ్రాహ్మణుఁడు దిగులుపడి మోసపోయి వెఱ్ఱికుక్కను గొంటిని. దీని నిచ్చట విడిచిపెట్టి పోయితినా, తన్ను దిగవిడిచిపోవుట తెలుసుకొని తరుముకొని వచ్చి చంపును. ఏమి సేయుదును. దీనిని విడుచుట కెయ్యది యుపాయం బని చింతించుచు మెల్లమెల్లగాఁ బోవుచుండఁగా నాలుగవవాఁడు అతనిం బిలిచి, పూర్వరీతిగానే చెప్పఁగా, నా బ్రాహ్మణుఁడు వానితో అయ్యా! యీ వెఱ్ఱికుక్కను విడుచుటకుఁ దగిన యుపాయము చెప్పి నన్ను కాపాడితివేని నీకు మిక్కిలి సుకృతంబు గలుగునని వేఁడుకొనెను. అందుకు వాఁడు నాకు నీసమీపంబునకు వచ్చుటకు భయమగుచున్నది. ఆవెఱ్ఱికుక్కను వదలుటకుం దగినయుపాయంబును చెప్పెదను వినుము. ఇప్పుడు నీవు రజ్జువుతోడ దాని నొకచెట్టునొద్దకు తీసుకొనిపోయి చెట్టుకు రజ్జువుచేత మూఁడు చుట్లుచుట్టి ముడివేసి పాఱిపోయితివేని అది నిన్ను తరుముకొని రాఁజాలక అక్కడనేయుండును. నీవు సౌఖ్యం బుగా ప్రాణంబులు కాపాడుకోవచ్చునని చెప్పెను. బ్రాహ్మణుఁ డందుకు సమ్మతించి, యీ పశువు నొక్కవృక్షంబునకు కట్టివేసి నీవంటిపుణ్యాత్ము లెక్కడను లేరు. నాకు పోయినప్రాణంబును తెచ్చి యిచ్చితివి. దుర్మ రణంబు దప్పెను. పోయి వచ్చెద దయయుంచు మని చెప్పి వానిం బొగ డుచు పశువును కొనవలెననివచ్చి తిరిగి తల్లికడుపునఁ బుట్టినట్లాయెను. ఇంకమీఁద నిట్టిపెత్తనమునకుఁ బోరాదని తలఁచుచుఁ దన నివాసంబు నకుఁ బోయెను.

ఈ ప్రకారంబున పంచకులయిన యీ సుంకరులు బ్రాహ్మణుఁడు ప్రత్యక్షంబుగఁ గొనిన పశువును గ్రహించుటకై యతనిబుద్ధిని యెటుల చెఱచిరో అటులే తార్కికులు శాబ్దికులు పౌరాణికులు కర్మఠులు మొదలయినవారు ముముక్షువులయినవారిని గీతలు చదువుటవలనను, యోగీశ్వరుల సాంగత్యంబువలనను, ఉపనిషత్తులు చదువుటవలనను ఫలమేమి? నీకేమో పాపకర్మ ముపస్థితమయియున్నది. నారదాదు లకుఁగూడ జ్ఞానము లేదని పురాణాదులయందుఁ జెప్పఁబడియున్నది. ఏకజీవపక్షముఁవారు జ్ఞానము సర్వాత్మనాకూడదని చెప్పినారు. కలి

యుగమందు సన్యాసమే కూడదని శాస్త్రంబులయందుఁ జెప్పఁబడినది. వీరందఱును కూటికొఱకు సన్యసించినవారు. జ్ఞానమేది? అజ్ఞానమేది? మేము సకలశాస్త్రములును చదివి జ్ఞానముఁ గూడదని విచారించి కర్మములే చేయుచున్నారము. ముక్తి పొందవలెనను కోరిక గలిగియుండెనేని తర్కవ్యాకరణాదిశాస్త్రంబులు చదివి కావ్యనాటకాలంకారాదులయందు ప్రవీణత్వంబు సంపాదింపుము. ఉపనిషత్తులు మొదలైనవానిని స్మరింపక జ్ఞానబోధ చేసెడివారు వంచకులని యెంచుకొనుము. వారికి జ్ఞానము గలిగి గదా నీకు బోధింపవలెను. వారికే అమానిత్వాదిసాధనంబులు లేవు. క్షణమాత్రమైన నెండకు సహింపలేరు. జ్ఞానులని పేరు పెట్టుకొనియున్నారు గాని జ్ఞానలక్షణంబులైన స్థితప్రజ్ఞత్వాదులొకటియైన వారియందు లేదు. కోపతాపంబు లధికంబులైయున్నవి. ఒకశ్లోకంబునకు అర్థమడిగితే చెప్పలేరు. వీరివంచకత్వంబునకు లోపడి లోకంబునం దనేకులు చెడిరి. నీవును చెడియెదవని నీయందుఁగల విశ్వాసముచేత నింతదూరము చెప్పితిమి. నీకు ముక్తి కావలెనను తలఁపు గలిగియుండెనేని సులభమైన మార్గంబును జెప్పెదము. మాకు రహస్యములైన మంత్రంబు లనేకంబులు తెలియును. వానియం దొకమంత్రంబు నుపదేశించెదము. ఆ మంత్రమును జపించుచు వచ్చితివేని, ఇహంబున సర్వాభీష్టములును గలుగును. పరంబున మోక్షంబు గలుగును. ఇందుకు సందేహంబు లేదు. మా మాటలునమ్మి బ్రతుకుమని చెప్పి యీప్రకారంబుగ నాక్షేపించి వంచకు లగు తాము సద్గురువులు వంచకు లని బోధించి వేదాంతమందును ఆత్మస్వరూపోపదేశకులగు గురువులయందును ముముక్షువులకుఁ గల విశ్వాసమును తొలఁగింతురు. కాఁబట్టి యట్టి వంచకులమాటలు విశ్వసింపక వేదాంతమందును సద్గురువులయందును విశ్వాసము గలిగి గురుశుశ్రూషాపూర్వకంబుగా శ్రవణాదులు చేసి జ్ఞానంబు సంపాదించి ముముక్షువైనవాఁడు కృతార్థుఁడు కావలెను. ఇది సిద్ధము.

ఇది ఏకోనవింశతివర్ణకము.

---

# వింశతివర్ణకము

## సంశయత్రయనిరూపణము

సంశయాసంభావనావిపరీతభావంబు లన నెయ్యవి యనిన; దృష్టాంతపూర్వకంబుగ నిరూపించుచున్నారము. వస్తుద్వయంబు నొక దానియం దారోపించుట సంశయము. అనఁగా ఇది స్థాణువో, పురుషుఁడో యని తలఁచెడి చిత్తవృత్తి. ఇక్కడ స్థాణువు ఉండవలసినపని యేమి? స్థాణువు ఉండనేరదే యని తలఁచెడి చిత్తవృత్తి యసంభావన. ఒకవస్తువునందుఁగల నైజమును కాదని తలఁచుట విపరీతభావన. అది ప్రమాణగతసంశయము, ప్రమేయగతసంశయము, ప్రమాణగతాసంభావన, ప్రమేయగతాసంభావన, ప్రమాణగతవిపరీతభావము, ప్రమేయగతవిపరీతభావము అని ఒకటొకటి రెండేసివిధములై యుండును. అందు ప్రమాణసంశయం బెయ్యది యనిన; శ్రుతి కర్మను ప్రతిపాదించుచున్నదా? లేక శిష్టమైన ప్రత్యగ్బ్రహ్మమును ప్రతిపాదించుచున్నదా? యని వచ్చెడి సంశయము ప్రమాణగతసంశయము. ప్రమేయగతసంశయమనఁగా జగత్కారణవస్తువు బ్రహ్మమా? లేక ప్రధానాదులా? యనివచ్చెడి సంశయము. ప్రమాణగతాసంభావనయనఁగా; బ్రహ్మము శుద్ధవస్తువగుటవలన ప్రమాణాంతరముచేత పృథివ్యాదులవలె నెఱుఁగఁబడుచున్నది. కనుక శ్రుతులు ఆ శుద్ధబ్రహ్మము జగత్కారణమని యెటుల ప్రతిపాదించును. ప్రతిపాదింపనేరవే అనెడి నిశ్చయంబే ప్రమాణగతాసంభావన. ప్రమేయగతాసంభావన యనఁగా; జగత్తుకంటె బ్రహ్మము విలక్షణమై యున్నది గనుక జగత్తుకు కారణ మని చెప్పఁగూడదు. ప్రధానాదులే జగత్తుకు కారణ మనే నిశ్చయము ప్రమేయగతాసంభావన. ప్రమాణగతవిపరీతభావనయనఁగా; బ్రహ్మము శుద్ధవస్తువు గనుక శ్రుతులకు శుద్ధబ్రహ్మమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము లేదు. శ్రుతులు శుద్ధబ్రహ్మంబును ప్రతిపాదించినట్టయిన పురుషునకు వృత్తినివృత్తులు కానము గనుక ప్రయోజనము లేక పోవును. లోకమందు ప్రవృత్తిపూర్వకముగానే పురుషార్థంబును కన్నా

రము. అశుద్ధ్యాదివికారంబులతోఁ గూడుకొనియుండెడి జగత్తుకు కారణమైన బ్రహ్మంబును అశుద్ధ్యాదులతోఁ గూడుకొనియుండవలెను. అటుల నుండలేదు. కాఁబట్టి ప్రధానాదులే జగత్తుకు కారణమని బుద్ధియందుఁ దోఁచుట ప్రమేయగతవిపరీతభావన. ఇటువలె అంతర్యమందును జీవుఁడుగాను జగత్తులో నొకఁడుగాను తోఁచుచుండెడి తాను జగద్విలక్షణమయిన బ్రహ్మమగునో కాదో యనెడిది ప్రత్యగాత్మవిషయసంశయము. అటువలెనే కర్తృత్వాద్యనేకధర్మయుక్తుఁడై పరిచ్ఛిన్నుఁడై జననమరణంబులతోఁ గూడుకొనియుండెడి తనకు విపరీతలక్షణములు గల బ్రహ్మస్వరూపత్వము నెటువలెఁ గూడును? కూడనేరదే యని నిశ్చయించుట ప్రత్యగాత్మవిషయమయిన అసంభావన. ఇటుల తాను అకర్త యయ్యెనేని తన్నుద్దేశించి యీకర్మను చేయుము. ఈ కర్మను చేయకుము, దీనిని మానుము, దీనిని మానకుము, దీనిని గ్రహింపుము, దీనిని గ్రహింపకుము, దీనిని భక్షింపుము, దీనిని భక్షింపకుము అను నీలాటి ధర్మములు శ్రుతులయందు ప్రవర్తింపనేరవు. కాఁబట్టి నేను కర్తనే? సందేహము లేదు అనే కర్తృత్వాదుల కుపయోగమయిన అభిమానాదులకు సర్వధర్మప్రతీతిలక్షణమయిన విపరీతభావన. ఈ ప్రకారముగా న్యాయమందు సంశయము, అసంభావన, విపరీతభావన అనెడి సంశయత్రయమును విచారించి ఇవి రాకుండఁ జేసికొని యెవఁడు విజ్ఞానమును సంపాదించుచున్నాఁడో, వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది వింశతివర్ణకము.

---

# ఏ క విం శ తి వ ర్ణ క ము

## ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములు

అధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములను విచారించుచున్నారము. శ్రోత్ర మధ్యాత్మంబు. దీనికి అధిభూతము శబ్దంబు. దిక్కు లధిదైవతములు. త్వక్కు అధ్యాత్మంబు. దీని కధిభూతము స్పర్శంబు. వాయువధిదైవతంబు. చక్షుస్సు అధ్యాత్మము. దీనికి అధిభూతము

రూపము, సూర్యుఁడు అధిదైవతము. జిహ్వ అధ్యాత్మము. దీనికి అధిభూతము రసము. వరుణుఁ డధిదైవతము. ఘ్రాణ మధ్యాత్మము. దీనికి అధిభూతము గంధము. అశ్వినీదేవత లధిదైవతములు. వాక్కు అధ్యాత్మము. దీనికి అధిభూతము పలుకు. అగ్ని యధిదైవము. హస్తము లధ్యాత్మము. దీనికి అధిభూతము దానము. ఇంద్రుఁ డధిదైవతము. పాదము లధ్యాత్మము. దీనికి గమన మధిభూతము. ఉపేంద్రుఁ డధిదైవతము. వాయువు అధ్యాత్మము. దీనికి విసర్గ మధిభూతము. మృత్యు వధిదైవతము. ఉపస్థ మధ్యాత్మము. దీనికి ఆనంద మధిభూతము. ప్రజాపతి యధిదైవతము. మనస్సు అధ్యాత్మము. దీనికి సంకల్ప మధిభూతము. చంద్రుఁ డధిదైవతము. బుద్ధి యధ్యాత్మంబు. దీనికి నిశ్చయ మధిభూతంబు. చతుర్ముఖుఁ డధిదైవతము. చిత్త మధ్యాత్మంబు. దీనికి స్మరణ మధిభూతము. క్షేత్రజ్ఞుఁ డధిదైవతము. అహంకార మధ్యాత్మంబు. దీనికి అభిమాన మధిభూతంబు. రుద్రుఁ డధిదైవతము. మనస్సు అధ్యాత్మంబు. దీనికి వికార మధిభూతము. ఈశ్వరుఁ డధిదైవతము. ఇవియన్నియును గూడి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు. వీనికి సాక్షియైన ఆత్మ నేనని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది ఏకవింశతివర్ణకము.

---

# ద్వావింశతివర్ణకము

## నవవిధసంస్కారనిరూపణము

నవవిధసంస్కారంబులను నిరూపించుచున్నారము. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయంబులనియు, కర్తృ కర్మ క్రియలనియు, భోక్తృ భోజ్య భోగంబులనియు సంస్కారంబులు తొమ్మిదివిధంబులు. పక్షాంతరంబున ప్రాణపంచకంబును జ్ఞానేంద్రియంబులును కర్మేంద్రియంబులును భూతపంచకంబును అంతఃకరణ చతుష్టయంబును స్థూలశరీరంబును త్రివిధకర్మంబులును అవస్థాత్రయంబును వీనికి కారణమైన అజ్ఞానంబునుగూడి నవవిధసంస్కారంబు లని చెప్పఁబడెను. దీనికి నవవిధ ప్రపంచమనియు పేరు. ఈ నవవిధసంస్కారంబులును అహంకారంబునకే కాని అహంకారసాక్షి

నైన నాకు లేవని యెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంత సిద్ధాంతము.

ఇది ద్వావింశతివర్ణకము.

---

# త్రయోవింశతివర్ణకము

## పుర్యష్టకములు

శ్లో. జ్ఞానేంద్రియాణి ఖలు పంచ తథావరాణి
కర్మేంద్రియాణి మనసాది చతుష్టయం చ,
ప్రాణాదిపంచకమథో వియదాది పంచ
కామశ్చ కర్మ తమసః పునరష్టధా స్యాత్.

అర్థము :—జ్ఞానేంద్రియపంచకమును, కర్మేంద్రియపంచకమును, అంతఃకరణచతుష్టయంబును, ప్రాణాదిపంచకంబును, వియదాదిపంచకంబును, కామంబును, కర్మంబును, తమస్సు అను నీ యెనిమిదియును పుర్యష్టక మనఁబడును.

ఇది త్రయోవింశతివర్ణకము

---

# చతుర్వింశతివర్ణకము

## వైరాగ్యబోధోపరతులు

వైరాగ్యబోధోపరతులకు హేతుస్వరూపకార్యంబులును, వానికి అవధియును నిరూపించుచున్నారము. వైరాగ్యబోధోపరతులు వివేకుల యం దొకటికొకటి సహాయంబై శ్రవణాదులవలన ప్రాణులను కూడుకొనియుండును. కర్మవశంబువలన నొక్కటి యొక్కొకసమయంబున నొక పురుషునికి లేకయుండును. ఈ వైరాగ్యబోధోపరతులకు హేతు వెయ్యది? స్వరూప మెయ్యది? కార్య మెయ్యది? యని ముముక్షువు ప్రత్యేకంబుగా విచారించి యెఱుఁగఁదగినది. వీనిలో వైరాగ్యంబునకు

హేతుస్వరూపకార్యంబు లెవ్వి యనిన; సమస్తవిషయములను వాంత్య శనంబువలె వదలవలయునని తోఁచునట్టిది హేతువు. ఈ విషయంబుల యందు వృత్తి రాకుండునట్టిది స్వరూపంబు. ఆ విషయంబులను అను భవింపక యెందుకు తోసివేసితి నని తిరుగబడక వానియం దాసక్తి రాకుండుట కార్యంబు. యీ మూఁడును వైరాగ్యంబునకు నసాధారణ హేతుస్వరూపకార్యంబులు. బోధకు హేతుస్వరూపకార్యంబు లెవ్వి యనిన; శ్రవణమనననిదిధ్యాసనములు హేతువులు. ఆ శ్రవణాదులచేత దేహేంద్రియాదిప్రపంచంబువలన ఆత్మస్వరూపమును బంచి అద్వితీయాత్మస్వరూపమే నేను; ఈ దేహేంద్రియాదిప్రపంచంబు నేనుగాను; యీ ప్రపంచంబు దోఁచినప్పటికిని కాలత్రయమందును నేను కానని బుద్ధియందు దృఢమయిన నిశ్చయంబుంచుట బోధకు స్వరూపంబు. ఈ యనాత్మస్వరూపమయిన దేహేంద్రియాదులు నేనని తలఁపకుండుట బోధకు కార్యంబు. ఈ మూఁడును బోధకు సాధారణంబైన హేతుస్వరూప కార్యంబులు. ఉపరతికి హేతుస్వరూపకార్యంబు లేవి యనిన; యమనియమాదులు హేతువులు. చిత్తనిరోధంబు స్వరూపంబు. సర్వవ్యవహారనాశంబు కార్యంబు. ఈ మూఁడును ఉపరతికి సాధారణమైన హేతుస్వరూపకార్యంబులు. ఈ ప్రకారముగా వైరాగ్యబోధోపరతులకు స్వరూపకార్యంబు లన్యోన్యసహకారంబులే యని చెప్పఁబడెను. ఈ వైరాగ్యబోధోపరతులు మూఁడును మోక్షంబునకు సమప్రధానంబులో లేక రెండు ప్రధానంబులో యొకటి యుపసర్జనంబో యని శంక రాఁగా నా శంకను దొలఁగించుచున్నారము.

సాధనాంతరంబు నపేక్షింపక ప్రత్యక్షంబుగ మోక్షంబు నిచ్చునది గాన బోధము ప్రధానంబు. వైరాగ్యోపరతులు రెండును బోధకు సాధనంబులు. ఇవి మూఁడు నొక పురుషునియం దున్నట్టయితే మహాత్తైన తపస్సుయొక్క ఫలము. ఒక పురుషునియందు మూఁడింటిలో నొకటికి కర్మవశంబున ప్రతిబంధంబు వచ్చినను వచ్చును. ఒక పురుషునికి వైరాగ్యోపరతులు పూర్ణంబులై యుండి జ్ఞానంబు లేకున్న వానికి మోక్షంబు లేదు. అయితే యీ వైరాగ్యోపరతులు వ్యర్థంబు లయ్యెంగదా యనిన; వైరాగ్యోపరతులు తపస్సు. కాఁబట్టి వానివలన పుణ్యలోకప్రాప్తి యగును. ఒక పురుషునికి జ్ఞానంబు పూర్ణంబై యుండి

వైరాగ్యోపరతులు లేకున్నను వానికి మోక్షంబు సిద్ధించును. అయితే వైరాగ్యోపరతులవలన ప్రయోజనం బేమి యనిన; అవి లేకపోయినచో ప్రత్యక్షదుఃఖంబు పోదు. ఈ వైరాగ్యోపరతులకు అవధి యెప్పుడనిన; బ్రహ్మాలోకతృణీకారము కలుగుపర్యంతంబు నవధి. అజ్ఞానకాలంబునం దీ దేహేంద్రియాదిసంఘాతంబు నేనని నిశ్చయంబు వచ్చినట్టు అవి తోఁచకయే ఆత్మస్వరూపంబు నేనని దృఢనిశ్చయము కలుగుపర్యంతంబును బోధకు అవధి. సుషుప్తియందువలె జాగ్రత్తయందును ముముక్షువు సమస్తవిషయంబులను మఱచియుండుట యెప్పుడు సిద్ధించునో అంతపర్యంతంబు నుపరతికి అవధి. ఈ ప్రకారంబున వైరాగ్యబోధోపరతులకు తారతమ్యము నవధియును జెప్పినట్లాయెను. ప్రారబ్ధంబు నానావిధంబు కాఁబట్టి వివేకులైనవారలు వారలయొక్క వ్యాపారమును జూచి శాస్త్ర మెటువలె నున్నది వీర లెటువలె నున్నారని భ్రమింపఁబనిలేదు. వారికర్మ చేత వారు నానావిధవ్యాపారంబులతోఁ గూడుకొని యున్నప్పటికిని జ్ఞానంబును జ్ఞానఫలంబయిన ముక్తియును సమానంబు. ఈ ప్రకారము వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది చతుర్వింశతివర్ణకము.

---

# పంచవింశతివర్ణకము

## వాసనాత్రయనిరూపణము

జ్ఞానమునకు ప్రతిబంధకమైన వాసనాత్రయమును నిరూపించుచున్నారము. వాసనాత్రయమనఁగా; లోకవాసనయనియు శాస్త్రవాసనయనియు దేహవాసనయనియు మూఁడువిధంబులు. అందు లోకమందు సమస్తమయినవారు తన్ను నిందింపక యుండవలయుననియు అందఱును తన్ను సర్వదా స్తోత్రంబు సేయవలయుననియు ననెడి యభినివేశంబు లోకవాసన యని చెప్పఁబడును. ఈ లోకవాసనా ప్రతిబంధంబునకు నివృత్తి యెప్పు డనిన; నే నొకనిచేతను నిందింపఁబడక ఉండవలెను. తన్ను అందఱును స్తోత్రంబు చేయవలె ననెడి అభినివేశం బీశ్వరునికైనను గూడదు గనుక అజ్ఞానజీవులు నిండించినను నిందింతురు,

స్తోత్రముచేసినను చేయుదురు, అని నిందాస్తుతులయం దొకరినిందచేత
హానియేమి? స్తోత్రముచేత ఫలమేమి? యని యెఱుఁగుటయే ప్రతిబంధం
బునకు నివృత్తి అయితే యీశ్వరుని నిందచేసెడివారు కలరా యనిన;
గలరు. అది యెటులనిన; సర్వలోకేశ్వరుఁడైన చతుర్ముఖుఁడైనట్టి బ్రహ్మ
శివునిచేతను కుమారస్వామిచేతను శిక్షింపఁబడియెనని ఆ బ్రహ్మదేవుని
మహిమ యెఱుఁగనివారలు నిందించుచున్నారు. మఱియును లోక
మందలి సమస్తమయినవారలకును ఆత్మస్వరూపుఁడును లోకపాలకుఁ
డును లక్ష్మీపతియు నయిన విష్ణువును జీవులలోపల నొకఁడనియు శివుని
చేత శిక్షింపఁబడియెననియు నెంచి యతనిమహిమంబు నెఱుఁగని శివ
పాషండులు నిందించుచున్నారు. వెండియు సమస్తమయినవారలకును
గురువై యుండునట్టి మహాదేవుఁడు దక్షప్రజాపతి మొదలైనవారిచేతను
దూషింపఁబడినాఁడని నిందించి యతనిమహిమంబు నెఱుఁగని విష్ణు
పాషండులు నిందించుచున్నారు. ఇటులనే అంతర్యామిని నిరీశ్వర
సాంఖ్యులనెడి కొందఱు మీమాంసకులు అంతర్యామి లేఁడని నిందించు
చున్నారు. ఇటువలెనే ఈశ్వరసమ్మతిగల రామకృష్ణాదులు రావణశిశు
పాలాదులచేత నిందింపఁబడిరని పురాణంబులయందు కానఁబడుచున్నది.
కాఁబట్టి పామరులును బహిర్ముఖులు నయిన జనులు మనల నిందించు
చున్నారు. ఆ నిందనుగుఱించి చింతసేయఁబనిలేదు. అయితే ఈ నింద
యెవరికని విచారింపుదము. ఆత్మకు అని చెప్పిన, అద్వితీయుఁడును పరి
పూర్ణుఁడును సర్వాత్మకుఁడు నయిన ఆత్మ యెవరిచేతను నిందచేయఁ
బడఁగూడదు. ఎందుచేత ననిన; ఆ యాత్మ సర్వప్రాణులకును స్వరూ
పంబు గనుక తన్నుఁదానే నిందించుకొన్నట్టవును. అయితే కానీయనిన;
లోకమం దొకఁడు మరియొకని నిందింపఁగా కన్నారము. తన స్వరూ
పంబును తానే నిందించుకొనుట కానము. తన్నే తాను నిందించుకొని
నచో ఆ నిందచేత తనకు హానిలేదని యెఱుఁగఁదగినది. అయితే దేహం
బును నిందించుచున్నారని చెప్పుదమనిన; దేహము ముముక్షువుచేత
పూర్వమే నిందింపఁబడెను. కాఁబట్టి ఆ దేహమును పరులు నిందించి
నచో ఆ నింద ముముక్షువులకు లాభమాయెను.

అది యెటులనిన; ఒకనియొక్క శత్రువును మఱియొకఁడు నిందిం
చినచో వాఁడు వాని కెటువలె ప్రియుఁడో అటువలెనే వివేకిని

తనదేహమును నిందించినవాఁడు తనకు ప్రియుఁడని యెఱుఁగఁదగినది. ఈ మూఁడుశరీరములలోపలను స్థూలశరీరమే నిందింపఁబడుచున్నది. కొదవ రెండుశరీరములును దృశ్యములు కావు గనుక నిందకు విషయములు కావు. ఈ శరీరములే నిందకు విషయములాయెను. కనుక సర్వాతీతుఁడై సమస్తమైనవారిని ఆత్మస్వరూపుఁడై అసంగుఁడై సాక్షియై స్వప్రకాశస్వరూపుఁడై తన్ను ఏ నిందలును స్పృశింపనేరవనుట చెప్పవలెనా అని విచారించు పురుషునికి లోకవాసనాస్వరూపమయిన ప్రతిబంధము నశించిపోవును. ఈ యర్థమందు సంశయము లేదు. దేహవాసన యనఁగా; జీవించియుండెడి శరీరమునకు చిరకాలావస్థానము. ఆ దేహస్థితియు కర్మాధీనము గనుక పురుషయత్నముచేత సంపాదింపనే కూడదు. ఇటువలె కూడదని చెప్పఁగూడదు. లోకమందు కొందఱు యోగాభ్యాసముచేసి దీర్ఘమైన ఆయుస్సును సంపాదించుచున్నారని పురాణములయందుఁ గానఁబడుచున్నదని చెప్పితిరా ? ఆ యోగాభ్యాసము అనాత్మవిషయము గనుక జ్ఞానము రాకుండఁజేయును. కాఁబట్టి దేహము కర్మాధీనము గనుక కర్మము ఎంతపర్యంతమున్నదో అంతపర్యంతమును దేహమును ఉండును. కాఁబట్టి దేహము బహుకాలముండవలెనని యెట్టియత్నము చేయవలసినపనిలేదు. అని ముముక్షువు దేహమందుపేక్ష చేయఁదగినది. ఈ యర్థమే శ్రుతిస్మృతీతిహాసపురాణములచేతను చెప్పఁబడ్డది. ఇటువలె ఆరోగ్యమును పురుషునిచేత సంపాదింపఁగూడనిదయ్యె.

అది యెటువలె ననిన; ఆరోగ్యమును కర్మాధీనము గనుక పురుషులయత్నముచేత సంపాదింపఁగూడదు. సిద్ధించినప్పటికిని ముముక్షువునకు దానివలన లాభమేమియు లేనందుచేత హానిమాత్రమే యగును. ఆయురారోగ్యసిద్ధివల్లను హర్షస్వరూపుఁడైనటువంటి తనకు వికారము సిద్ధింపకపోయినందున దుఃఖస్వరూపుఁడైతిననే విచారమును అంతఃకరణసాక్షియైన నాకు లేవని విచారించి ఆయురారోగ్యములు సిద్ధించవలె ననుటయందు ముముక్షువు అభిలాష సేయఁదగదు. ఈ యర్థమే శ్రుతులచేతను చెప్పఁబడ్డది. ఇటువలెనే లావణ్యము గలిగిన పురుషునియందు కాలాంతరమందు రూపప్రాప్తి కర్మాధీనము గనుకను లావణ్యము రావలెనని యత్నము చేసినప్పటికిని ఆ యత్నము వ్యర్థ

మైపోయినది కన్నారము గనుకను లావణ్యమును సంపాదింపఁగూడదు. ఆ లావణ్యమును సంపాదింపవలెనని అభినివేశముగా వచ్చెడి ప్రవృత్తి సమస్తమైన పారలౌకికవృత్తికి విఘాతమై అనర్థపరంపరకు హేతు వాయెను గనుక ఆ లావణ్యము సిద్ధింపవలె ననుటయందలి అభినివే శము ముముక్షువుచేత విడువఁదగినది. ఈ యర్థమే శ్రుతిస్మృతీతిహాస పురాణములచేతఁ జెప్పఁబడ్డది. శాస్త్రవాసన యనఁగా శాస్త్రపాఠ మందును, శాస్త్రార్థజ్ఞానమందును శాస్త్రానుష్ఠానమందును వ్యసనము. శాస్త్రవిషయమైన వాసనాస్వరూపప్రతిబంధము మోక్షసాధనమైన శాస్త్రమువలె ప్రతిబంధమని చెప్పఁబడినదనిన; భారద్వాజనారదాదులు వేదశాస్త్రములను సాకల్యముగా నధ్యయనము చేసెదమని యుపక్ర మించి బహుదుఃఖమును పొంది అసాధ్యమని విడిచిపెట్టినారని శ్రుత్యా దులయందు వినఁబడినది గనుకను వేదాంతవ్యతిరిక్తమైన అన్యశాస్త్రా భ్యాసము ఆత్మవిచారమునకు విరోధము గనుకను, అది ప్రతిబంధమని చెప్పవచ్చును. కాఁబట్టి అన్యశాస్త్రపఠనమందును శాస్త్రార్థజ్ఞానమం దును శాస్త్రానుష్ఠానంబును సాకల్యముగా ప్రజ్ఞ సంపాదింపఁగూడదు గనుక ముముక్షువుచేతను వీటిని సాకల్యముగా సంపాదింపవలె ననెడి అభినివేశము విడువఁదగినది. లోకమందు శాస్త్రాభ్యాసము చేసినవారికి పూర్వము అభ్యసించినది మఱచుటచేతను దుఃఖమై తోఁచుచున్నది. తాను పరులతో వాదించి జయించినప్పటికిని ఓడినప్పటికిని దుఃఖమే తోఁచుచున్నది. కాఁబట్టి శాస్త్రాభ్యాసము సర్వానర్థహేతువు గాన ముముక్షువుచేతను అన్యశాస్త్రాభ్యాసమువల్ల నుపరతి యభ్యసింపఁదగి నది. ఇటు లభ్యసించినశాస్త్రము లనర్థమని విచారించి అన్యశాస్త్ర ములవలనను ఉపరతి పొందెనచో శాస్త్రవాసనావిషయమైన ప్రతి బంధము నశించిపోవును. ఈ యర్థమే శ్రుతులయందు చెప్పఁబడినది. ఎవఁడు ఈ ప్రకారంబుగా విచారించి యీ ప్రతిబంధంబులను రాకుండ చేసికొని ఆత్మ ప్రతిపాదకమైన శాస్త్రార్థవిచారంబుచేతను జ్ఞానంబును సంపాదింపుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది పంచవింశతివర్ణకము.

---

# షడ్వింశతివర్ణకము

## ఆసురవాసనానిరూపణము

ఆసురవాసనాస్వరూపమైన ప్రతిబంధమును నిరూపించుచున్నారము:—ఆ ప్రతిబంధము తనయందును లేనిదిగా తోఁచినప్పటికి నొక సమయమందు పరునియొక్క ఆచారంబును చూచి తరువాతను అవే తొందలచేతను ఆ ప్రతిబంధము ప్రకటమౌను. అది యెటువలెననిన; ఓరీ భ్రష్టా! ఆచారంబులు ఇటులనా చేయుట. భ్రష్టుఁడవై పోతివి. సందేహము లేదు. నీకు ఆచారంబు చెప్పిన గురు వెవఁడో వాఁడు భ్రష్టుఁడే. సందేహంబు లేదు. ఓరీ! రేపుమొదలుకొని నీవు మా సముఖంబునకు రావలదు లేచిపోరా! అనియును, ఓరీ! మమ్ము నమస్కరించి బ్రతికిపోరా! అనియును, గురుపాదతీర్థంబు పుచ్చుకొని బ్రతికిపోరా! అనియును, మాకు శుశ్రూష చేయుటకన్న వేదాంతవిచారమందు ఏమియున్నది? మమ్ముఁ బూజించితివేని నీకు సకలాభీష్టంబులు సిద్ధింపుచున్నవనియును, మమ్ము వినాగా నెవరికిని శుశ్రూష సేయవలదనియును, ఓరీ! యెవ్వరికైనా మావారికి సమస్తమును నీయవేని నీవు మాయొద్దకు రావద్దనియును, ఒకఁడు మమ్ము సడ్డసేయక లేవకపోయెను. వానికి ఆయుస్సు ఇంతమట్టుకు సరి అంటిమి. వాఁడు భస్మమైపోయెను. మఱియొకఁడు ఐశ్వర్యమదముచేత మమ్ము పరామర్శింపకపోయెను. వానికి ఐశ్వర్యంబు ఇంతటితో సరి యనిన; అటువలెనే వానికి ఐశ్వర్యంబు పోయెను. ఓరీ! మావద్ద మంత్ర ముపదేశించుకొని యొకఁడు మమ్ము గణింపకపోయెను. వానిని భస్మమై పోదువని చెప్పితిమి. వాఁడు అటువలెనే భస్మమైపోయెననియును. మా మహిమ మావంటివారు ఎఱిఁగిరి. ఇంతేకాని యెవరు ఎఱుఁగఁబోవుచున్నారనియును, మేము భూతభవిష్యద్వర్తమానకాలవృత్తాంతంబు లెఱింగినవారలమనియును, గతంబున ననేకుల రక్షించితిమి. ఇప్పుడు అనేకులను రక్షించుచున్నారమనియును, ఇఁకమీఁద ననేకుల రక్షింపఁబోవుచున్నారమనియును, మాచేత ననేకద్రవ్యంబులు సంపాదింపఁబడెను. అవియన్నియు దానము చేసితి

మనియును, తన మనసున నేమి కోరుచున్నాఁడో అదియంతయు ముం దట వచ్చి నిలుచుననియును, తన కింత ద్రవ్యము రాఁబోవుచున్నదని యును, వీఁడు నాచేతఁ జెంపఁబడెను. ఇంతమాత్రమే కాదు. వీఁడు తలక్రిందుగాఁ బడుచున్నాఁడు. వాఁడు తలక్రిందుగాఁ బడుచున్నాఁడు, మఱికొందఱు తలక్రిందుగాఁ బడుచున్నారు. వీరినందఱిని సంహరింపఁ బోవుచున్నామనియును, నీ మనస్సు రావలెననియును, నే నీశ్వరుఁడని యును, భోగి ననియును, సిద్ధుం డనియును, బలవంతుఁడ ననియును, అఖ్యుఁడననియును, నాకు సమానమైనవాఁ డెవ్వఁడున్నాఁడనియును, యజ్ఞముచేసినను, బ్రాహ్మణభోజనము చేయించినను, దానముచేసినను, నేనే చేయవలయుననియును, నాయంత సామర్థ్యమును బుద్ధియును సుగుణంబులును లోకమం దెవరికిని లేవనియును, తాను మంత్రశాస్త్రం బునం దతిసమర్థుండననియును, తన కొక ద్వేషియుండఁగా వాని నొక మంత్రప్రయోగంబుచేత భస్మంబుచేసితిననియును, మఱియొకఁడు నాకు శిష్యుఁడై యుండెను. వాని కొక మంత్ర ముపదేశించితిని. వానికి సక లైశ్వర్యంబులు వచ్చెననియును మరియొకఁడు చచ్చిపోవలయునని యొక మంత్రంబు నుపదేశించితిని. వాఁ డామంత్రంబును మూఁడుదినంబులు జపియించి భస్మమైపోయెను. పూర్వమందు పెద్దలెందఱో యుండిరిగాని వారల కీపాటిమహిమలు లేవు. వంచనలేక యెవరు శుశ్రూష చేయు చున్నారో వారే కృతార్థులు. నా శరీరంబు నెవ్వరు రక్షింపుచున్నారో, వారే ధన్యులౌదురు. ఇచ్చునట్టి సమస్తంబును మాకే యెవ రిత్తురో వారికి పరలోకము సిద్ధించును. మాయొక్క దర్శన మెవరికి దొరుకు చున్నదో, వారలకు సర్వపాపములు నశించును. మా పాదరేణువు లెవ్వరిగృహమందుః బడుచున్నవో ఆ గృహమే గృహము. మా పాద రేణువు లెవఁడు శిరసా వహింపుచున్నాఁడో వాఁడే కృతార్థుఁడు. మా కింతటి మహిమ లేకపోయినచో అందఱును మమ్ము నెందుకొఱ కుపా సింపుదురు. మేము దొడ్డవారము, సందేహము లేదు. బహుప్రకారం బులుగాఁ జెప్పెడి దేమి యున్నది అనియును, మనోవాక్కాయంబుల చేత నీ శరీరంబు నీశ్వరునిగా నెంచి యెవరు పూజించుచున్నారో, వారలకు దోషపరిహారమనియును, ఈ ప్రకారంబుగా ననర్థరూపమై వచ్చునట్టి చిత్తవృత్తి ఆసురవాసనాప్రతిబంధమని చెప్పఁబడును.

ప్రతిబంధంబు మిగుల ననర్థహేతువు గనుకను అనాత్మవిషయంబు గనుకను ఆత్మజ్ఞానంబునకు విరోధంబు గనుకను మోక్షేచ్ఛగలవారీ ప్రతిబంధంబు విచారించి విడువఁదగినది. ఈ ప్రతిబంధం బుండఁగానే శ్రవణాదు లెవరు చేయుచున్నారో వానికి ఆ జన్మమందు జ్ఞానంబు రానేరదు. అయితే యీ శ్రవణాదులు వ్యర్థమైపోవునా యనిన; పోవు. మఱి యేమా ననిన; అశ్వమేధాదిక్రతువులు చేసినవారికి ఏ లోకంబుకలదో ఆ లోకంబునకు పోయి ఆలోకమందు బహుభోగంబులు అనుభవించిన తర్వాతను బ్రహ్మనిష్ఠులగర్భమందు పుట్టును. పుట్టిన తర్వాత సంసారాసక్తుఁడై యున్నప్పటికిని పూర్వజన్మవాసనావశంబువలన శ్రవణాదుల యందే అభిరుచి గలిగి తర్వాత తనకు ప్రతిబంధంబులు ఏవైనఁ గలవా యని విచారించి ప్రతిబంధంబులను పోఁగొట్టుటకై శ్రవణాదులుచేసి ఆ శ్రవణాదులచేత జ్ఞానంబు సంపాదించి ముక్తుఁడౌనని శ్రుతిస్మృతిపురాణంబులచేత చెప్పఁబడుచున్నది. ఈ ప్రకారంబుగా ప్రతిబంధంబుల నెవఁడు పోఁగొట్టుకొని శ్రవణాదులుచేసి జ్ఞానంబు సంపాదించుచున్నాఁడో వాఁడు ముక్తుఁడౌనని వేదాంతసిద్ధాంతము.

ఇది షడ్వింశతివర్ణకము.

---

# సప్తవింశతివర్ణకము

## శ్రవణమనననిదిధ్యాసననిరూపణము

శ్రవణమనననిదిధ్యాసనంబులను నిరూపించుచున్నారము. శ్రవణ మనఁగా—సమస్తమైన వేదాంతంబులకును షడ్విధలింగంబులచేతను బ్రహ్మస్వరూపమైన ఆత్మయందు తాత్పర్యమని బుద్ధియొక్కనిశ్చయమే శ్రవణమని చెప్పఁబడును. మననమనఁగా— శ్రుత్యర్థమువిని ఆయర్థంబును యుక్తులచేతను ఏకవాక్యముచేత చింతించుట మనన మని చెప్పఁబడును. నిదిధ్యాసనమనఁగా—విజాతీయములైన కామక్రోధాదులను విడిచి సజాతీయమైన 'అహం బ్రహ్మాస్మి' యనెడి నిరంతరచింతనము నిదిధ్యాసనమని చెప్పఁబడును. వీనికి ప్రయోజనంబెయ్యదియనిన; సర్వదా

శ్రవణంబు చేయుటచేత సకల సంశయంబులును నశించును. మననము అసంభావనలను పోఁగొట్టును. సర్వదా నిదిధ్యాసనము విపరీతభావనంబును బోఁగొట్టును. ప్రతిబంధబాహుళ్యంబు గలవానికి సర్వదా మూఁడునుం జేయవలయు. ప్రతిబంధనివృత్తులైన సూక్ష్మబుద్ధిగలవారికి శ్రవణకాలమందే మనననిదిధ్యాసనంబులు సిద్ధించును. అది యెటువలె ననిన; బుద్ధిశాలియైనవాఁడు గురువులదగ్గర పాఠము చదివేటప్పుడు యుక్తుల చేతను వాక్యార్థాలోచనచేసి అర్థము నేకము చేయును గనుక అదే వానికి మననమాయెను. చిత్తము విషయములయందుఁ బోసీయక శ్రవణమనననిదిధ్యాసనంబులు పలుమాఱును చేయవలెను. ఎవఁడు సూక్ష్మబుద్ధి గలిగి ప్రతిబంధంబులు లేనివాఁడై యున్నాఁడో, వానికి శ్రవణకాలమందే మనననిదిధ్యాసనంబులు సిద్ధించును. ఈ యర్థమందు సంశయంబు లేదు.

ఇది సప్తవింశతివర్ణకము.

---

# అష్టావింశతివర్ణకము

## అసంభావన, విపరీతభావన

అసంభావన, విపరీతభావన లనఁగా; దృష్టాంతపూర్వకంబుగా నిరూపించుచున్నారము. అది యెటువలెననిన; శ్రుతులకు తాత్పర్యంబు నిరూపించునపుడు షడ్విధలింగంబులను నిరూపించుచున్నారము. అది యెటువలెననిన; ఉపక్రమమనియును, ఉపసంహారమనియును, అపూర్వకమనియును, ఫలమనియును, అర్థవాదమనియును, ఉపపత్తియనియును నాఱువిధంబులు. వీనిలో నుపక్రమోపసంహారములు రెండును నొక లింగము. అభ్యాసం బొకలింగము. అపూర్వ మొకలింగము. ఫల మొక లింగము. అర్థవాద మొకలింగము. ఉపపత్తియొకలింగము. ఈయాఱింటి చేతను శ్రుతులయొక్క తాత్పర్యంబు నిర్ణయింపఁబడుచున్నది. కాఁబట్టి వీనికి లింగంబులని పేరు. ఉపక్రమమనఁగా; సృష్టికి ముందు ఈ జగత్తు నామరూపరహితమైన సత్తామాత్రమేయుండెనని ప్రతిపాదించుట. ఉప

సంహారమనఁగా—ఈ తోఁచునట్టి సమస్తజగత్తును ఆ సత్తుయొక్క స్వరూపంబు. 'అదే సత్యము. అదే ఆత్మ' యని ప్రతిపాదించుట. ఈ రెండును అద్వితీయాత్మస్వరూపంబును ప్రతిపాదింపుచున్నవి గనుక యీ రెండునుకూడి ప్రథమలింగము. అభ్యాసమనఁగా; నీవు బ్రహ్మమని తొమ్మిదిప్రకారంబుల నుపదేశించుట. ఆయుపదేశముచేతను నీయొక్క స్వరూపంబునకే అద్వితీయాత్మమును బోధింపుచున్నది గనుక యీ యభ్యాసంబు రెండవలింగము. అపూర్వమనఁగా; అష్టప్రమాణముల లోపల నుపనిషత్ప్రమాణంబులచేత ఆత్మలక్షణంబు తెలియఁగఁబడు చున్నవి, ఇతరప్రమాణంబులచేత నెఱుఁగఁబడలేదనుట. ఈ యపూర్వము ఈ యద్వితీయాత్మయందే సిద్ధించియున్నది గనుక ఇది మూఁడవ లింగము. అద్వితీయాత్మజ్ఞానంబునకు ప్రారబ్ధమెంతపర్యంతంబు నశింప లేదో అంతపర్యంతంబును దేహేంద్రియాదిప్రపంచంబు మిథ్యారూపం బుగాఁ దోఁచుట, ఆ ప్రారబ్ధంబునకు నిశ్శేషనాశ మెప్పుడు వచ్చు చున్నదో, అప్పుడు జగత్తు సర్వాత్మనాతోఁచక అద్వితీయాత్మస్వరూ పంబుగా నుండు ననెడి ప్రతిపాదనంబు ఫలము. ఇది నాలుగవలింగము. అర్థవాదమనఁగా; ఏ వస్తువు విన్నందుచేత వినఁబడని వస్తువు వినఁబడు చున్నదో, యే వస్తువు మననము చేయుటచేత మననము చేయఁబడని వస్తువు మననము చేయఁబడుచున్నదో, యే వస్తువు నెఱుఁగుటచేత నెఱుఁగఁబడని వస్తు వెఱుఁగఁబడుచున్నదో, అది యర్థవాదము. ఈ యర్థంబునకు స్వార్థమందు తాత్పర్యంబు లేదు గనుక అద్వితీయాత్మ స్వరూపమందే తాత్పర్యము. దీనికి అర్థవాదమని పేరు. ఇది పంచమ లింగము. ఉపపత్తి యనఁగా — మృత్తువలనఁ బుట్టిన ఘటశరావాదు లును స్వర్ణంబువలనఁ బుట్టిన కటకమకుటాదులును అయస్సువలనఁ బుట్టిన ఖడ్గాదులును కారణముకన్న పృథక్కుగాఁ దోఁచినప్పటికిని నీ కార్యానలకు ఉచ్చారణంబు మంత్రము వినాగా అర్థము లేదు గనుక కారణవ్యతిరిక్తంబుగా కార్యంబు లేదనెడి యుక్తి ఉపపత్తి యని చెప్పఁ బడును. ప్రసిద్ధంబుగాఁ దోఁచునట్టి జగత్తు పరమాత్మస్వరూపమయిన బ్రహ్మంబు గాన దృష్టాంతస్వరూపమైన యీ జగత్తుకు పరమాత్మకన్న అభిన్నత్వంబు ప్రతిపాదింపుచునుండు ప్రత్యగాత్మకు అద్వితీయత్వం బును సూచింపుచున్నది గనుక ఇది ఆఱవలింగమని చెప్పఁబడును, ఈ

ప్రకారంబుగా షడ్విధలింగంబులచేతను శ్రుతులకు తాత్పర్యము నెవఁడీప్రకారంబు నిర్ణయింపుచున్నాఁడో, వానికి శ్రవణమాత్రముచేతను అద్వితీయాత్మజ్ఞానంబు వచ్చును. సందేహంబు లేదు. ఇది సిద్ధము.

ఇది అష్టావింశతివర్ణకము.

---

# ఏకోనత్రింశద్వర్ణకము

## తత్త్వాదినిరూపణము

తత్త్వంబుల నిరూపించుచున్నారము. తత్త్వంబు లనఁగా—జ్ఞానేంద్రియపంచకమును, కర్మేంద్రియపంచకమును, ప్రాణాదిపంచకమును, శబ్దాదిపంచకమును, మనఆదిచతుష్టయమును ఇవి యన్నియుం గూడి ఇరువదినాలుగు తత్త్వంబు లని చెప్పఁబడును. ఈ చెప్పఁబడిన యిరువదినాల్గుతత్త్వంబులును, అపంచీకృతంబులును, శరీరత్రయమును, అవస్థాత్రయమును, అజ్ఞానమును యివియన్నియుంగూడి ముప్పదియాఱు తత్త్వంబులు. ఇఁకను తొంబదియాఱుతత్త్వంబుల నిరూపణ మెట్లనిన; ఇప్పుడు చెప్పిన ముప్పదియాఱుతత్త్వములును షడ్భావవికారంబులును షట్కోశకంబులును షడూర్ములును అరిషడ్వర్గంబులును జీవత్రయంబులును గుణత్రయంబులును కర్మత్రయంబులును వచనాదానగమనవిసరానందంబులును సంకల్పాధ్యవసాయాభిమానావధారణంబులును వైచిత్ర్యాది చతుష్టయంబులును దిగ్వాతార్కాదిచతుర్దశాధిష్ఠానదేవతలును ఇవి యన్నియుంగూడి తొంబదియాఱుతత్త్వంబులు. ఈ తత్త్వంబులకు విలక్షణుఁడై అసంగుఁడైన సాక్షి నేనని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది ఏకోనత్రింశద్వర్ణకము.

---

# త్రింశద్వర్ణకము

---

జితేంద్రియునిలక్షణనిరూపణము

శ్లో. అజిహ్వష్షండకః పంగురంధో బధిర ఏవ చ,
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిరేతైర్న సంశయః.

అజిహ్వుఁడనఁగా నాలుక లేనివాఁడు అజిహ్వుఁడు కాఁడు. మఱి యెవఁడనగా; ఇది నాకు ప్రియము, ఇది నాకు ప్రియము కాదు అని చెప్పక కర్తృత్వాద్యభిమానరహితుఁడై పెట్టినది భక్షించి అసత్యంబులు పలుకక మితభాషియై యెవఁడున్నాఁడో వాఁడు అజిహ్వుఁడని చెప్పఁబడుచున్నాఁడు. షండుఁడనఁగా; శిశ్నంబు లేనివాఁడు కాఁడు. సద్యోజాతమైన శిశువును పదియాఱేండ్లయువతిని నూఱేండ్లముదిదానిని చూచి ముగ్గురియందును సమచిత్తుఁడై నిర్వికారుఁడై యెవఁడున్నాఁడో వాఁడు షండుఁడని చెప్పఁబడును. పంగువనఁగా; కుంటివాఁడు గాఁడు. మఱియెవఁ డనఁగా భిక్షార్థమై పోవుట, మూత్రపురీషాదులు విడుచుటకై బాహ్యమందు పోవుట, గ్రామాంతరంబునకు పోవలెనని యిచ్ఛపుట్టి యోజనదూరంబుకన్న అధికంబు పోకయుండుట, ఇటువలె నెవఁడున్నాఁడో వాఁడు పంగు వని చెప్పఁబడును. అంధకుఁ డనగా; గ్రుడ్డివాఁడు గాఁడు. మఱి యెవఁ డనఁగా; కన్ను లున్నప్పటికిని సంచరించినప్పటికిని నే సన్యాసియొక్క దృష్టి నాలుగు కాడిమ్రానులు పొడవుగల భూమిని విడిచి దృష్టి యావలికి పోలేదో ఆ సన్యాసి యంధుఁడనీ చెప్పఁబడును. బధిరుఁ డనఁగా; చెవులు వినరాని వాఁడు కాఁడు. మఱి యెవఁ డనఁగా; హితమైన వాక్యంబును, అహితమైన వాక్యంబును మిక్కిలి రమ్యమయిన వాక్యంబును, మిక్కిలి దుఃఖమయిన వాక్యంబును శ్రోత్రంబువలన విన్నప్పటికిని యెవఁడు హితాహితంబులను గ్రహింపకున్నాఁడో, వాఁడు బధిరుఁ డని చెప్పఁబడును. ముగ్ధుఁడనఁగా; మూఢుఁడును సౌందర్యహీనుఁడును కాఁడు. సమస్తవిషయంబులును సన్నిధానమందు వచ్చియున్నప్పటికిని యింద్రియపటుత్వంబుగలవాఁడై విషయంబుల ననుభవింపఁగల సమర్థుఁడై యున్నప్పటికిని నిద్రపోవువాని

వలెనే యెవఁ డున్నాఁడో, వాఁడు ముగ్ధుఁడని చెప్పఁబడును. ఈ యార్థురసు శ్రవణద్వారా జ్ఞానమును సంపాదించి ముక్తు లౌదు రని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది త్రింశద్వర్ణకము.

---

# ఏకత్రింశద్వర్ణకము

## సప్తవిధచైతన్యనిరూపణము

శ్లో. శుద్ధమీశ్వరచైతన్యం జీవచైతన్యమేవ చ,
ప్రమాతా చ ప్రమాణం చ ప్రమేయాశ్చ ఫలం తథా.
ఇతి సప్తవిధం ప్రోక్తం భిద్యతే వ్యవహారతః,
మాయోపాధివినిర్ముక్తో శుద్ధ ఇత్యభిధీయతే.
మాయాసంవర్తితశ్చేశో జీవో విద్యావశ స్తథా,
అంతఃకరణసంబంధః ప్రమాతేత్యభిధీయతే,
తథా తద్వృత్తిసంబంధం ప్రమాణమితి కీర్తితమ్,
అజ్ఞానమపి చైతన్యం ప్రమేయమితి కథ్యతే.
తథాజ్ఞాతశ్చ చైతన్యం ఫలమిత్యభిధీయతే.

ఇందుకు అర్థము :—శుద్ధచైతన్యమనియు, నీశ్వరచైతన్యమనియు, జీవచైతన్యమనియు, ప్రమాతృచైతన్యమనియు, ప్రమాణచైతన్యమనియు, ప్రమేయచైతన్యమనియు, ఫలచైతన్యమనియు వ్యవహారమం దొక్క చైతన్యమే యిటువలె నేడువిధంబులుగాఁ జెప్పఁబడును. ఆ యేడువిధంబులకును భేద మేమి యనఁగా; మాయోపాధిరహితమగునది శుద్ధచైతన్యము. మాయాసహితమైనది ఈశ్వరచైతన్యము. అంతఃకరణప్రతిబింబితము జీవచైతన్యము. ప్రమాత యన సర్వమును నెఱుఁగు సాక్షిమాత్రుఁడు అట్టి సాక్షిచైతన్యము, ప్రమాతృచైతన్యము, ప్రత్యక్షాదిజ్ఞాన కారణమగునది ప్రమాణచైతన్యము. యథార్థముగాఁ దెలియఁదగినది ప్రమేయచైతన్యము, యథార్థజ్ఞానము ప్రమా(ఫల)చైతన్యము, ఒక పరిపూర్ణచైత

న్యమే యిట్లు ఉపాధి సంబంధమువలన సప్తవిధములుగాఁ జెప్పఁబడు చున్నది. ఉపాధినిరసనమువలన నీ భేదము నశించి పరిపూర్ణచైతన్య మొకటియే శేషించును. అట్టి పరిపూర్ణచైతన్యరూపపరమాత్మయే నేను అని యెఱిఁగినవాఁడే ముక్తుఁడు.

ఇది ఏకత్రింశద్వర్ణకము.

---

# ద్వాత్రింశద్వర్ణకము

## పంచభ్రమనిరూపణము

పంచభ్రమలను నిరూపించుచున్నాము :— ప్రత్యగాత్మ వేఱు. పరమాత్మ వేఱు నని యనుకొనుట, ఆత్మయందు ప్రతీయమానమగు కర్తృత్వాదులు వాస్తవముగ ఆత్మవే యని అనుకొనుట, శరీరత్రయ మునకు విలక్షణుఁడగు ఆత్మకు శరీరత్రయముతో సంబంధము కలదని యనుకొనుట, జగత్కారణమగు బ్రహ్మమునకు షడ్భావవికారములు ఉన్నవని అనుకొనుట, కారణము (బ్రహ్మము)కంటె భిన్నమగు కల్పిత ప్రపంచము సత్యమని అనుకొనుట. ఇవి పంచభ్రమ లనఁబడును. ఈ భ్రమలకు నివృత్తి యెట్లన; దర్పణమందలి ముఖప్రతిబింబము కంఠస్థ ముఖముకంటె భిన్నము కాదనియు, శుద్ధమగు స్ఫటికమునకు రక్తకాంతి గల పుష్పాదుల చేరికవలన స్ఫటికమందుఁ దోఁచు రక్తిమ నిజము కాద నియు, ఘటమఠాదులయందుఁగల ఆకాశము, మహాకాశముకంటె భిన్నము కాదనియు, రజ్జువందు భ్రమచేఁ గల్పింపఁబడిన సర్పము మిథ్యయై, కారణ మగు రజ్జుమాత్రమే సత్యమైనటుల జగత్కారణ మగు బ్రహ్మము నిర్వికారియనియు, మనఃకల్పితమగు గంధర్వనగరమువలెనే, భ్రమమూలమగు దృశ్యప్రపంచము సత్యము కాదనియుఁ దెలిసికొనుట వలన నీ పంచభ్రమలు నివర్తించును.

ఇది ద్వాత్రింశద్వర్ణకము.

---

# త్రయస్త్రింశద్వర్ణకము

## ప్రారబ్ధత్రయస్వరూపనిరూపణము

ఇచ్ఛాప్రారబ్ధమనియు, అనిచ్ఛాప్రారబ్ధమనియు, పరేచ్ఛాప్రారబ్ధమనియును ప్రారబ్ధము మూఁడువిధంబులు. ఈ త్రివిధప్రారబ్ధములును వివేకులకు నవివేకులకును సమానమైయుండును. ఉన్నప్పటికిని వివేకియొక్క ప్రారబ్ధంబునకును అవివేకియొక్క ప్రారబ్ధంబునకును భేదంబు గలదు. అది యెటు లనఁగా; అవివేకియొక్క ప్రారబ్ధ మాశ్వీజమాసమందలి మేఘంబువంటిది. ఆ మేఘ మెట్టిదనిన; ఆశ్వీజమాసమందు స్వల్పంబుగా నుండును. ఆ స్వల్పమయిన మేఘంబు సర్వత్ర వ్యాపించి కుంభద్రోణంబుగా వర్షించి పైర్లను మునిఁగి పోవునట్లు చేసి యిండ్లు గోడలు పడునట్లు చేసి ప్రాణులకు అనేకంబులగు ననర్థంబుల నెటుల నేయుచున్నదో అటులే అజ్ఞానికిని స్వల్పంబుగానే యిచ్ఛ పుట్టును. ఆ పుట్టిన యిచ్ఛ ఆ మేఘంబువలెనే సర్వత్రవ్యాపించుకొని పరుల కనేక దుఃఖంబులను చేసి వానికిని ఇహపరలోకసుఖంబులను దొలఁగించి నరకంబును సంపాదించును. వివేకియొక్క ఇచ్ఛ మకరమాసమందలి మేఘంబువంటిది. ఆ మేఘ మెట్టి దనిన; మకరమాసమందు మేఘము సర్వవ్యాపియైయుండును. అట్టుండినను స్వల్పంబుగా వర్షంబు గురిసి సస్యాదులకు నష్టము నేయక ప్రాణులకును అనర్థంబును చేయక తాను నశించిపోవును. అటులే వివేకియొక్క యిచ్ఛయును కర్మవశంబువలన మకరమాసమందలి మేఘంబువలెనే విస్తారంబుగా వ్యాపించియున్నదానివలె నున్నప్పటికిని పుష్కలమైన వివేకంబువలన పరుల నుపద్రవ పెట్టక తనయొక్క పరలోకసౌఖ్యంబునకు హానిని సంపాదింపక దేహధారణమాత్రమందే నిల్చును. ఈ ప్రకారంబున వివేకియొక్క యిచ్ఛాప్రారబ్ధంబునకును అవివేకియొక్క ప్రారబ్ధంబునకును భేదము. ఇప్పుడు ప్రారబ్ధంబును సామాన్యంబుగా నిరూపించితిమి. ఇఁకను విశేషంబుగా నిరూపించుచున్నారము.

అది యెటులనఁగా; లోకమందు వివేకులైనవార లసత్యంబు చేసి చచ్చిపోయినవారలను, దొంగిలించి తలగొట్టఁబడినవారలను, రాజ

స్త్రీలను బట్టి బాడిసెలచేత ఛేదింపఁబడినవారలను జూచి మన మీ కార్యంబులను చేయరాదు. చేసితిమేని మనకు గండంబులు వచ్చునని తద్విషయంబు నెఱిఁగియుండియు నది యంతయు లేక వాండ్రు సమర్థులనియు తాము సమర్థులమనియు నెంచుకొని యా వ్యాపారంబుల యందు ప్రవర్తించి తుదకు తామే తలఁగొట్టఁబడుచున్నారు. ఈ ప్రకారంబున అవివేకియొక్క ప్రారబ్ధంబు. అయినను వివేకులైనవారలు ప్రవృత్తులనియు నస్థిరంబులనియు విచారించి యర్థాసక్తులయిన సంసారు లర్థంబును సంపాదించుటయందును దాని సంరక్షణమందును ఆ యర్థంబు నాశనంబు చేయుటయందును దుఃఖపడుటను చూచి యీ యర్థమందాసక్తి చేయరాదు. చేసితిమేని వారికి దుఃఖము వచ్చినట్లే మనకును దుఃఖము వచ్చునని విచారించి సమస్తవిషయంబులయందును ఆసక్తిని వదలి యదృచ్ఛాలాభ సంతుష్టులై యుందురు. వారలకు శరీరధారణ మాత్రమయిన క్రియలయందును, శౌచాది క్రియలయందును ఇచ్ఛ పుట్టును. అంతేకాని అన్యత్రయిచ్ఛ పుట్టదు. ఆ ప్రకారంబుగా వివేకులయొక్క యిచ్ఛాప్రారబ్ధము, అనిచ్ఛాప్రారబ్ధం బెట్టిది యనిన; కోరక సంప్రాప్తమగునట్టి ప్రారబ్ధము. అది వివేకులకును అవివేకులకును సమానమైయుండును. అది యెట్లు లనిన; తలఁ దాఁకుటయును, కాలు తాఁకుటయును, కన్నీరు ఉఱియుటయు, వానలోఁ దడియుటయు, ఎండచేఁ గొట్టువడుటయు, క్షయాదివ్యాధులును, పిడుగులుపడుటయు, గుడిగోపురప్రాకారమంటపాదులు పడుటయు ఇవి మొదలైనవానిచేత వచ్చిన దుఃఖంబులు. ఎండవలన, వానవలన, అగ్నివలన వచ్చిన సుఖంబులు ఇవి మొదలయిన సుఖంబులును వివేకులకును, అవివేకులకును సమానమైయుండును. వీనియొక్క అనుభవంబులే అనిచ్ఛా ప్రారబ్ధంబు లనిపేరు. పరేచ్ఛాలబ్ధంబును నిరూపించుచున్నారము. ఆ ప్రారబ్ధంబును వివేకులకును, అవివేకులకును సమముగానేయుండును. అది యెట్లనిన; ఒక పురుషుఁడు మౌనియై కూర్చుండియుండఁగా అన్యుఁ డొకఁడు వచ్చి వానికి నమస్కరించి నీవీకార్యంబును చేయవలెనని చాల అడుగుకొనఁగా దాక్షిణ్యంబుచేత చేసి వానివలన వచ్చిన సుఖదుఃఖంబులను అనుభవించుట. ఈయనుభవము వివేకులకు అవివేకులకును పరేచ్ఛా ప్రారబ్ధంబు. ఈ ప్రకారంబుగా ప్రారబ్ధత్రయంబును విచారించి యీ

ప్రారబ్ధత్రయానుభవంబు అహంకారంబునకే కాని అహంకారసాక్షియైన తనకు (ఆత్మకు) లేదని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది త్రయస్త్రింశద్వర్ణకము.

# చతుస్త్రింశద్వర్ణకము

## సంచితప్రారబ్ధాదినిరూపణము

సంచితప్రారబ్ధాగాములును వానికి నాశనంబులును దృష్టాంతపూర్వకంబుగా నిరూపించుచున్నారము. ఆ దృష్టాంత మెయ్యదియనిన; ఒక ప్రాణికి పదిక్షేత్రంబులు గలవు. ఈ పదిక్షేత్రంబులును తానే పైరు పెట్టుకొనును. క్షేత్ర మొకటి వేయితూముల లెక్కను సంవత్సరంబునకు పదివేలతూములు పండును. అందులో వేయితూములు ఇంటిలో గ్రాసంబునకు పట్టును. ఏనూరు తూములు విత్తనము కట్టును. మఱియు నేనూఱుతూములు ధర్మవ్యయము చేయును. వేయితూములు వ్యవసాయంబునకు సెలవుచేయును. వేయితూములు కప్పమునకై అమ్మును. ఈప్రకారంబుగా సెలవు అయినది పోఁగా సంవత్సరంబునకు ఆఱువేల తూముల వడ్లు మిగులును. ఈమిగిలిన ధాన్యంబును పదిలముచేయును. ఈప్రకారంబుగా ప్రతిసంవత్సరంబును మిగిలిన ధాన్యంబును చేర్చిపెట్టి హెచ్చుధర కలిగినప్పుడు అమ్ముదమని యుండును. ఆ ధాన్యంబునకు సంచితంబని పేరు. ఇంటిగ్రాసంబునకు నిలిపిన వేయితూముల ధాన్యంబునకు ప్రారబ్ధమని పేరు. పెద్దపైరు మొలకపైరు ఎన్నుదీసినపైరు పండిన పంట వీనికి ఆగామి యని పేరు. ఇటులుండఁగా నొక సమయమందు కలహంబు ప్రాప్తమయ్యెను ఆ సమయంబునందు పరులు సంచితమైన ధాన్యంబునంతయుఁ గొనిపోయిరి. రాఁబోవు పంటను కొల్లగాండ్రు కొనిపోయిరి. పైరంతయు అశ్వములు మొదలైనవానిచే మేపిరి. అంతట యజమానుఁడు విచారపడినవాఁడై గృహమందున్న పదార్థంబులను దాఁచి వానిని భుజించుచుండెను. ఇట్లుండఁగా బంధువులందఱును గ్రాసమున కేమి చేసెద వని యడిగినచో సంచితంబు బహుదినములుగా

నుండెను. ఆ సంచితంబునంతయు పరరాష్ట్రంబువారు గొనిపోయిరి. రాఁబోవుపంట కొల్లగాండ్రపాలాయెను. పైరంతయు అశ్వంబులు మొదలైనవి మేసిపోయె. గృహంబునందును కొంత పదిలము చేసికొని యుంటిని. దాని భుజించి తీరవలెనని చెప్పెను.

ఇందువలన నేమి చెప్పఁబడినట్లాయెననిన; ఆగామిసంచితంబులకు నాశము చెప్పినట్లాయెను. ప్రారబ్ధంబును భుజియించి తీరవలెనని చెప్పిన ట్లాయెను. ఇటుల దృష్టాంతమందు సంచితప్రారబ్ధాగాములు. ఇటులనే దార్ష్టాంతికమందును సమస్తప్రాణులకును సంచితప్రారబ్ధాగాములను స్పష్టముగా నిరూపించుచున్నారము. అది యెటు లనఁగా; లోకమందు అనాదియైన జీవుఁడు పుణ్యపాపకర్మంబులను చేసికొనుచువచ్చును. ఇట్లు చేసికొనుచు రాఁగా నొకదినమందు చేసిన పుణ్యపాపకర్మమే బహు జన్మంబులకు కారణమైయుండును. అటువలె జన్మావధి చేసికొనుచు నుండును. ఆయా పుణ్యపాపకర్మంబులన్నియు రాసులురాసులుగా కూడును. వీనికి సంచితమని పేరు. అటుతరువాత మరణంబును పొందును. మరణంబు పొందినతరువాత తిరుగా జన్మమెత్తు నిమిత్తమై ఆ సంచితం బులో కొంత గ్రహించుకొనును. ఆ సంగ్రహంబు కర్మంబు భావిశరీ రంబునకు కారణంబులైన పంచీకృతపంచమహాభూతంబుల శరీరాకారం బుగా పరిణమింపఁజేసి యా శరీరంబుచేత కొన్నికర్మంబులనుచేసి యా కర్మములవలనఁ గొన్ని సుఖదుఃఖంబుల ననుభవించును. దీనికి ప్రారబ్ధ మని పేరు. ఈ ప్రారబ్ధంబును అనుభవించుకొనుచు మరణపర్యంతం బును చేసిన పుణ్యపాపంబులకు నాగామి యని పేరు. ఇవియు నాసంచి తంబుతోఁ గూడును. ఈ ప్రకారంబుగా జీవుఁడు అనాదిగా కర్మంబులఁ జేయుచురాఁగా సంచితము వృద్ధిఁబొందుచువచ్చును. కాఁబట్టి జీవుల యొక్క జన్మంబులకు అవధి లేదు. అయితే యీజన్మంబుల కవధి యెప్పుడు వచ్చు ననఁగా; ఈ ప్రకారంబుగా కర్మంబులు చేయుచురాఁగా నొకజన్మమం దొకపుణ్యకర్మపరిపాకమువలన దీనికి సంసారంబురాకుండఁ జేసుకోవలెనని వివేకంబు పుట్టును. ఇది యెటువలె ననఁగా; తనకు కామ్యకర్మంబులను జేయుటవలన చిత్తశుద్ధి రానేరదు. సంసారంబు పోనేరదని విచారించి కామ్యకర్మంబులను విడిచి విహితములైన కర్మం

బుల నీశ్వరార్పణంబుగాఁ జేయవలయుననను వివేకంబు పుట్టును. ఆ కర్మంబులవలన భక్తి కలుగును. భక్తిద్వారా చిత్తశుద్ధి జనించును. చిత్తశుద్ధిద్వారా సద్గురులాభమగును. పిదప సద్గురువులయొద్ద నుండు కొని శుశ్రూషచేయుచు శ్రవణమననిదిధ్యాసంబులనెల్లఁ జేయుచుండును. ఈప్రకారంబుగాఁ జేసి జ్ఞానంబు సంపాదించును. అప్పుడు జ్ఞానాగ్ని చేత నజ్ఞానంబు దగ్ధమై పోవును. అజ్ఞాన మెప్పుడు పోవునో అప్పుడే అజ్ఞానకార్యంబులైన సంచితకర్మంబులన్నియు దగ్ధమైపోవును. జ్ఞానంబు వచ్చిన తర్వాతను చేయఁబడిన పుణ్యపాపంబులు అకర్తయైన వీనిని స్పృశింపలేవు. అయితే ఆ పుణ్యపాపంబులకు గతి యేది యనిన; ఈ జ్ఞానిని నెవఁడు భూషించుచున్నాఁడో, వాఁడు పుణ్యమును కొనిపోవును. ఎవఁడు దూషించుచున్నాఁడో వాఁడు పాపంబును గొనిపోవును. ప్రారబ్ధంబు భుజించితీరవలెను.

ఈయర్థమందు సమ్మతివచనంబులు :—

శ్లో. ప్రారబ్ధం భోగతో నశ్యే త్తత్త్వజ్ఞానేన సంచితమ్,
ఆగామి ద్వివిధం కర్మ తద్ద్వేషి ప్రియవాదినః.

ఈప్రకారంబుగా సంచితప్రారబ్ధాగాములను కూలంకషంబుగా విచారించి యీ సంచితప్రారబ్ధాగాములు అహంకారంబునకే కాని అహంకారసాక్షియైన తనకు లేవని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది చతుస్త్రింశద్వర్ణకము

---

# పంచత్రింశద్వర్ణకము

## పంచప్రళయములయొక్క మననము

ప్రళయస్వరూప మెయ్యది యనిన; నిత్యప్రళయమనియు, అవాంతరప్రళయ మనియు, దైనందినప్రళయ మనియు, బ్రహ్మప్రళయ మనియు, ఆత్యంతికప్రళయమనియు అయిదువిధంబులు. వీనిలోపల నిత్యప్రళయ మనఁగా; సమస్తప్రాణులయొక్క సుషుప్తి నిత్యప్రళయము. అవాంతరప్రళయ మనఁగా; కృతత్రేతాద్వాపరయుగములును,

ఆయా మనువుల యాధిపత్యము అమరుపర్యంతంబును అవాంతర ప్రళయ మని చెప్పఁబడును. కాఁబట్టి బ్రహ్మదేవునియొక్క పగటియందు పదు నాలుగవాంతర ప్రళయములు. వీనికి నైమిత్తిక ప్రళయమనియును, మన్వం తర ప్రళయమనియును రెండుపేళ్లు. యుగ ప్రళయము వీనిలో నంతర్భూ తము. దైనందిన ప్రళయమనఁగా; బ్రహ్మదేవునియొక్క సుషుప్తి దైనందిన ప్రళయము. బ్రహ్మప్రళయ మనఁగా, బ్రహ్మదేవునియొక్క నాశావస్థ. ఆ యవస్థయందు ఆకాశాదిపంచభూతములును సర్వాత్మనా లేవు. అజ్ఞా నంబుమాత్రమే మహాప్రళయమైయుండును. దానికి ప్రకృతిప్రళయ మనియును, మహాసుషుప్తి యనియును, ఆత్యంతిక ప్రళయ మనియును మూఁడుపేళ్లు. ఆత్యంతిక ప్రళయమనఁగా; ముక్తి. ఆ యవస్థయందు సర్వా త్మనా జ్ఞానంబు లేదు. ఈ ప్రకారంబుగా పంచ ప్రళయంబులును అన్యో న్యవ్యావృత్తంబులై యున్నవి గనుక అసత్తై పోయెను. ఈ ప్రళయంబుల కాధారుఁడై యీ ప్రళయంబులయం దనుస్యూతుఁడై అసంగుఁడై అసంసారియైన ఆత్మ నేనని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు ముక్తుఁ డని వేదాంతసిద్ధాంతము.

ఇది పంచత్రింశద్వర్ణకము.

---

# షట్త్రింశద్వర్ణకము

## ముక్తిపంచకనిరూపణము

పంచవిధంబులైన ముక్తులను నిరూపించుచున్నారము :—అది యెటువలెననిన; సాలోక్యమనియును, సారూప్యమనియును, సామీప్య మనియును, సార్ష్టికమనియును, కైవల్యమనియును అయిదువిధంబులు. సామీప్యమనఁగా; ఉపాసనవలన బ్రహ్మలోకంబునకు పోయి బ్రహ్మ దేవునియొక్క సముఖంబు లేకయే ఒక ప్రదేశమందుండి సమస్తభోగం బులు ననుభవించుట సామీప్యముక్తి. సారూప్యమనఁగా; బ్రహ్మదేవునికి నేరూపంబు కలదో ఆ రూపంబును పొంది సమస్తభోగంబుల ననుభ వించుట సారూప్యముక్తి. సార్ష్టికమనఁగా; బ్రహ్మదేవుని కేయైశ్వర్యంబు

గలదో అట్టి యైశ్వర్యంబు గలిగి సమస్తభోగంబుల ననుభవించుట సార్ష్టికముక్తి. సాలోక్యమనఁగా; బ్రహ్మదేవునియొక్క సమీపమందుఁ జేరి, ఆయన యెటువంటిభోగంబు లనుభవించునో అట్టి భోగంబులను బొందుచు నా బ్రహ్మదేవుని యెల్లప్పుడును జూచుచుండుట సాలోక్యముక్తి. ఈ నలుగురికిని ముక్తి యేకరూపమైయున్నప్పటికిని ఉపాసనాతారతమ్యంబువలన నవాంతరఫలతారతమ్యంబు కలదు. కైవల్యమనఁగా; ముముక్షువులైనవారు శమదమాదులతోఁ గూడుకొని గురువులయొద్ద శ్రవణమననాదులను చేసి జ్ఞానంబును సంపాదించి సచ్చిదానందస్వరూపుఁడైన యాత్మ నేనని యెఱిఁగి తర్వాత స్వరూపమాత్రంబు నుండుట కైవల్యము. ఇది విచారంబువలనఁ బుట్టిన జ్ఞానంబుచేతనే రావలెను. కర్మోపాసనాయోగంబులచేత వచ్చునట్టిది కాదు. కనుక బ్రహ్మలోకమున నుండెడివారును, బ్రహ్మదేవునియొద్ద విచారంబు చేసి జ్ఞానంబు సంపాదించి బ్రహ్మదేవునితోడ ముక్తి బొందుదురు. ఇందువలన నేను చెప్పఁబడియె ననిన; సమస్తప్రాణులకును జ్ఞానంబుచేతనే ముక్తి. కర్మోపాసనాయోగంబులచేతను ముక్తి లేదనుట చెప్పఁబడెను.

ఇది షట్త్రింశద్వర్ణకము.

---

# సప్తత్రింశద్వర్ణకము

## బ్రహ్మవిద్వరవరీయవరిష్ఠలక్షణనిరూపణము

లోకమందు జ్ఞానియైనవాఁడు సదా సమాధినిష్ఠుఁడై యుండవలయు ననియును, యోగంబు లేకయే వచ్చిన జ్ఞానంబు దృఢంబుగాదనియును, వ్యవహారంబుతోఁ గూడుకొనియుండెడివారికిఁ గూడదనియును, వివేకులైనవారిలో కొందఱికి నేకవిధంబులైన సంశయంబులున్నవి. వారియొక్క సంశయంబును పోఁగొట్టుటకొఱకై బ్రహ్మవిద్వరవరీయవరిష్ఠులస్థితిప్రకారము చెప్పుచున్నారము.

౧. బ్రహ్మవేత్తయైనవాఁడు తనకు కాలత్రయాబాధ్యత్వంబును ప్రపంచంబునకు స్వప్నతుల్యత్వంబును సర్వదా చూచుచు యజ్ఞాది

కర్మంబులును అతిథిపూజనంబును సర్వధర్మంబు లైన సంధ్యావందనాది క్రియలును సర్వదా చేసికొనుచు నున్నప్పటికిని నేను సాక్షిని, ఏ కర్మమును చేసినవాఁడను కాను, అహంకారాదులు తమతమ విషయంబుల యందు ప్రవర్తించుచున్నవి. నేను అసంగుఁడను, నాకు సాక్షిత్వము కల్పితమని నిశ్చయించుకొని సకల వ్యవహారంబులును జేయుచుండును. వానికి బ్రహ్మవేత్త యని పేరు.

౨. బ్రహ్మవిద్వరుని యొక్క స్థితి ప్రకారంబును జెప్పెదము :— బ్రహ్మవిద్వరుఁ డయినవాఁడు ఈ బాహ్యవ్యాపారంబులన్నియు దుఃఖదములని యెంచి వ్యాపారంబులవలనఁ దనకు ప్రయోజన మేమియును లేదని విచారించి యీవ్యాపారమం దంతర్ముఖుండయి నిద్రపోవువాని వలె నుండి కాలత్రయమందును ప్రపంచంబు తోఁచినప్పటికిని అదిమిథ్య. నాకు సాక్షిత్వము కల్పితమని నిశ్చయించుకొని ముముక్షువులైనవారల కుపదేశము చేయుచు, అనివార్యములైన శౌచాన్నపానాదిక్రియల యందును మాత్రము ప్రవృత్తిగలవాఁడై యున్నప్పటికిని సకల వ్యవహారంబులను అహంకారము చేసికొని పోవుచున్నది. తానొక కర్మమును చేసినవాఁడు కాఁడని నిశ్చయించుకొని బాహ్యవ్యాపారంబులను విడిచిపెట్టి సర్వదా యేకాంతనిష్ఠుఁడయి యుండును. వానికి వరుఁడని పేరు.

3. వరీయుని యొక్క స్థితిప్రకారంబు జెప్పెదము:-వరీయుఁడైన వాఁడు బాహ్యప్రపంచంబంతయు దుఃఖప్రదమనియు, మిథ్యయనియు, నిశ్చయించి బాహ్యంబును విడిచిపెట్టి సర్వదా నిదిధ్యాసనపరుఁడై యుండి పరులచేత ప్రేరేపింపఁబడినవాఁడయి అన్నపానాదిక్రియలను చేసినప్పటికిని సకలవ్యవహారంబులును అహంకారముచేత చేయఁబడు చున్నవనియు తానొకవ్యాపారంబును చేయలేదనియు, తాను సాక్షి ననియును, ఆసాక్షిత్వంబును గల్పితమే యనియు, తాను అసంగుఁడు, దేనితోను తనకు సంబంధంబు లేదనియును నిశ్చయించుకొని సకలసంశయరహితుఁడయి సర్వదా నిదిధ్యాసనపరుఁడయియే యుండును. వానికి వరీయుఁడని పేరు.

౪ వరిష్ఠుని యొక్క స్థితిప్రకారంబును జెప్పెదము:—వరిష్ఠుఁడైన వాఁడు బాహ్యము సమస్తంబును మిథ్యయని తలఁచి సకలసంశయరహి

తుఁడై సర్వదా నిదిధ్యాసనపరుఁడై నిర్వికల్పసమాధినిష్ఠుఁడై అంతర వ్యాపారంబును బాహ్యవ్యాపారంబును మఱచి స్వరూపానందమగ్న మయినచిత్తంబు గలవాఁడై యుండును. వానికి స్వతః వ్యుత్థానంబును, పరతః వ్యుత్థానంబును లేదు. వానికి అన్నపానాదిక్రియలు సర్వాత్మనా లేవు. అనేక పుణ్యకర్మపరిపాకంబువలన వానికి సమాధి సిద్ధించెను గనుక వరిష్ఠుఁడని పేరు. ఈ నలుగురికిని ముక్తి సమానమే. అయితే వీరిటువలె నున్నందుకు ప్రయోజన మేమి యనిన; కర్మంబు నానావిధంబులు గనుక దృష్టాంతసౌఖ్యమే ప్రయోజనము. జ్ఞానులైనవారలందఱును ఈ ప్రకారంబుగానుండవలెనని చెప్పఁగూడదు. ఇందుకు ప్రమాణ మేమి యనిన; జనకుఁడు నిస్సంగుఁడై రాజ్యంబు చేసె ననియు, జడభరతుం డసంగుండై యుండెననియును, శ్రీశుకు లుపనయనాత్పూర్వమే సంసారమును త్యజించి యోగియై, వెడలిపోయి రనియును, దూర్వాసులు, తపోనిధియయ్యును వాసనారహితుఁడు కానందున కొందఱిని శపించి, కొందఱి ననుగ్రహించుచు నుండె ననియు స్మృతీతిహాసపురాణాదులు చెప్పుచున్నవి. కర్మంబు నానావిధంబులు గనుక జ్ఞానులందఱు నొకతీరుననే యుండగనుటయందు యీ జనకాదులును ప్రమాణము. వివేకులయినవారు 'జ్ఞానులు ఇటువలె నున్నారు. అటువలె నున్నారు' అని సందేహపడవలసినది లేదు. వారియొక్క కర్మంబు ఎటువలె నుండునో అటువలెనే యుందురు. సందేహంబు లేదు. ఇది సిద్ధము.

ఇది సప్తత్రింశద్వర్ణకము.

---

# అష్టత్రింశద్వర్ణకము

## సప్తావస్థలనిరూపణము

లోకమందు కొందఱు శాస్త్రజ్ఞులు వేదాంతవాక్యంబులు పరోక్షజనకంబు లనియు నపరోక్షజనకంబులు గావనియు సర్వదా అపరోక్షుఁడగు ఆత్మ పరోక్షాపరోక్షంబులకు విషయుఁడు కాఁడనియు స్వయంప్రకాశుఁడైన ఆత్మకు జ్ఞానాజ్ఞానయుక్తత్వము కూడదనియు జెప్పుట

వలన నామాటలను విని యనేకులు భ్రమ నొందుచున్నారు. కాబట్టి యట్టిభ్రమ నివారించుటకై యాత్మయందు సప్తావస్థలను దృష్టాంతపూర్వకముగ నిరూపించుచున్నారము. అది యెట్లనిన; లోకమందు 'పరమ జీయ'రని యొకసన్యాసి కలఁడు. అతని కనేకులు శిష్యులు గలరు. ఆశిష్యులలో పదిమందిని బిలిచి యొకకార్యంబునకుఁ బంపెను. ఆపదుగురు సాకార్యార్థంబుగ నరుగునప్పుడు మార్గమందొక యేఱు ప్రవహించుచుండఁగా వారందఱును వరుసగా నాయేరు దాఁటి యావలిగట్టు చేరిరి. అప్పుడు వారిలో ముఖ్యుఁడయినవాఁడు తనతోడవచ్చినవా రందఱును దరిఁ జేరిరో లేక నదిలోఁ గొట్టుకొనిపోయిరో యను సంశయంబున నందఱిని లెక్కపెట్టెడివాఁడు. తొమ్మిదిమంది యందే చిత్తము నిలిపి అజ్ఞానము చేత గణనకర్తయైన తన్ను పదియవవాఁడని యెఱుఁగకపోయెను. అదియె అజ్ఞానంబు. ఆవరణము లెట్టివనిన; సదావరణమనియు, అసదావరణమనియు రెండువిధంబులు. పదియవవాఁడు తన్నుఁ దానెఱుఁగక పదియవవాఁడుండినచో కనఁబడఁడా. కాఁబట్టి దశముఁడు లేఁడని పలుకుచున్నాఁడు. ఈ వ్యవహారంబునకుఁ గారణమెయ్యదియో అదియె అజ్ఞానకార్యమైన యావరణద్వయ మనఁబడును. ఆ దశముఁడు లేఁడు. నదియందు మునిఁగిపోయెనని నిశ్చయించి దుఃఖించె గనుక అది యజ్ఞానకార్యమైన విక్షేపము. ఆ దశముఁడు దుఃఖించుచుండఁగా ఆప్తుఁడైనవాఁడువచ్చి యెందుకు రోదనము సేసెదవు. దశముఁడు చచ్చిపోలేదు ఉన్నాఁడని చెప్పఁగా వాఁడామాట విని శాస్త్రముచేత స్వర్గాదుల నెఱిఁగినట్లు దశముని పరోక్షంబుగ నెఱిఁగెను. ఇది పరోక్షజ్ఞానము. ఆదశముని యాభాసావరణంబు నివర్తకమైన యపరోక్షజ్ఞానమెయ్యది యనిన; ఆప్తునిమాటలు విని యేడ్పుమానిన పదియవవాఁడు దశముఁ డెక్కడ నని పిలిచి పలుకకున్నందున ఆప్తునిఁ జూచి పదియవవాఁ డెక్కడ నని యడిగి వానివలన దశముఁడు తానగుట దెలిసికొని సందేహమును వదలి నా మనస్సుచేతనే భ్రమను బొందితిని; కాలత్రయమందును నేనే పదియవవాఁడ నని తన్ను అపరోక్షజ్ఞానంబుగా నెఱిఁగెను. తరువాత రోదనంబును విడిచిపెట్టి సంతోషించెను.

ఈప్రకారముగానే చిదాభాసుఁడు సంసారమం దాసక్తిగలవాఁడై యొకానొకప్పుడు తనకు స్వరూపభూతుఁడును స్వప్రకాశుఁడు

నగు కూటస్థుని నెఱుఁగ ననుటయే అజ్ఞానము. ఒకఁడా చిదాభాసుని బిలిచి కూటస్థు నెఱుఁగుదువా యని యడుగుచుండఁగా కూటస్థుఁ డని యొకఁడున్నాఁడా? ఉంటే తోఁచఁడా? లేఁడు అని పలుకుటయే అజ్ఞాన కార్యమగు నావరణద్వయము. నేను కర్తను భోక్తను సుఖిని దుఃఖిని మనుష్యుఁడను బ్రాహ్మణుఁడను అనెడి యారూఢమునకు కారణమై దేహ ద్వయంబుతోఁడఁ గూడుకొనియుండెడు చిదాభాసుఁడు విక్షేపుఁ డనఁ బడును. ఈచిదాభాసుఁడు గురూపదేశంబుచే మొదట కూటస్థుఁడొకఁడు కలఁడని పరోక్షంబుగ నెఱుఁగుట పరోక్షజ్ఞానంబు. చిదాభాసుఁడు గురువులదగ్గర శ్రవణాదులను చేసి జ్ఞానంబును సంపాదించి తరువాత నాకూటస్థుఁడు నేను అని యెఱుఁగుట యపరోక్షజ్ఞానము. అనర్థనివృత్తి యెటులనిన; ఈ చిదాభాసుఁడు నిర్వికారుఁడు నసంగుఁడు నైన యాత్మ నే నని యెఱిఁగిన తర్వాత కర్తృత్వాదులు శోకజాతంబులని యెఱుఁ గుట యనర్థనివృత్తి. ఆనందావాప్తియనఁగా; సకలకర్తవ్యజాతంబును పొందఁదగినఫలజాతంబంతయును తనవలననే కల్పితంబులై పొందఁబడు నని సంతోషించుటయె ఆనందావాప్తి. ఇప్పుడు నిరూపింపఁబడిన అజ్ఞాన, ఆవరణ, విక్షేప, పరోక్ష, అపరోక్ష, అనర్థనివృత్తి, ఆనందావాప్తు లనెడి సప్తావస్థలయందును మొదటి మూఁడవస్థలు బంధహేతువులు. తక్కిన నాలుగవస్థలును మోక్షహేతువులు. ఈ ప్రకారంబుగా విచా రించి యీ యవస్థ లేడును ఆరోపితమయిన అహంకారంబునకే కాని యహంకారసాక్షియై నిర్వికారుఁడైన తనకు లేవని యెవఁ డెఱుఁగు చున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

ఇది అష్టత్రింశద్వర్ణకము.

---

# ఏకోనచత్వారింశద్వర్ణకము

## తాదాత్మ్యనిరూపణము

తాదాత్మ్యము సహజజన్యతాదాత్మ్యమనియును, కర్మజన్య తాదాత్మ్యమనియును, భ్రాంతిజన్యతాదాత్మ్యమనియును మూఁడు

విధంబులై యుండును చిత్తు అహంకారమందు ప్రతిబింబించి యా ప్రతిబింబంబు నయ్యహంకారంబును గూడి తప్తాయఃపిండంబువలె నేకమై చిత్తువలెనే తోఁచును. ఆ చిత్ప్రతిబింబంబును గూడుకొనియుండెడి అహంకారమునకు ఆ ప్రతిబింబంబుతోడి తాదాత్మ్యము సహజజన్య తాదాత్మ్యమనఁబడును. అది యెట్లనఁగా; పుట్టునపుడు రెండునుగూడ పుట్టినవి గనుక సహజజన్యతాదాత్మ్యమని పేరు వచ్చెను. చిత్ప్రతిబింబమునుగూడి చిత్తువలెఁ దోఁచునట్టి యహంకారంబు స్థూలదేహంబుతో సంబంధమైనప్పు డాయహంకారంబునకు స్థూలశరీరంబుతోడ తాదాత్మ్యము కర్మజన్యతాదాత్మ్యమనఁబడును. జాగ్రద్భోగమయిన కర్మంబు జనించినప్పుడు జనించి ఆ కర్మంబు నశించెనేని తానును నశించును గనుక దీనికి కర్మజన్యతాదాత్మ్యమని పేరు వచ్చెను. కర్మంబు గలిగిన, తాదాత్మ్యంబును గలుగును. కర్మంబు లేకున్న, తాదాత్మ్యంబును లేదనుటకు జాగ్రత్స్వప్నంబులే దృష్టాంతము. ఈ తాదాత్మ్యమువలన స్థూలదేహంబు అచేతనంబయ్యు చేతనంబువలె నయ్యెను. నేను బ్రాహ్మణుఁడను, క్షత్రియుఁడను, వైశ్యుఁడను, శూద్రుఁడను, బ్రహ్మచారిని, గృహస్థుఁడను, వానప్రస్థుఁడను, సన్యాసిని అను చిత్తవృత్తులతోఁగూడుకొనియుండెడి అహంశబ్దార్థమైన సాక్షితోడి తాదాత్మ్యము భ్రాంతిజన్యతాదాత్మ్య మనఁబడును. సర్వాధిష్ఠానమైన ఆత్మస్వరూపము తానని యెఱుఁగనందువలన వచ్చినది గనుక దీనికి భ్రాంతిజన్యతాదాత్మ్యమని పేరు వచ్చెను. ఈ ప్రకారంబుగా సహజన్యతాదాత్మ్యంబు, కర్మజన్యతాదాత్మ్యంబు, భ్రాంతిజన్యతాదాత్మ్యంబు నని మూఁడుతాదాత్మ్యంబులు చెప్పఁబడెనుగదా! ఈ తాదాత్మ్యత్రయంబునకు నివృత్తి యెప్పుడనిన; సంబంధమైనచిచ్ఛాయ అహంకారమై యెంతపర్యంతంబుండునో అంతపర్యంతంబును సహజతాదాత్మ్యంబునకు నివృత్తి రానేరదు. ఆ యహంకార మెప్పుడు నశించునో, అప్పుడే సహజతాదాత్మ్యంబునకు నివృత్తి యని తెలుసుకోవలసినది. ప్రతినిత్యమును కర్మప్రదమయిన కర్మము సుషుప్తికాలమందు నాశము గలుగుచుండఁగా ఆ కర్మజన్య తాదాత్మ్యంబునకు నాశమని కనుఁగొనవలసినది. ఇది సర్వానుభవ సిద్ధము. ఈ తాదాత్మ్యంబునకు విదేహకైవల్యంబునందు ఆత్యంతిక నాశము భ్రాంతిజన్యతాదాత్మ్యము నేను బ్రహ్మమనెడి జ్ఞానము పుట్టి

నప్పుడు నశించును. విద్యారణ్యస్వాములవారు "ఉద్ధృత్యవివేకమందు" ఈచొప్పుననే నిరూపించినారు. మేము ఎక్కడెక్కడ నేవేని నిరూపించియున్నారమో, అవియన్నియు శాస్త్రంబులయందు నిరూపించియుండునవి యని తెలుసుకోఁదగినది. ఈ యర్థమందు సంశయము లేదు గనుక నెవఁడు ఈ తాదాత్మ్యత్రయంబును విచారించి యిది యహంకారంబునకేగాని అహంకారసాక్షియు, నిర్వికారుఁడు, నసంగుఁడు నైన తనకు ఆత్మకులేదని యెఱుఁగుచున్నాఁడో, వాఁడే ముక్తుఁడని వేదాంత శాస్త్రసిద్ధాంతము.

---

# చత్వారింశద్వర్ణకము

## జీవేశ్వరస్వరూపనిరూపణము

జీవుఁడనఁగా అంతఃకరణంబును, అంతఃకరణాధిష్ఠానంబును, అంతఃకరణమందు ప్రతిబింబించిన చైతన్యంబును నీమూఁడునుగూడి జీవుఁడని చెప్పఁబడును. అటుల చెప్పవలసినదేమి ? కేవలమైన అంతఃకరణమునకు జీవత్వము చెప్పరాదమనిన ; ఘటమునకు జీవత్వంబు రావలెను. దానికి జీవత్వము లేదు. గనుక కేవలాంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పఁగూడదు. అటుల కాదు. ఘటము స్వచ్ఛద్రవ్యము కాదు గనుకను, అంతఃకరణము స్వచ్ఛద్రవ్యము గనుకను, అంతఃకరణమునకు జీవత్వముచే దర్పణాదులు స్వచ్ఛద్రవ్యంబులు గనుక వానికి జీవత్వంబు రావలయును. వానికి జీవత్వంబు రాఁగూడదు గనుక కేవలాంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పఁగూడదు. దర్పణాదులు బాహ్యపదార్థంబులు. అంతఃకరణంబు అంతరంబు గనుక అంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పరాద మనిన ; ఇంద్రియాదులకును అంతరంబు లేదు గనుక వానికిని జీవత్వంబు రావలయును. వానికిని జీవత్వంబు కూడదు గనుక అంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పఁగూడదు. ఇంతే కాదు. అంతఃకరణము ఇంద్రియాదులకన్న అంతరంబు గనుక దానికి జీవత్వంబు చెప్పిన

మనిన; ఇంద్రియాదులు అజ్ఞానంబు. ఆ అజ్ఞానంబు అంతఃకరణంబున కన్న అంతరంబు గనుక దానికి జీవత్వంబు కావలయును. దానికి జీవత్వంబు చెప్పఁగూడదు. ఇంతమాత్రమే కాదు. జీవుఁడు చేతనుఁడు గనుకను, అచేతనమైన అంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పఁగూడదు.

అయితే కేవల ప్రతిబింబంబునకు జీవత్వంబు చెప్పాద మనిన; అంతఃకరణము లేక ప్రతిబింబంబు లేదు గనుక కేవల ప్రతిబింబమునకు జీవత్వము చెప్పఁగూడదు. అయితే ప్రతిబింబముకొఱకు అంతఃకరణము నంగీకరించి కేవల ప్రతిబింబంబునకు జీవత్వంబు చెప్పాదమనిన; ప్రతిబింబంబునకు స్వయంవికారంబు గలిగియున్నను, కర్తృత్వాదివికారము లేదు గనుక కేవల ప్రతిబింబంబునకు జీవత్వంబు చెప్పఁగూడదు. అయితే అధిష్ఠానచైతన్యమునకు జీవత్వము చెప్పాద మనిన; ఆ చైతన్యంబు నిర్వికారంబు గనుక వికారస్వరూపమైన జీవత్వ మా యధిష్ఠానచైతన్యంబునకుఁ గూడదు. అయితే అంతఃకరణమును ప్రతిబింబమును గూడి జీవుఁడని చెప్పాదమనిన; ఇవి రెండును కల్పితంబులు గనుక అటువలె చెప్పితే జీవునికి నిత్యత్వము సిద్ధింపదు. అందువలన ముక్తుఁడై యుండేవాఁ డెవఁడును లేకపోవుచున్నాఁడు. కాఁబట్టి అంతఃకరణ ప్రతిబింబములు రెండును గూడి జీవుఁడని చెప్పఁగూడదు. అధిష్ఠానచైతన్యంబును ప్రతిబింబచైతన్యంబునుఁగూడి జీవుఁడని చెప్పాదమనిన; కేవలచైతన్యంబుమాత్రము నిర్వికారము గనుక ఆ బింబప్రతిబింబచైతన్యంబులకు కర్తృత్వభోక్తృత్వాదివికారలక్షణమైన జీవత్వము చెప్పఁగూడదు. అయితే అధిష్ఠానచైతన్యంబును అంతఃకరణంబును గూడి జీవుఁడని చెప్పాద మనిన; దర్పణంబును దర్పణాధిష్ఠానచైతన్యంబును గూడి జీవుఁడు కావలెను. వాటికి జీవత్వముకూడదు గనుక అధిష్ఠానచైతన్యాంతఃకరణములకు జీవత్వము చెప్పఁగూడదు. కాఁబట్టి అంతఃకరణప్రతిబింబచైతన్యములు గూడి జీవుఁడని చెప్పవలెను.

మఱియును జీవత్వంబునకు ఇంతమాత్రము చాలదు. కర్తృత్వభోక్తృత్వాదివిశిష్టత్వంబు జీవత్వము గాన కర్తృత్వభోక్తృత్వాదులు సిద్ధించుటకు అంతఃకరణముతోడం గూడిన సూక్ష్మశరీరము జీవత్వము కావలెను. ఇంతే కాదు. సూక్ష్మశరీరమును స్థూలశరీరమును విడచి

యుండదు గనుక అయా గోళకము వినాగా నా యింద్రియ గ్రహణము కూడదు గనుకను బ్రాహ్మణత్వాద్యభిమానము లేక కర్తృత్వముకూడదు గనుకను స్థూలశరీరంబుసంగావలయును అసంగుండైన ఆత్మకు అజ్ఞానము లేదు. అజ్ఞానంబు లేక శరీరంబు రాదు గనుక అజ్ఞానమును అధిష్ఠాన చైతన్యంబును ప్రతిబింబచైతన్యంబును అంతఃకరణంబును శరీరత్రయంబును వీటియందలి అధ్యాసయునుంగూడి జీవుడని చెప్పబడును.

## ఈశ్వరునియొక్క స్వరూపంబు నిరూపించుచున్నారము

మాయయును, మాయాధిష్ఠానచైతన్యంబును, మాయాప్రతిబింబ చైతన్యంబునుం గూడి యీశ్వరుడని చెప్పబడును. ఇటుల చెప్ప నేల? కేవలమైన మాయకు నీశ్వరత్వము చెప్పరాదమనిన; ఆకాశంబునకును ఈశ్వరత్వము చెప్పవలసివచ్చును. దానికి నీశ్వరత్వము చెప్ప కూడదు గనుక కేవలమైన మాయకు ఈశ్వరత్వము చెప్పఁగూడదు. ఆకాశము ఉత్పత్తిమత్తు గనుక ఆకాశమునకు నీశ్వరత్వము కూడకపోయినను అనాదియైయుండునట్టి మాయకు నీశ్వరత్వంబు చెప్పఁగూడదా యనిన; అత్యంతాభావంబునకు నీశ్వరత్వంబు రావలెను. దానికి నీశ్వరత్వము చెప్పఁగూడదు. ఆ భావము భావపదార్థంబు కాదు గావున మాయ అభావపదార్థము గనుక దానికి నీశ్వరత్వము చెప్పఁగూడదు. మాయ అనిర్వచనీయము. దానికి నీశ్వరత్వంబు చెప్పెదమనిన; అనిర్వచనీయములైన శుక్తిరజతాదులకును నీశ్వరత్వంబు రావలెను. వానికి నీశ్వరత్వము కూడదు గనుక మాయకు నీశ్వరత్వము చెప్పఁగూడదు. ఈశ్వరుఁడు చేతనుఁడు. మాయ యచేతనము. కాఁబట్టి అచేతనమైన మాయకు నీశ్వరత్వము చెప్పఁగూడదు. కేవలప్రతిబింబమునకు నీశ్వరత్వము చెప్పెదమనిన; మాయ లేకనే ప్రతిబింబము లేదు గనుక వానికి నీశ్వరత్వము చెప్పఁగూడదు. ప్రతిబింబముకొఱకు మాయ నంగీకరించి ప్రతిబింబమాత్రంబున కీశ్వరత్వంబు చెప్పెద మనిన; మాయ లేకయే ప్రతిబింబమునకు సర్వజ్ఞత్వాదులు కూడదు గనుక కేవలప్రతిబింబమాత్రంబున కీశ్వరత్వంబు చెప్పఁగూడదు. అయితే అధిష్ఠానచైతన్యంబున కీశ్వరత్వంబు చెప్పెదమనిన; నిర్వికారము గనుకను, కేవలనిర్వికారచైతన్యమునకు జగత్సృష్ట్యాదులు కూడవు గనుకను, దానికి నీశ్వరత్వము

చెప్పఁగూడదు. అయితే, అధిష్ఠానచైతన్యంబును మాయయుఁ గూడి యీశ్వరత్వమని చెప్పుదమనిన; ఈ రెండును గల్పితంబులు గనుక వీనికి నీశ్వరత్వంబు చెప్పినచో నీశ్వరునికి నిత్యత్వము సిద్ధింపదు. సిద్ధింపకపోయినచో నేమి యనిన; ఈశ్వరునికి నిత్యత్వము ప్రతిపాదించెడి శ్రుతులకు విరోధము వచ్చుచున్నది గనుక మాయాప్రతిబింబములకు నీశ్వరత్వము చెప్పఁగూడదు. అధిష్ఠానచైతన్యంబును నిర్వికారంబు గాన నిర్వికారచైతన్యమునకు వికారమైన యీశ్వరత్వము చెప్పఁగూడదు. మాయయును, మాయయందుఁ బ్రతిబింబించిన చైతన్యంబును, మాయాధిష్ఠానచైతన్యంబునుంగూడి యీశ్వరుండని చెప్పవలెను.

ఈ ప్రకారంబుగ జీవేశ్వరుల నెచట నిరూపించినారనిన; విద్యారణ్యస్వాములవారు పంచదశప్రకరణమందు నిరూపించినారు.

ఆ వాక్యము లేవి యనిన.—

శ్లో. చైతన్యం యదధిష్ఠానం లింగదేహం చ యః పునః,
చిచ్ఛాయా లింగదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే.
చిదానందమయీ బ్రహ్మ ప్రతిబింబసమన్వితా,
తమోరజస్సత్త్వగుణా ప్రకృతిర్ద్వివిధా చ సా.
సత్త్వశుద్ధవిశుద్ధాభ్యాం మాయా విద్యా చ తే మతే,
మాయాబింబం వశీకృత్య తాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః.

అని ఈ ప్రకారంబుగ జీవేశ్వరులయొక్క స్వరూపంబును విచారించి జీవేశ్వరులు మాయాకల్పితులని నిశ్చయించి జీవేశ్వరుల కధిష్ఠానభూతుఁడై నిర్వికారుఁడు నిరవయవుఁడు నసంగుఁడు స్వప్రకాశుఁడు సర్వసాక్షియు నైన 'ప్రత్యగాత్మయే పరమాత్మ. ఆ పరమాత్మయే నేను' అని యెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది చత్వారింశద్వర్ణకము.

# ఏకచత్వారింశద్వర్ణకము

—

## మనోనిగ్రహనిరూపణము

మనస్సు చంచలము. ఒక దిక్కున నుండెడిది కాదు. తనతోఁ గూడియుండెడి పురుషునిఁ దప్పింపఁజేయును. ఒక విషయంబునందుఁ బడియెనేని దీని దప్పింపఁగూడదు. మిక్కిలి వేగము గల వాయువును, నిగళంబులు ద్రెంచుకొని పారిపోవునట్టి యేనుఁగును అడ్డగింప నెటుల వశముగాదో అటులే మనస్సును నిలుప వశముగాదని అర్జునుఁడు భగవంతునిఁగూర్చి చెప్పినాఁడనియును, సముద్రంబు నైన పానంబు సేయ వచ్చును. మేరుపర్వతంబునైనఁ బెల్లగింపవచ్చును గాని చిత్తనిరోధంబు చేయుట అశక్యమని వసిష్ఠుఁడు శ్రీరామున కుపదేశించినాఁ డనియును గీతలయందును జ్ఞానవాసిష్ఠమందును చెప్పఁబడియున్నది. ఆ భగవద్వసిష్ఠులే చిత్తనిరోధంబు దుర్లభంబని చెప్పిరని ఆవాక్యములను విడిచిపెట్టి లోకమందు కొందఱు చిత్తనిరోధంబు కఠినమని చెప్పెడి కావ్యములను మాత్రము విని చిత్తనిరోధ మెవరికిని సర్వాత్మనా కూడదని నిశ్చయించి వేదాంతవిచారమందు అధికారియే లేఁడని చెప్పుచున్నారు. వారి మాటలను విని మఱికొందఱు జనులు భ్రమియించుచున్నారు. వారలయొక్క భ్రమను పోఁగొట్టుటకై చిత్తనిరోధము మిక్కిలి సులభ మనుటను దృష్టాంతపూర్వకంబుగ నిరూపించుచున్నారము. మనస్సు ఒంటిపసరంబువంటిది. ఒంటిపసరము సర్వదా పైరును గూర్చి పోవును. పట్టవచ్చినఁ బారిపోవును. దానిని బ్రయాసమునఁ బట్టి తెచ్చి గృహాంబునందుంచి దానిముందుఁ గసవు వేసినట్టయిన ఆ కసవు నాఘ్రాణించి పైరునే చింతించుచుండును. కొంతసేపు ఈ ప్రకారంబుగా నుండిన తరువాత దానిని విడిచిపెట్టిరేని అది మరల పైరునుగూర్చియే పోవును. మరునాఁడును మునుపటివలెనే పట్టి తెచ్చి గృహమందు కట్టివేసి కసవు ప్రత్తిగింజలు తవుడు మొదలగువానిని వేసిరేని దాని నించుకసేపు భక్షించి తిరుగా నా పైరునే ధ్యానించుచుండును. మరల దానిని విడిచిపెట్టుచు పట్టితెచ్చి కట్టివేయుచు రాఁగా రాఁగా, ఇంటితిండి అభ్యాస

మై శాట తోలినప్పటికిని తిరుగా గృహంబునకే వచ్చును. పైరమీఁది యిచ్ఛనూని గృహంబునందే యుండును. కాఁబట్టి యభ్యాసవశంబున నొంటిపసరము గృహమందు కట్టఁబడినట్లు మనస్సును నభ్యాసముచేత నిలుపవచ్చును.

అది యెటువలె ననఁగా; నిత్యమును దన కభీష్టమైన మూర్తిని రెండుగడియలు ధ్యానము సేయఁనవుడు ఆ చిత్తంబు తిరుగా విషయంబులయందే వ్యాపించుచుండును. దానిని తిరుగా ఆమూర్తిని ధ్యానించునట్లు త్రిప్పివిడుచుట యభ్యాసము. ఈప్రకారమే మఱునాఁడు నాలుగు గడియలు ఆ మఱునాఁ డాఱుగడియలు ఆమఱునాఁ డెనిమిదిగడియలు ధ్యానంబుచేయుచు రాఁగా నీ యభ్యాసమువలన చిత్తము నెక్కడ నిలిపిన నక్కడ నిలుచును అనేకజన్మంబులయందు చేసిన విహితకర్మములనెల్ల నీశ్వరార్పణంబుగాఁ జేయుచు రాఁగా నొకజన్మమునందు పురుషునికి చిత్తము పరిపక్వమవును. తరువాత విషయములయందు దోషదృష్టి కలుగును. పిదప ఆ విరించ్యాదులు మిథ్య యని బ్రహ్మలోక తృణీకారము కలుగును. అదియే వైరాగ్యమని చెప్పఁబడును. అట్టి వైరాగ్యపురుషుని చిత్తంబు శ్రవణాదులయం దెక్కడ నిలిపినను చంచలములేక నిలుచును. కాఁబట్టి చిత్తనిరోధంబు సర్వత్ర సాధ్యంబు గాక పోయినను ఈశ్వరసద్గురుకటాక్షముగలవారికి అభ్యాసవైరాగ్యంబుల చేత చిత్తనిరోధము సులభసాధ్యంబుగానే యుండును గనుక వేదాంత విచారమందు సాధనచతుష్టయసంపన్నుఁడైన అధికారిలేఁడని భ్రమించ వలసినది లేదు. ఈ చిత్తనిరోధము కఠినంబుగాదు. సులభంబే యనుటకు సమ్మతివచనంబులు:—

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.
అబ్ధిపానాదపి హతః సుమేరూన్మూలనాదపి,
అపవర్జ్యావనాత్సాధో విధురశ్చిత్తనిగ్రహః.
అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.
అపి వ్రజ్యాత దళనాదపి లోచనమీలనాత్,
సుకరో హరివృత్తిత్వా న్న క్లేశః ప్రమనాగపి.

ఈప్రకారంబుగ విచారించివైరాగ్యమును సంపాదించి వైరాగ్య పూర్వకంబుగ శ్రవణాదులుచేసి జ్ఞానము నెవఁడు సంపాదించుచున్నాఁడో వాఁడు ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇతి ఏకచత్వారింశద్వర్ణకము.

---

# ద్విచత్వారింశద్వర్ణకము

## దేహేంద్రియనిరూపణము

దేహేంద్రియంబులకును ఆత్మకును వైలక్షణ్యంబు నిరూపించుచున్నారము. దేహేంద్రియములు అనిత్యంబును, అశుద్ధంబును, జడరూపంబును, దుఃఖరూపంబును, దృశ్యంబులును, సవికారంబులును, పరిచ్ఛిన్నంబులును, సాపేక్షప్రకాశ్యంబులును, సంకల్పంబులును, ఆధేయంబులును, సావయవంబులును, అప్రకాశ్యంబులును, ఆద్యంతరహితంబులును, సజాతీయ విజాతీయ స్వగతభేదసహితంబులును కార్యంబులును, గుణవంతంబులును అనియును, ఆత్మ నిత్యుఁడు, శుద్ధుఁడు, అజడుఁడు, సుఖస్వరూపుఁడు, ద్రష్ట, నిర్వికారుఁడు అపరిచ్ఛిన్నుఁడు, స్వప్రకాశుఁడు, నిష్కలుఁడు, ఆధారుఁడు, నిరవయవుఁడు, అప్రకాశుఁడు, ఆద్యంతరహితుఁడు, సజాతీయ విజాతీయ స్వగతభేదరహితుఁడు, కారణుఁడు, నిర్గుణుఁడు అనియును. ఈప్రకారముగా దేహేంద్రియాదులకును, ఆత్మకును వైలక్షణ్యము విచారించి ఆత్మ నేనని యెవఁడెఱుఁగుచున్నాఁడో, వాఁడే ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇతి ద్విచత్వారింశద్వర్ణకము.

---

# త్రిచత్వారింశద్వర్ణకము

## సుఖదుఃఖవిచారఘట్టము

లోకమందు వేదాంతులకంటె నన్యులలో కొందఱు విద్వాంసులు మఱికొందఱు తార్కికులు మఱికొందఱు పామరులునై యున్నారు.

నీరందఱును ఆభాసశాస్త్రపురాణాదులను జదివి విని అదే సత్యమని యెంచుకొని, కొమాళ్లుగలవారికి నిహలోకమందును, పరలోకమందును సుఖము కలదు. కొమాళ్లు లేనిచో నిహపరములయందును సుఖము లేదు. అని కొందఱు చెప్పఁగా విని పలుకొందఱు భ్రమసియున్నారు. వారలయొక్క భ్రమను పోగొట్టుటకై కొమాళ్లు కలవారికే దుఃఖమధిక మనెడి శాస్త్రంబును విచారించి ముముక్షువు లైనవారు కొడుకులు మొదలైనవారియందుఁ మమకారముంచుకొనక ఆత్మస్వరూపులై తనయందే పరమప్రీతిని కల్పించుకొని ఆత్మనిష్ఠులై యుండవలయు ననుటను నిరూపించుచున్నారము. అది యెటు లనఁగా;

శ్లో. అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్,
లబ్ధోఽపి పిండపాతేన ప్రసవేన చ బాధతే
జాతస్య గ్రహరోగాది కుమారస్య చ ధూర్తతా,
ఉపనీతేఽప్యవిద్యత్వమనుద్వాహశ్చ పండితే.
యూనశ్చ పరదారాది దారిద్ర్యం చ కుటుంబినః,
పుత్రో దుఃఖస్య నాస్త్యంతో ధనీ చేన్మ్రియతే తథా.
ఏవం వివిచ్య పుత్రేఽసౌ ప్రీతిం త్యక్త్వా నిజాత్మని,
నిశ్చిత్య పరమప్రీతిం వీక్ష్యతే తదహర్నిశమ్.

అని యీప్రకారంబుగ చెప్పుటవలన కొడుకులు పుట్టియుఁ బుట్టకయు తల్లిదండ్రులకు సర్వదా క్లేశమునే యిచ్చుచున్నారు. అది యెటువలె ననిన; కొడుకులు లేనివారలు సంతానము లేకనే దుఃఖముచేత నొక బ్రాహ్మణునిఁ బిలిచి మాకు పుత్రులు లేకపోయిరే యింక మాకేమి గతి యని యడిగితే, మీరు పాపకర్ములు. కాఁబట్టి సంతానము లేనివార లైతిరి. రామేశ్వరంబు మొదలయిన పుణ్యతీర్థంబులయందు స్నానంబు చేసి వచ్చితిరేని మీ పాపంబులు నశించును. పుత్రులు కలుగుదు రని ఆ బ్రాహ్మణుఁడు చెప్పఁగానే ఆ మాటలను విని అదేప్రకారముగా అనేకదినములు తీర్థయాత్రలు చేసి ఎక్కడెక్కడ కాలానుసారంబుగ కాయక్లేశాది సకలదుఃఖంబులు ననుభవించియు నిష్టసిద్ధి పొందనేరక మరియొకశాస్త్రజ్ఞుని రావించి మాకు కొమారుఁడు లేకపోయెనే, ఇందు కేమి చేయవచ్చునని యడిగిన, అతఁడు మీకు ప్రతిబంధములు కలిగి

యుండుటచేత ముగ్గులు వేసి మంత్రింపించి ఆ ప్రతిబంధంబులను బాపు కొంటిరేని, పుత్రులు కలుగుదు రని చెప్పఁగానే వా రామంత్రవాది మాటలను నమ్మి యేవిధంబున నైన మాకు కొమారుఁడు కలుగునట్లు చేయవలయునని అతని వేఁడుకొని అందుకుఁదగిన ప్రయత్నంబుచేయఁగా ఆ మంత్రవాదియు పుట్టమ్మ మాచకమ్మ మాతంగి సహాదేవి మొదలైన వారలకు తృప్తి చేయవలెనని వారిచేత విశేషంబుగ ద్రవ్యవ్యయంబు చేయించి మోసగించును. అందుచేతను కొమారుఁడు కలుగకపోవుటకు దుఃఖించి, మరియొక కర్మఠునియొద్దకు పోయి మాకు సంతానము లేక పోయెనే మా గతి యేమి యని యడిగితే మీరు మహాపాపాత్ములరు గనుక సంతానంబు లేకపోయెను. దంపతులైన మీరిద్దరును నిరాహారు లై మిక్కిలి నియతితో నోటిబీగాలు వేసుకొని తిరుపతికి పోయి వేంక టేశ్వరులను దర్శించి నూఁలుమాడలు కానుక పెట్టి ఆ దేవుని నుద్దే శించి అనేకసమారాధనలు దీపారాధనలు మొదలైనవిచేసి నియమము తప్పక యింటికి వచ్చి యింటిలో తిరుగా బ్రాహ్మణసంతర్పణలు చేయిం చినచో మీకు కొమాళ్లు కలుగుదురు. సందేహంబు లేదని చెప్పఁగా, అతనివాక్యములు నమ్మి విశ్వాసయుక్తులై ఆప్రకారమే సకలంబునుచేసి అప్పటికిని సంతానంబులేక దుఃఖపరంపరలో మునుఁగుచుఁ దేలుచు నుండుదురు. కాఁబట్టి లేనిపుత్రుఁడు తల్లిదండ్రులను బహుదుఃఖంబులను బెట్టుచున్నాఁడనుటకు సంశయంబు లేదు.

కలిగినపుత్రుఁడు దుఃఖపెట్టుట యెటువలెననిన; దైవాధీనంబున సంతానకాంక్ష కల్గినవారికి తనంతటనే గర్భము నిలిచినట్లయితే గర్భము ధరించిన కొన్నిదినంబుల కొకకర్మవశమువలన గర్భపాతమౌను. అందు వలన తల్లిదండ్రులు మిక్కిలి దుఃఖింతురు. అటులగాక ఆ గర్భము పది నెలలు నిండునంతవరకు నిలిచియుండినయెడల ప్రసవకాలమందు ప్రసవ వేదనచేత తల్లికి బహుబాధలు కలుగును. ఆ బాధలు చూడఁజాలక మంత్రసాని మొదలైనవారు అయ్యా తిరుమలభట్లూ మీభార్య ప్రసవ వేదనచేత మిక్కిలి బాధపడుచున్నది. ప్రార్థన లేమైన నుండెనేని చేసు కొనుఁడు. అని చెప్పుదురు. అప్పు డతఁడు నేను సమస్తప్రార్థనలు మునుపే చేసుకొనియున్నాను. కుమారునికి ఆశపడినందుకు పెద్దప్రాణికే

హాని వచ్చెనుగదా! ఇఁక నేమి చేతును. అది బ్రతికితే చాలును. దేవుఁడు మమ్ము సకలవిధములను దుఃఖపెట్టుచున్నాఁడనుచు. అందువలనను దల్లిదండ్రులకు దుఃఖమే కలుగుచున్నది. ఒకవేళ సుఖముగా ప్రసవించినట్టయినచో ఆ పుట్టినవానికి ముట్టుదోషము పక్షిదోషము మొదలైన దోషంబులు తాఁకును. అది చూచి తల్లిదండ్రులు వానికి రక్షలు కట్టించి విభూతి మంత్రింపించి బహు శ్రమపడి పెంచుదురు. అటువలెకాక నిశ్చింతగా పెరిగినయెడల ఆ కుమారుఁడు పదియేండ్లవాఁడై మిక్కిలి దుర్మార్గముచేత నూరిలోని చిన్నవాండ్రనందఱను కొట్టి తాను వారిచేతనుం దెబ్బలు దిని వచ్చి తన పెద్దలకును నూరిలోని పెద్దలకును కలహము పెట్టును గనుక ఇందుచేతను తల్లిదండ్రులకు దుఃఖమే కలుగును. అటువలెఁగాక బుద్ధిమంతుఁడై యుండెనేని వానికి ఉపనయనముచేసి వానిని చదువవేతురు. వాఁడు చదువురానివాఁడయ్యెనేని వాని మూఢత్వము నెంచక చదువు చెప్పెడి యుపాధ్యాయునితో మా చిన్నవానికి చదువు చెప్పక మావద్ద ద్రవ్యము తీసుకొని తింటివి. నీకు ఋణముండి యిచ్చితిమని జగడము వేయుదురు. అందువలనను తల్లిదండ్రులకు దుఃఖమే కలుగుచున్నది. మఱియు నా కుమారుఁడు విద్యావిహీనుఁడు గాక చదువరి యయ్యెనేని వానికి వివాహము చేయవలయునని కన్యకలు గలవారియిండ్లకుఁబోయి పసుచుల నడిగిన నొకరు ముప్పదివరహాలియ్యవలయుననియు, మఱియొకరు నలువదివరహాలిమ్మనియు నడుగునప్పుడు తమకు ద్రవ్యోపపత్తి లేకపోయెనుగదా! యనియు, ఇంకొకరు కన్యాప్రదానముచేయుటకు సమ్మతిపడినను వధూవరుల రాశినక్షత్రంబులు అనుకూలంబులు గాకపోవుటవలన నది తమయిష్టానుసారంబుగాఁ గుదిరియు ననుకూలించకపోయెనుగదా యనియును దుఃఖింతురు. కాఁబట్టి ఇందువలనను ఆకుమారుఁడు తల్లిదండ్రులకు దుఃఖమునే సంపాదించుచున్నాఁడు.

అటుగాక అన్నివిషయంబులును జక్కపడి వివాహమయ్యెనేని తరువాత ఆ పడుచు పోది గలిగియుండక క్షయరోగివలె చిక్కిపోయి పుడకవలె నుండిన దానికి తల్లిదండ్రులు కూశ్మాండఘృతము మొదలైన ఔషధంబులు చేయుచుండఁగాఁ జూచి ఆ కుమారుఁడు కామాతురుఁడై

భార్యను తన కుపయోగింపదని యెంచి జారుఁడై పరస్త్రీలను గలయుచుండును. అప్పుడు అపకీర్తికి హేతువు లైన వాని పనులు చూచి నగరివారు విని దండుగఁ బెట్టుచుందురు. ఇందువలనను తల్లిదండ్రులకు దుఃఖమే కలుగుచున్నది. ఇట్లుండునపుడు ఆపుత్రునియొక్క భార్య యెదిగి సంసారంబునకు వచ్చి దానికి బిడ్డలు గలిగినట్టయిన అప్పుడు సంసారబాహుళ్యంబువలనను తమదారిద్ర్యదశవలనను బిడ్డలతోడ పుత్రుఁడు కష్టపడుచుండఁగా జూచి తల్లిదండ్రులు దుఃఖించుచుందురు. అప్పుడు తటస్థులు వారలను చూచి యేల దుఃఖించెదరని యడిగిన, పిన్నవాండ్రకు కట్టుకొనుటకు బట్టలు లేవు. కడుపుకు అన్నము లేదు. ఇది చూచి మేము తాళలేము. మాకు మరణంబు సంప్రాప్తంబు గాకపోయెను. అని బహువిధంబుల దుఃఖించుచున్నారు. ఇందువలననుఁ దల్లిదండ్రులను పుత్రుఁడు దుఃఖపెట్టుచున్నాఁడు. ఈ ప్రకారంబుగ పుత్రులు కలిగినను కలుగకున్నను తల్లిదండ్రులకు దుఃఖమే కలుగుననుటను చక్కఁగా విచారించి అందువలన ఇహపరములు రెంటియందును సుఖము లేదని తెలుసుకొని ముముక్షువులైనవారలు పుత్రమిత్రకళత్రాదులయందు ప్రీతిని వదలి ఆత్మస్వరూపుఁడైన తనయందు పరమప్రీతి నునిచి సర్వదా ఆత్మనిష్ఠుఁడైయుండవలయుననియు, అద్వితీయాత్ముఁడు తాననియు నెవఁడెఱుఁగుచున్నాఁడో, వాఁడే ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది త్రిచత్వారింశద్వర్ణకము.

---

# చతుశ్చత్వారింశద్వర్ణకము

## ఆత్మప్రియత్వనిరూపణము

శ్లో. విత్తాత్పుత్రః ప్రియం పుత్రాత్ స్వపిండం చ తథా ప్రియమ్,
ఇంద్రియాశ్చ ప్రియాః ప్రాణాః ప్రాణా దాత్మా పరః ప్రియః.

విత్తమునకన్న పుత్రుఁడు ప్రియుఁడు, పుత్రునికన్న శరీరము ప్రియము. శరీరముకన్న ఇంద్రియంబులు ప్రియంబులు. ఇంద్రియం

బులకన్న ప్రాణంబులు ప్రియంబులు. ప్రాణంబులకన్న ఆత్మ ప్రియుఁడు అని విచారించవలెను. అది యెటువలె ననిన; లోకమందు పుత్త్రుఁడైన వాఁడు అకృత్యము చేసినప్పుడు వానిని నగరివారు దండన చేయుటకు ప్రయత్నపడిరేని వాని తల్లిదండ్రుల కా కొమారుఁడు దండింపఁబడుట సహింపక యింట నుండెడి పదార్థంబుల నెల్ల నగరివారికి లంచమిచ్చి ఆ పుత్త్రుని విడిపించుకొనుచున్నారు. కాఁబట్టి విత్తముకన్న పుత్త్రుఁడు ప్రియుఁడాయెను. ఆ యకృత్యముచేసిన పుత్త్రుని లంచములు తీసుకొని వదలక వాని దండనకు నీవు లోఁబడితే వానిని వదలెదమని నగరివారు చెప్పినచో ఆ తండ్రియైనవాఁడు అందుకు సమ్మతించక ఆ నగరివారితో నాకును చిన్నవానికిని సంబంధము లేదని చెప్పి తాను తప్పించుకొని వచ్చును. కాఁబట్టి పుత్త్రునికన్న శరీరంబు ప్రియంబు. మఱియును అకృత్యము చేసిన యేపురుషుఁడైనను నగరివారు దండించునపుడు వాని కండ్లు పొడుపుదుమని చెప్పినచో, అప్పుడా పురుషుఁడు శరీరదండనంబునకు సమ్మతించి ఇంద్రియంబులనుగూర్చి మంత్రాలోచించుచున్నాఁడు. కాఁబట్టి శరీరమునకన్న ఇంద్రియంబులు ప్రియంబులు. ఆ యకృత్యము చేసిన వానిని నగరివారు శరీరముతో వదలక తలఁగొట్టనాజ్ఞాపించిరేని నింద్రియంబులను విడిచి తలనుగూర్చి మంత్రాలోచించుచున్నాఁడు గనుక ఇంద్రియంబులకన్న ప్రాణంబులు ప్రియంబులు అటువలెనే తాను పరలోకమందును సుఖంబుగ నుండవలయునని ఇచ్ఛయించుచున్నాఁడు. ప్రాణంబును త్యజించుటకు సమ్మతించినవాఁడు పరంబునం దిచ్ఛయించుచున్నాఁడు గనుక ప్రాణంబునకన్న ఆత్మ ప్రియుఁడు. ఈ ప్రకారంబుగ విచారించి పుత్త్రమిత్త్రకళత్త్రదేహేంద్రియాదులనెల్ల దుఃఖరూపంబుగ నెఱిఁగి వానియందభిమానంబును వదలి ప్రియతముఁడైన తన్ను ఆత్మగా నెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడు ముక్తుఁడని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

ఇది చతుశ్చత్వారింశద్వర్ణకము.

—

# పంచచత్వారింశద్వర్ణకము

## మహావాక్యార్థవిచారఘట్టము

శ్లో. యస్యప్రసాదాద్విశమేవతత్త్వం బ్రహ్మైవజానాతినిరస్తమోహః,
తమేవ సత్యం విభుమాత్మతత్వం శ్రీవాసుదేవం శిరసా నమామి.

"లోకమందు అధికారి అనేకజన్మంబులయందు నీశ్వరార్పణంబు చేసిన నిత్యనైమిత్తికకర్మంబులచేతను సగుణోపాసనచేతను శుద్ధాంతఃకరణుండై యీ మనుష్యలోకంబు మొదలుకొని బ్రహ్మలోకపర్యంతంబును సర్వంబు కర్మనిర్మితము అని ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, నిత్యానిత్యవస్తువివేకము, ముముక్షుత్వము అనెడి నాలుగువిధంబులైన సాధనములతోఁ గూడుకొని కానుక మొదలైనవి చేతఁబట్టుకొని వేదాంతశాస్త్రజ్ఞుఁడై యుపశాంతనిధియైన సద్గురుసన్నిధానంబుఁబొంది సాష్టాంగనమస్కారములఁ జేసి 'అహోస్వామిన్ పరమగురో' ఈ సంసారమందు ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికరూపమైన తాపత్రయముచేత మిక్కిలి కొట్టఁబడినవాఁడనైతిని గనుక ఈ సంసారభయమువలన ప్రయాసలేక సులభముగ నేను తరించునట్టి ప్రకారంబును తెలిపి సకలవేదాంతంబుల తాత్పర్యార్థంబును సంక్షేపించి నాయందు కటాక్షించి అనుగ్రహము చేయుఁ"డని శిష్యుఁ డడుగఁగా గురువులు ఉపదేశము చేయుచున్నారు. ఓయీ! మహావాక్యార్థవిచారమువలనఁ బుట్టిన జీవపరమాత్మైక్యజ్ఞానమే మోక్షసాధనము. ఇదియే సకలవేదాంతంబులయందును నిర్ణయింపఁబడిన అర్థమని గురువులుపదేశించఁగానే శిష్యుఁడు మరల నిట్లని విన్నవించును. స్వామీ, మహావాక్యమనఁగా; నేదియో? వాక్యార్థవిచారమనఁగా; నేదియో? జీవుండనఁ, నెవ్వఁడో? ఈశ్వరుండనఁ; నెవ్వఁడో నేనెఱుఁగను. ఆ జీవేశ్వరులయొక్క ఐక్యానుసంధానం బెట్టిదో యెఱుఁగను. మఱియు నాకు బంధంబు వచ్చినవిధంబును ఇఁక మోక్షమును పొందఁదగినవిధంబులును నెఱుఁగను. కాఁబట్టి పరమదయాపరమూర్తులగు మీరు నాయందు

కరుణించి సవిస్తారంబుగ నానతీయవలయునని ప్రశ్న చేయఁగానే మంచి ప్రశ్న చేసితివి. చెప్పెదను. సావధానంబుగ వినుము. నాలుగు వేదముల యొక్కయు నుపనిషత్తులయందును నాలుగు మహావాక్యంబులు గలవు.

అవి యేవి యనిన; 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని ఋగ్వేదోపనిషత్తుల యందును, 'అహం బ్రహ్మాస్మి' అని యజుర్వేదోపనిషత్తులయందును, 'తత్త్వమసి' అని సామవేదోపనిషత్తులయందును, 'అయమాత్మా బ్రహ్మ' అని యథర్వణవేదోపనిషత్తులయందును కలవు. ఈ వాక్యములకు అర్థ మేమి యనిన; వాక్యార్థజ్ఞానంబునకు కారణంబు పదార్థంబు గనుక పదార్థవిచారమే ముందుగాఁ జేయఁదగినది. పద మెద్ది? పదార్థ మెయ్య దనిన; త్వంపదము, తత్పదము, అసిపదము అని మూఁడుపదములు. త్వంపదార్థము జీవుఁడు, తత్పదార్థ మీశ్వరుఁడు, అసి యనుట ఆ రెంటియొక్క ఐక్యార్థము. త్వంపదార్థమైన జీవునియొక్క స్వరూప మెయ్యదియనిన; అధిష్ఠానచైతన్యంబును దానియందుఁ గల్పితమయిన లింగశరీరమును, లింగశరీరంబునందుఁ బ్రతిఫలించిన చిదాభాసుండును, చిదాభాసునియొక్క ధర్మంబులైన కించిద్జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వాదు లునుగూడి త్వంపదార్థభూతుఁడైన జీవునియొక్కస్వరూపము. తత్పదార్థ మైన ఈశ్వరునియొక్కస్వరూప మేది యనిన; మాయయు మాయాధి ష్ఠానబ్రహ్మచైతన్యంబు మాయయందు ప్రతిఫలించిన చిదాభాసుండును ఆతనిధర్మంబులైన సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వాదిగుణంబునులుగూడి తత్ప దార్థభూతుఁడైన ఈశ్వరునియొక్కస్వరూపము; అసి యనఁగా; జీవుఁడే బ్రహ్మము. బ్రహ్మమే జీవుఁడు అని ఐక్యార్థము. ఈ ప్రకారంబుగ గురువు లుపదేశింపఁగా శిష్యుఁడు "హే సచ్చిదానందగురో కించిద్జ్ఞత్వాదిగుణం బులతోఁడఁ గూడుకొనిన జీవునికి సర్వజ్ఞత్వాదిగుణంబులతోఁడఁ గూడు కొనిన ఈశ్వరునికి ఐక్యమెటువలె కూడును: ఈ విరుద్ధార్థమును శ్రుతులు ఎటువలె బోధించుచున్నవి? ఇది నాకు సంశయముగా నున్నది. ఈ సంశయంబును పరిహరించి రక్షించవలయు ననిన; గురువులు శిష్యునిం జూచి ఓ శిష్యుఁడా! నీవు అడుగఁదగిన మంచి ప్రశ్నము నడిగి తివి. ఈ వాక్యంబునకు లక్ష్యార్థమనియు వాచ్యార్థమనియు నర్థము రెండువిధంబులు. వాచ్యార్థమంగీకరించినచో నెక్కడ ప్రత్యక్షవిరోధ

ముంటునో అక్కడ లక్షో ్యర్థమంగీకరింపఁదగినది కాఁగా ఈ మహా వాక్యమం దీలక్షణచేతను ఐక్యంబు బోధింపఁబడుచున్నది.

లక్షణలెన్ని విధంబులనిన; జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహ ల్లక్షణ యని మూఁడువిధంబులు. (విడిచినలక్షణ విడువనిలక్షణ విడిచి విడువనిలక్షణ యని వీటికి పేర్లు.) ఒక బ్రాహ్మణుఁడు గంగాతీరంబునం దుండి వచ్చెనేని అతనింజూచి మఱియొక బ్రాహ్మణుండు గంగాతీరమందు విశేషంబు లేమి యని అడిగిన అతఁడు 'గంగాయాం ఘోషః' అనఁగా గంగయందు గొల్లపల్లె యున్నదని చెప్పెను. ఈ మాటకు తాత్పర్య మేమియనిన; గంగ యను పదమునకు ప్రవాహమర్థము గనుక ఆ ప్రవాహమందు గొల్లపల్లెయున్నదని అంగీకరించినచో ప్రత్యక్షవిరోధము గనుక గంగ యను పదంబునకు అర్థమైన ప్రవాహమును సర్వాత్మనా విడిచి ఆ ప్రవాహపుగట్టునందు గొల్లపల్లెయున్నదని తాత్పర్యము చేసుకోవలెను. ఇది జహల్లక్షణ. ఇటువలె మహావాక్యమందును జహల్లక్షణ చెప్పవచ్చుననిన; కూడదు. అది యెటువలెననిన; త్వంపదార్థమైన కూటస్థచైతన్యపర్యంతంబును విడిచిపెట్టినచో ముముక్షువులయొక్క స్వరూపమే లేకపోవుచున్నది. కనుకను ప్రత్యక్షవిరోధము గనుకను ఈ జహల్లక్షణ కూడదు. ఏ లక్షణచేత నే వాక్యము బ్రహ్మజ్ఞానమును బోధించుచున్నదనిన; అన్నమయకోశము మొదలుకొని విజ్ఞానమయ కోశపర్యంతంబును పరబ్రహ్మమని చెప్పెడి వాక్యమందు జడమైన కోశంబులు బ్రహ్మమని చెప్పఁగూడదు గనుక వాటిని విడిచి వాటికి అధిష్ఠాన భూతమైన చైతన్యంబునకే తాత్పర్యము చెప్పవలెను. ఇది యిప్పుడు జహల్లక్షణ. అజహల్లక్షణ అనఁగా; 'మంచాః క్రోశంతి' అను వాక్యమందు మంచములు కూఁతలు పెట్టుచున్నవని చెప్పిన ప్రత్యక్షవిరోధము గనుక మంచములను విడువకనే మంచముల మీఁద పురుషులు కూఁతలు పెట్టుచున్నారని అజహల్లక్షణచేత తాత్పర్యము నిర్ణయింపఁదగినది. అటువలెనే వేదమందు 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అనెడి వాక్యంబునకు ఆ వాక్యమం దానందమయకోశముతోఁ గూడనుండు ఆత్మను చెప్పుచున్నారు గనుక సచ్చిదానందంబులను విడువకనే ఆనందమయకోశము చెప్పుచున్నది. ఈ యర్థము మహావాక్యమం దంగీకరింతమనిన; కించిద్ జ్ఞత్వాదిగుణములతోఁ గూడుకొనిన చైతన్యమే జీవుఁడు గనుక గుణ

విశిష్టుఁడైనవానికి ఐక్యంబు చెప్పఁగూడదు గనుక ఇక్కడ అజహల్లక్షణ కూడదు. జహదజహల్లక్షణ యనగా; 'సోఽయం దేవదత్తః' అనెడి వాక్యంబున గంగాతీరమందు అయిదోయేట దేవదత్తుని చూచితిమి. ఆ దేవదత్తుని ఈ కావేరీతీరమందు నేఁబదియవయేట చూచితిమి అనే వ్యవహారమందు ఆ దేశకాలంబులు, ఈ దేశకాలంబులు వీట్లను కూడుకొనిన పురుషుఁడే వాక్యార్థమని అంగీకరించితిమేని బహువిరోధ మున్నది.

అది యెటువలె ననఁగా; గంగాతీరము కావేరీతీరము కాదు. కావేరీతీరము గంగాతీరము కాదు. ఆకాలము ఈకాలము కాదు. ఈ కాలము ఆ కాలము కాదు. ఆ వయసు ఈ వయసు కాదు. ఈ వయసు ఆవయసు కాదు. కాఁబట్టి ప్రమాణాంతరమైన ప్రత్యక్షంబునకు విరుద్ధమైయున్నది గనుక వాచ్యార్థమైన తద్దేశతత్కాలంబులను ఏతద్దేశ ఏతత్కాలంబులను విడిచి లక్ష్యభూతుఁడైన దేవదత్తుఁడే వాచ్యార్థముగా నూహింపవలెను. మహావాక్యమందును తత్పదార్థంబునకు వాచ్యార్థమైన మాయాప్రతిబింబసర్వజ్ఞత్వాదిగుణంబులకును త్వంపదార్థంబునకు వాచ్యార్థమైన అవిద్యాప్రతిబింబచిదాభాసునకును వాని యొక్కగుణంబులైన కించిద్జ్ఞత్వాదులకును అన్యోన్యము ఐక్య మంగీకరించినపక్షమందు ప్రత్యక్షవిరోధమైనను మాయాసర్వజ్ఞత్వాదిగుణంబులను అద్యత్వాదిగుణంబులను త్రోసివేసి లక్ష్యభూతమైన చైతన్యమాత్రముగుఁబట్టి ఆ సచ్చిదానందబ్రహ్మమే నీవు నీవే ఆ సచ్చిదానందబ్రహ్మము అని జహదజహల్లక్షణము లను మహావాక్యములు బోధించుచున్నవి గనుక నీవే బ్రహ్మము సంశయంబు లేదు. ఇఁక నీ నాలుగు వాక్యంబులయొక్క అర్థంబును క్రమంబుగఁ జెప్పెదము. 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను వాక్యమందు ప్రజ్ఞాన మనెడి పదంబునకు అర్థమును ప్రతిపాదించు —

శ్లో. యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ,
సాధ్వసాధు విజానాతి తత్ప్రజ్ఞానమితీర్యతే.

అనఁగా; స్వాధిష్ఠానచిదాభాసుఁడైన ఈ జీవుఁడైన పురుషుఁడు కన్నుల వలన బయలుదెలిసిన అంతఃకరణవృత్తితోఁ గూడుకొని ఏ జ్ఞానంబు వలన నలుపు తెలుపు మొదలైనవాని నెఱుఁగుచున్నాఁడో, చెవులవలన

బయలు దెలిసిన అంతఃకరణవృత్తితోఁ గూడుకొని యే జ్ఞానంబువలన శబ్దమును వినుచున్నాఁడో, ఘ్రాణేంద్రియంబువలన బయలు దెలిసిన అంతఃకరణవృత్తితోఁ గూడుకొని యే జ్ఞానంబువలన గంధంబు నెఱుంగు చున్నాఁడో, వాక్కువలన బయలు దెలిసిన అంతఃకరణవృత్తులతోఁ గూడుకొని యే జ్ఞానంబువలన మాటలాడుచున్నాఁడో, నాలుకవలన బయలు దెలిసిన అంతఃకరణవృత్తితోఁ గూడుకొని యే జ్ఞానంబువలన నుప్పు పులుసు వగరు కారము మొదలైనవాని నెఱుఁగుచున్నాఁడో, మఱియును, సకలేంద్రియములవలనను బయలుదెలిసిన అంతఃకరణ వృత్తులతోఁ గూడుకొని యే జ్ఞానంబువలన సకలబాహ్యంబుల నెఱుఁగు చున్నాఁడో ఆ జ్ఞానముమాత్రమే ప్రజ్ఞానమనెడిపదమునకు లక్ష్యార్థము అంతఃకరణము.

శ్లో. చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు,
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి.

చతుర్ముఖుఁడు మొదలైన దేవతలయందును మనుష్యులు గుఱ్ఱములు గోవులు మొదలైనవానియందును అనుస్యూతమై యేచైతన్యము కలదో ఆ చైతన్యమే బ్రహ్మమనెడి పదమునకు లక్ష్యార్థము. బ్రహ్మపదంబునకు బ్రహ్మ మొదలుకొని వీరిశరీరపర్యంతంబును సకలశరీరంబులును వాచ్యార్థము గనుక మాయాకార్యమని తోసివేయఁదగినది. ఓయీ! ఇటుల నీవు నిశ్చయించుకొన్న యే వాచ్యార్థమునుబట్టి సర్వత్ర అనుస్యూతమయిన ఏ చైతన్యము బ్రహ్మస్వరూపమో, అదియే నాయందుండెడి ప్రజ్ఞానమనెడి చైతన్యము. అదియే బ్రహ్మస్వరూపము, చైతన్యము, ప్రజ్ఞానము, బ్రహ్మము, ఆత్మ అను వీనికి పేళ్లుమాత్రము వేఱుగాని వస్తువొకటియే కాన నేనే బ్రహ్మమని నిశ్చయించుకొనుము. ఇది బ్రహ్మజ్ఞానము. బ్రహ్మస్వరూపమని వాక్యార్థము. 'అహం బ్రహ్మాస్మి' అనఁగా; అహం బ్రహ్మ అస్మి అని మూఁడుపదములు. అహం అనుపదమునకు

శ్లో. పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణి,
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే.

సర్వత్ర పరిపూర్ణమైన పరమాత్మ బ్రహ్మవిద్యకు యోగ్యమైన యేశరీర మందు బుద్ధికి సాక్షిగానుండి స్ఫురించుచున్న అహమనెడిపదము లక్షణ వృత్తిచేత చెప్పఁబడు ననిన; అహ మనునప్పుడు చైతన్యంబు నిర్వికారంబు గనుక అహ మననేరదు. అహంకారము జడము గనుక అహ మని తోఁచనేరదు. పరమాత్మభూతమైన చైతన్యమే అహంకారంబు తోడఁ గూడుకొని అహమని స్ఫురించుచున్నది. కాఁబట్టి జడమై అహంకారమైనవాచ్యమును అహంకారము తోసివేసి చైతన్యమాత్రమే అహమనెడి పదమునకు అర్థము. ఎట్లనిన;

శ్లో. స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః,
అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మభవామ్యహమ్.

స్వతః తానై పరిపూర్ణమైన పరాత్మ. ఈ మహావాక్యమందు బ్రహ్మ మనెడి పదమునకు లక్ష్యార్థము. ఏదే నొక కారణమునుబట్టి సర్వత్ర పరిపూర్ణుఁడై యుండెడి ఆత్మ బ్రహ్మమో ఆకారణమునుబట్టి బుద్ధికి సాక్షియైయుండెడి నేనే బ్రహ్మమైతిని. అస్మియనెడు పదముచేత ఐక్యము ప్రతిపాదింపఁబడుచున్నది. కనుక నీవిటుల నిశ్చయించుకొనుము. సామ వేదమందలి మహావాక్యమునకు అర్థము.—తత్పదము, త్వంపదము, అసిపదము అని మూఁడుపదములు.

తత్పదంబునకు అర్థము.—

శ్లో. ఏకమేవాద్వితీయంసన్నామరూపవివర్జితమ్,
సృష్టేః పురాధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే.

సృష్టికి పూర్వమందు ఏకమై నామరూపరహితమై యే చిద్రూపుఁడైన ఆత్మ యుండెనో, ఆ యాత్మకు నిప్పుడు స్థితిసమయమందును, ఉపదేశ కాలమందును తత్ అను పదముచేతను నామరూపరహితమై లక్ష్యార్థమైన చైతన్యముమాత్రమే తత్పదార్థము చెప్పఁబడును.

త్వంపదంబునకు అర్థము.—

శ్లో. శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితమ్,
ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతామ్.

వినునట్టి యధికారియొక్క దేహేంద్రియాదులకు అతీతమై సాక్షిభూత

మైన చైతన్యమే త్వంపదముచేతను చెప్పఁబడుచున్నది. అసి యనెడి పదంబుచేతను ఐక్యము. ఆ తత్పదలక్ష్యార్థమైన చైతన్యమే నీవు. త్వంపద లక్ష్యార్థమైన నీవే ఆ తత్పదలక్ష్యార్థంబు. ఇట్లని ఐక్యంబు ప్రతిపాదించు చున్నది. కనుక అధికారివైన నీవు ఈ వాక్యార్థంబును అనుసంధానము చేయుము. ఇఁకను అధర్వణమందలి మహావాక్యమునకు అర్థము— 'అయమాత్మా బ్రహ్మ' యనెడి వాక్యంబునకు అయం ఆత్మాబ్రహ్మ యని మూఁడుపదంబులు.

అయం అను పదంబున కర్థము.—

శ్లో. స్వప్రకాశాపరోక్షత్వ మయ మిత్యుక్తితో మతమ్,
అహంకారాదిదేహాంతాత్ప్రత్యగాత్మేతి గీయతే.

అయం అనెడి పదంబుచేతను స్వవశమై నిత్యాపరోక్షమై యుండునది యీ ఆత్మ యని చెప్పఁబడుచున్నది. అహంకారము మొదలుకొని స్థూలదేహపర్యంతంబును నాయహంకారంబు నాదేహంబని యెఱుఁగు చుండెడి చైతన్యమే ప్రత్యగాత్మరూపంబు. ఇందుకు అర్థంబు చూడఁ బడెడి సమస్తము నా జగత్తుయొక్క తత్త్వం బ్రహ్మ మనెడి శబ్దంబు చేతను చెప్పఁబడిన లక్ష్యార్థంబు. జగదధిష్ఠానభూతమయిన బ్రహ్మమే స్వప్రకాశమయిన ఆత్మ. ఆ యాత్మస్వరూపమే తాను. ఈ నాలుగు మహావాక్యంబులయందు నీవే సచ్చిదానందస్వరూపమై అద్వితీయమైన ఆత్మస్వరూపుఁడవు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రవర్ణంబులు నీకు లేవు. బ్రహ్మచర్యాదులగు నాలుగాశ్రమంబులును వానియొక్క ధర్మంబులును నీకు లేవు. నీవు అసంగుఁడవు. కాలత్రయమందును నీవు జీవుఁడవు కావు. కనుక నీకు ఆగామిసంచితప్రారబ్ధకర్మంబులు లేవు. అఖండైక రసమై సుఖస్వరూపమైన ఆత్మవు నీవు. ఇట్లని గురువులవారు హస్తస్పర్శ చేసి శిరస్సుపై తమయొక్క శ్రీహస్తంబునిచి పూర్ణానుగ్రహంబు చేసిరి. అటుతర్వాత నా శిష్యుఁడు బాహ్యంబు మఱచి పలుకడవలకు కన్నులు దెఱచి చూచి దిగ్గున లేచి గురుస్వాములకు అనేక సాష్టాంగ వందనంబులు చేసి విజ్ఞాపనము చేయుచున్నాఁడు. హేస్వామీ! నేను కృతార్థుఁడనైతిని. నాకు మోహనివృత్తి యాయెనని విజ్ఞాపనంబుచేసిన వాఁడాయెను. కనుక ఈ నాలుగుమహావాక్యంబులయొక్క వివేక

మెవఁడు వినినను చదివినను వ్రాసి అర్థంబు విచారించినను వాఁడు కృతార్థుఁడగును.

శ్లో. తాపత్రయార్కతప్తానాం సదా పాపవిమోచనమ్,
కామాదిరహితశ్రీమద్వ్యాసుదేవగురుం భజే.

ఇది పంచచత్వారింశద్వర్ణకము.

---

# షట్చత్వారింశద్వర్ణకము

## ఆత్మానాత్మవివేకనిరూపణము

ఆత్మ యనఁగా నెవ్వరనిన; స్థూలసూక్ష్మకారణములకంటె వ్యతిరిక్తుఁడై అవస్థాత్రయసాక్షియై నిత్యుఁడై నిర్వికారుఁడై పుణ్యాపాపంబులచేత స్పృశింపఁబడనివాఁడై సర్వసంబంధశూన్యుఁడై సత్యుఁడై కాలత్రయాబాధ్యుఁడై పరమానందస్వరూపుఁడైనవాఁడు ఆత్మ యని చెప్పఁబడును. అనాత్మ యనఁగా సమష్టిస్వరూపమైన స్థూలసూక్ష్మకారణశరీరంబులు అనాత్మ యని చెప్పఁబడును. స్థూలశరీరమనఁగా నెయ్యది యనిన; పంచీకృతభూతకార్యమై ప్రారబ్ధకర్మంబుచేత సంపాదింపఁబడినదై జీవునియొక్క కర్మానుభవఫలరూపమైన సుఖదుఃఖముల యొక్క భోగమునకు ఆశ్రయస్థానమైనది స్థూలశరీర మని చెప్పఁబడును.

ఇందుకు సమ్మతి.—

శ్లో. పంచీకృతమహాభూతసంభవం కర్మసంచితమ్,
శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే.

ఈ స్థూలశరీరమే అన్నమయకోశమని చెప్పఁబడును. అన్నమయకోశమనఁగా; తల్లిదండ్రులచేత భుజింపఁబడిన అన్నమువలనఁ బుట్టిన శుక్లశోణితంబులచేత నేదేహంబు పుట్టెనో తరువాత క్షీరాన్నంబులచేత నే దేహంబు వృద్ధిబొందుచున్నదో ఆ దేహము అన్నమయకోశ

మని చెప్పఁబడును. ఈ స్థూలదేహము పుట్టకమ్మునుపును మరణానంతర మందును లేదు గనుకను పంచమహాభూతంబులయొక్క కార్యంబును దృశ్యంబును జడంబును పరిచ్ఛిన్నంబును గనుకను కుడ్యాదులవలెనే ఆత్మ కానేరదు గనుక కుడ్యాదిద్రష్టయైనవాఁడు కుడ్యాదులకన్న భిన్నుం డెటులో అటుల స్థూలశరీరద్రష్టయైనవాఁడు స్థూలశరీరంబున కన్న భిన్నుఁడని విచారించి ముముక్షువైనవాఁడు ఆ స్థూలదేహసాక్షి చేతనుఁడైన ఆత్మ నేనని యెఱుఁగవలెను. సూక్ష్మశరీరమనగా; అపంచీ కృతభూతకార్యమైన పదునేడు అవయవమ్ములతోఁ గూడుకొనినది సూక్ష్మశరీరమని చెప్పఁబడును. ఆ పదునేడవయవంబులు నేవియనిన; జ్ఞానేంద్రియపంచకంబును, ప్రాణాదిపంచకంబును, మనస్సును, బుద్ధియుఁ గూడి పదునేడవయవంబు లని చెప్పఁబడును.

ఇందుకు సమ్మతి.——

శ్లో. పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియసమన్వితమ్,
అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్.

ఈ సూక్ష్మదేహము కోశత్రయాత్మకమని చెప్పఁబడును. కోశ త్రయమనఁగాఁ ప్రాణమయకోశమనియు, మనోమయకోశమనియు, విజ్ఞానమయకోశమనియు మూఁడువిధంబులు. ప్రాణమయకోశమనఁగా; పదియవయవంబులతోఁ గూడుకొనియుండును. ఆ పదియవయవంబులు నేవి యనిన; అపంచీకృతభూతకార్యమహాభూతంబులయొక్క ఆదిరైన రజోభాగంబువలన ప్రత్యేకప్రత్యేకంబులుగా క్రమంబుగాఁ బుట్టిన వాక్పాణిపాదపాయూపస్థ లనెడి పేరు గలిగిన కర్మేంద్రియంబులు, ఆ భూతంబులయొక్క రజోగుణసమష్టివలనఁ బుట్టిన ప్రాణాపానోదాన వ్యానసమానంబు లనెడి పేరుగలిగిన ప్రాణాదిపంచకంబులును, ఇవి పదియుఁగూడి ప్రాణమయకోశమని చెప్పఁబడును. మనోమయకోశ మనఁగా; అదియు నా అవయవంబులతోఁ గూడుకొనియుండును. ఆ యా అవయవంబులు నేవి యనిన; ఈ చెప్పఁబడిన అపంచీకృతపంచ మహాభూతంబులయొక్క ఆదిరైన సత్వగుణభాగంబులవలన ప్రత్యేక ప్రత్యేకంబుగా క్రమంబుగాఁ బుట్టిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబు

లనెడి పేరుగలిగిన జ్ఞానేంద్రియంబులును, ఆ భూతంబులయొక్క సమష్టి వలనఁబుట్టిన సంశయాత్మకమై అంతఃకరణవృత్తిరూపమైన మనస్సును, ఈ యీ అవయవంబులును మనోమయకోశమని చెప్పఁబడును. విజ్ఞానమయకోశమనఁగా; అదియు నా అవయవంబులతోఁ గూడుకొనియుండును. ఆ యీ అవయవంబు లెయ్యవియనిన; ఈచెప్పఁబడిన శ్రోత్రాది జ్ఞానేంద్రియంబులును, ఆ భూతంబులయొక్క సత్త్వగుణసమష్టివలనఁ బుట్టి నిశ్చయాత్మకమాయిన అంతఃకరణవృత్తిరూపమయిన బుద్ధి యీ యీఱును గూడి విజ్ఞానమయకోశమని చెప్పంబడును. ఈ కోశత్రయమును లింగశరీరమందే అంతర్భూతము. ఈ లింగశరీరము దృశ్యంబును జడంబును పరిచ్ఛిన్నంబును భూతకార్యంబును శరీరియు గనుక స్థూలశరీరంబువలెనే ఆత్మ కానేరదు. అయిన నీ లింగశరీరంబునకు భూతకార్య మెట్లనిన; 'అన్నమయం హి సౌమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వా'గనెడి శ్రుతిచే నిశ్చయింపఁబడుచున్నది. కాఁబట్టి యీ శరీరమును భూతకార్యమే కనుక స్థూలదేహంబువలెనే దీనికి దృశ్యత్వంబును జడత్వంబును పరిచ్ఛిన్నత్వంబును వికారత్వంబును నిశ్చయింపఁబడుచున్నది. స్థూలదేహద్రష్టయైన నేను స్థూలదేహముకన్న నెటుల భిన్నుండనో అటులనే లింగదేహద్రష్టయైన నేను ఆ లింగదేహంబునకన్న భిన్నుఁడను, ఆ లింగదేహంబునకు సాక్షి యని నిశ్చయించుకోఁదగినది. కాఁబట్టి శరీరమనఁగా నేది యనిన; హేతువై అనాదియై అనిర్వచనీయమై నిరుపాధికమైన బ్రహ్మజ్ఞానంబుచేతను నశింపఁబడునదై భావరూపమై జడమై మోహాత్మకమైన ఆత్మ ఆశ్రయంబుగాఁ గలిగినదై బ్రహ్మావారకమైనటువంటి ఆత్మజ్ఞానంబు కారణశరీరమని చెప్పఁబడును.

ఇందుకు సమ్మతి. —

శ్లో. అనాద్యవిద్యానిర్వాచ్యా కారణోపాధిరుచ్యతే,
ఉపాధిత్రితయాదన్యమాత్మానమవధారయేత్.

కారణశరీరమే ఆనందమయకోశ మని చెప్పఁబడును. దీనికి ఆనందమయకోశత్వ మెట్లనిన; ప్రియమోదప్రమోదవృత్తిమంతమగు అంతః

కరణము ఉపసర్జనంబుగాఁ గలిగినది గనుక ఆనందమయకోశ మని చెప్పఁబడును. ప్రియమోదప్రమోదవృత్తులనఁగా; ఇష్టమైనవస్తువును చూచిన మాత్రముచేత వచ్చునట్టి సంతోషంబునకు ప్రియమనిపేరు. ఆ వస్తువు లభించినవెనుక వచ్చినసంతోషమునకు ప్రమోదమని పేరు. ఆ వస్తువును భుజించినందువల్లఁ గలిగినసంతోషము ప్రమోదమని చెప్పఁబడును. ఈ యజ్ఞానంబునకు భావరూపత్వమెట్లనిన; నేను అజ్ఞుఁడను జడుఁడను మోహితుఁడను అసంతుష్టుఁడనని సమస్తప్రాణులచేత అజ్ఞానం బనుభవింపఁబడుచున్నది. ఈ యజ్ఞానంబునకు దృశ్యత్వ మెట్లనిన; నేను అజ్ఞానిని, నా యజ్ఞానంబు నన్ను బాధించుచున్నది, నా యజ్ఞానంబు వెనుక ముందర తోఁచనీయలేదని సాక్షియైన నాచేత నెఱుఁగఁబడుచున్నది గనుక నజ్ఞానంబునకు జడత్వంబును మోహత్వంబును నిశ్చయింపఁదగినది. ఈప్రకారంబుగాఁ జెప్పఁబడిన యుక్తులచేత పంచకోశస్వరూపంబునకు శరీరత్రయంబునకు అనాత్మత్వంబు స్పష్టంబుగా నిశ్చయింపఁబడుచుండఁగా నే సాక్షిస్వరూపమైనబోధ శేషించుచున్నదో ఆ యాత్మ శరీరత్రయముకన్న విలక్షణుఁడైన ప్రత్యగాత్మ యని చెప్పఁబడును. ఆ ప్రత్యగాత్మ నేనని ముముక్షువుచేత నిశ్చయించుకొనఁదగినది. చెప్పఁబడినయుక్తులచేత పంచకోశాత్మకమైన శరీరత్రయమునకు ఆత్మత్వంబు కూడదు. కనుక నెవఁడు దేహేంద్రియాదివిలక్షణుఁడైన ఆత్మ నేనని యెఱుఁగుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము. అవస్థాత్రయమనఁగా; జాగ్రదవస్థయనియు, స్వప్నావస్థయనియు, సుషుప్త్యవస్థయనియు మూఁడువిధంబులు. ఇందులో జాగ్రదవస్థ శ్రోత్రమాదిగాఁగలిగిన యింద్రియంబులచేత శబ్దాదివిషయజ్ఞాన మెంతపర్యంతము వచ్చుచున్నదో అంతపర్యంతంబును జాగ్రదవస్థ యని చెప్పఁబడును. ఈ జాగ్రదవస్థయందును స్థూలశరీరమందును అభిమానముగల ఆత్మకు విశ్వుఁడనియు, వ్యావహారికుఁడనియు, చిదాభాసుఁడనియు మూఁడుపేళ్లు. అవి యెట్లనిన? సమస్తమందును అభిమానంబు నేయుచున్నాఁడు గనుక విశ్వుఁడని పేరు. సమస్తవ్యవహారంబులును నేయుచున్నాఁడు గనుక వ్యావహారికుఁడని పేరు. చిత్తువలెనే తోఁచుచున్నాఁడు గనుక చిల్లక్షణంబులేనివాఁడు గనుక ఇతనికి చిదాభాసుఁడని పేరు. ఇట్లు

వ్యష్టిస్వరూపంబు నిరూపించితిమి. ఈ స్థూలశరీరంబును సమష్టివ్యష్టి భేదంబులచేతను రెండువిధంబులైయుండును. సమస్తజాగ్రదవస్థలయందును సమష్టిస్థూలశరీరమందును అభిమానముగల ఆత్మకు విరాట్టనియు, వైశ్వానరుఁడనియు, వైరాజసుఁడనియు మూఁడు పేళ్లు. అది యెట్లనిన; నానావిధంబులుగాఁ దోఁచుచున్నాఁడు గనుక విరాట్టనియు, సమస్త నరులయందును నేనని అభిమానంబు చేయుచున్నాఁడు గనుక వైశ్వానరుఁడనియు, విశేషంబుగాఁ దోఁచుచున్నాఁడు గనుక వైరాజసుఁడనియు పేళ్లు వచ్చెను. స్వప్నావస్థ యేది యనిన; జాగ్రద్వాసనవల్లఁ బుట్టిన విషయంబుతోఁ గూడుకొనియుండెడి జ్ఞానంబు స్వప్నావస్థయని చెప్పఁబడును. ఈ స్వప్నావస్థయందును సూక్ష్మశరీరమందును అభిమానము గల ఆత్మకు తైజసుఁడనియు, ప్రాతిభాసికుఁడనియు, స్వప్నకల్పితుఁడనియు మూఁడు పేళ్లు. అది యెట్లనిన; తేజోరూపమైన అంతఃకరణ వృత్తితోఁ గూడుకొన్నాఁడు గనుక తైజసుఁడనియు, తోఁచేకాలమందు మాత్రమున్నాఁడు గనుక ప్రాతిభాసికుఁడనియు, అజ్ఞానకార్యమయిన నిద్రాశక్తితో కల్పింపఁబడెను గనుక స్వప్నకల్పితుఁడనియు మూఁడు పేళ్లు వచ్చెను. స్థూలశరీరవ్యష్టి నిరూపించితిమి. ఇఁక సూక్ష్మశరీర వ్యష్టిని నిరూపించుచున్నారము.

ఈ సూక్ష్మశరీరంబు సమష్టివ్యష్టిభేదంబులచేత రెండువిధంబులై యుండును. సమస్తస్వప్నావస్థయందును సూక్ష్మశరీరసమష్టియందును అభిమానముగల ఆత్మకు హిరణ్యగర్భుఁడనియు, సూత్రాత్ముఁడనియు, ప్రాణుఁడనియు మూఁడు పేళ్లు. అదియెట్లనిన; జ్ఞానశక్తి గలవాఁడు గనుక హిరణ్యగర్భుండనియు, నానావిధంబులైన మణులయందు కూర్పఁబడిన సూత్రంబువలెనే నానావిధప్రపంచమందును అనుస్యూతుఁడై యున్నాఁడు గనుక సూత్రాత్మయనియు, క్రియాశక్తితోఁ గూడుకొనియున్నాఁడు గనుక ప్రాణుఁడనియు మూఁడు పేళ్లు వచ్చెను. సుషుప్త్యవస్థ యనఁగా నేది యనిన; సమస్తవిషయజ్ఞానంబు లేకుండుట యేదిగలదో అది సుషుప్తి యని చెప్పఁబడును. ఈ సుషుప్త్యవస్థయందును కారణశరీర మందును అభిమానించిన ఆత్మకు ప్రాజ్ఞుఁడనియు, పారమార్థికుఁడనియు, అపరిచ్ఛిన్నుఁడనియు మూఁడు నామధేయంబులు చెప్పఁబడును. అవి

యెట్లనిన; స్వప్రకాశస్వరూపుఁడు గనుక ప్రాజ్ఞుఁడనియు, అవస్థాత్రయం బులయం దనుస్యూతుఁడై యున్నాఁడు గనుక పారమార్థికుఁడనియు, దేహేంద్రియాద్యుపాధులచేత నపరిచ్ఛిన్నుఁడు గనుక అపరిచ్ఛిన్నుఁ డనియు మూఁడుపేళ్లు వచ్చెను. సూక్ష్మశరీరవ్యష్టి నిరూపించితిమి. కారణశరీరసమష్టిని నిరూపించుచున్నారము.

ఈ కారణశరీరంబును వ్యష్టిసమష్టిరూపంబులచేత రెండువిధం బులై యుండును. సమస్తసుషుప్త్యవస్థయందును కారణశరీరసమష్టి యందును అభిమానముగల ఆత్మకు ఈశ్వరుఁడనియు అంతర్యామి యనియు అవ్యాకృతుఁడనియు మూఁడుపేళ్లు. అదెయెట్లనిన; సమస్త ప్రాణులను శిక్షింపుచున్నాఁడు గనుక నీశ్వరుఁడనియు, సమస్తప్రాణుల యొక్క హృదయమందును ఉండి సమస్తప్రాణులను ప్రేరేపించు చున్నాఁడు గనుక అంతర్యామి యనియు, నామరూపరహితుఁడై యున్నాఁడు గనుక అవ్యాకృతుఁడనియు మూఁడుపేళ్లు వచ్చెను. ఈ ప్రకారంబుగా వ్యష్టిసమష్టిశరీరత్రయంబు జాగ్రత్స్వప్నసుషుప్తులను వ్యష్టిసమష్ట్యభిమానులను స్పష్టంబుగ నిరూపించితిమి. ఈ చెప్పఁబడిన శరీరత్రయంబునకన్న అన్యమై ముప్పదియాఱుతత్త్వంబు లుండఁగా వానిని చెప్పకయే శరీరత్రయంబుమాత్రము చెప్పితిరి. ఆ ముప్పది యాఱుతత్త్వంబులను చెప్ప లేదనిన; ఆ ముప్పదియాఱుతత్త్వంబులును శరీరత్రయమందే అంతర్భూతములును, ఆశరీరత్రయంబు చెప్పినందున ఆముప్పదియాఱుతత్త్వంబులు చెప్పఁబడెను. అయిన ఆ ముప్పదియాఱు తత్త్వములు నేవి యనిన; ఆకాశాదిపంచమహాభూతములును, ఆకా శాదులకు గుణములయిన శబ్దస్పర్శరూపరసగంధములును, త్వక్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణములును, వాక్పాణిపాదపాయూపస్థలును, ప్రాణా పానవ్యానోదానసమానవాయువులును, నాగకూర్మకృకరదేవదత్తధనం జయములును, మనోబుద్ధిచిత్తాహంకారములు ననెడి అంతఃకరణచతు ష్టయమును ఒకటియైన అవిద్యయును ముప్పదియాఱువవాఁడై పశు తుల్యుఁడయిన జీవుఁడును కూడి ముప్పదియాఱుతత్త్వములని చెప్పఁ బడును. ఐన నీ ముప్పదియాఱుతత్త్వములకన్న భిన్నుఁడయినవాఁడు పరమశివుఁడని చెప్పఁబడును.

జ్ఞానేశ్వర సమ్మతి—

ఆకాశాదీని భూతాని పంచ తేషాం ప్రకీర్తితాః,
గుణాశ్శబ్దాదికం పంచ పంచ కర్మేంద్రియాణి చ.
జ్ఞానేంద్రియాణి పంచైతే ప్రాణాద్యా వాయవః,
మనోబుద్ధిరహంకారశ్చిత్తం చేతి చతుష్టయమ్.
తేషాం కారణభూతైకావిద్యా షట్త్రింశతః పరః,
విశ్వస్య జగతః కర్తా పశోకస్య పరశ్శివః.

ఇశ్లోకమున్ముప్పదియాఱుతత్త్వములును నిరూపించినారు. తత్త్వములలో నంతర్భూతము లని నిశ్చయించి యిరువదినాలుగుతత్త్వములే యనని చెప్పినారు. ఆ యిరువదినాలుగుతత్త్వము లేవి యనగా: జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, ప్రాణాదిపంచకము, శబ్దాదిపంచకమునుచోడి అంతఃకరణచతుష్టయముతో యిరువదినాలుగు తత్త్వము అని చెప్పఁబడెను.

శ్లో. జ్ఞానేంద్రియాణి పంచైవ పంచకర్మేంద్రియాణి చ,
తథా ప్రాణాదయః పంచశబ్దాదయ స్తథా.
మనోబుద్ధిరహంకారశ్చిత్తం చేతి చతుష్టయమ్,
ఇత్యాదికాని తత్త్వాని చతుర్వింశతికాని వై.
ప్రాహుర్వేదవిదః ఇతి సమస్తశాస్త్రేషు నిశ్చితమ్.

ఇం. ఇంద్రియాధిష్ఠానదేవతలను నిరూపించుచున్నారము.

శ్లో. దిగ్వాతార్కప్రచేతోశ్వివహ్నీంద్రోపేంద్రమృత్యుకాః,
తథా చంద్రశ్చతుర్వక్త్రో రుద్రక్షేత్రజ్ఞ ఈశ్వరాః.

ఇటువలెనే తదధిష్ఠానదేవతలను నిరూపించినారము. శ్రోత్రాది జ్ఞానేంద్రియములకును శబ్దస్పర్శరూపరసగంధములును, వాగాదికర్మేంద్రియములకును వచనాదానగమనవిసర్గానందములును విషయములు. అంతః

కరణచతుష్టయమునకు సంకల్పనిశ్చయాభిమానావధారణములు విషయములు. ఈప్రకారముగా విచారించి శరీరత్రయవిలక్షణుఁడై అవస్థాత్రయరహితుఁడై అఖండసచ్చిదానందస్వరూపుఁడైన ప్రత్యగాత్మయే నేనని లక్ష్యార్థముచే నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో వాఁడే బ్రహ్మము, ఈయర్థమందు సంశయము లేదు. సిద్ధము. ఈయర్థమందు శ్రుతిస్మృతులు ప్రమాణంబులు. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి. సర్వం అభయం వై బ్రహ్మాప్నోతి, తరతి శోకమాత్మవిత్, తత్ర కో మోహః, కశ్శోక ఏకత్వ మనుపశ్యతః, అభయం హి ప్రాప్నోతి."

"అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసీ"తి భగవద్వచనాత్.
ఆత్మానాత్మవివేకేన పుంసాం సంసారనిర్వృతిః,
తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో న సిద్ధ్యతి,
ఆత్మానాత్మవివేకం తు కృత్వా తిష్ఠతి యః పుమాన్,
జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః.

ఇవి మొదలైన శ్రుతిస్మృతులు ప్రమాణము లున్నవి గనుక ముముక్షువులైనవారలు ముక్తిహస్తమయి సంశయింపవలదు.

ఇది షట్ప్రకారాంతర ప్రశ్నకము.

శ్రీవాసుదేవమననము సంపూర్ణము.

ఓం శ్రీకృష్ణార్పణమస్తు.

